# తిరుపతి శ్రీ వేంకటాద్రిరాముడు

(తిరుపతి శ్రీ కోదండరామస్వామి దేవాలయ విశిష్టత)

తలుపూరు రామ రమేశ్ కుమార్

ప్రచురణ




తిరుమల తిరుపతి దేవస్థానములు

తిరుపతి

# తిరుపతి శ్రీ వేంకటాద్రిరాముడు

(తిరుపతి శ్రీ కోదండరామస్వామి దేవాలయ విశిష్టత)

తలుపూరు రామ రమేశ్ కుమార్




ప్రచురణ
కార్యనిర్వహణాధికారి
తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి
2004

**Tirupati Sri Venkatadri Ramudu**
*(Glory of Sri Kodanda Rama Swamy Temple)*
**Telugu**

*by*
**Thalupuru Rama Ramesh Kumar**



T.T.D. Religious Publications Series No : 663

First Edition : 2004
Reprint : 2004

Copies : 5,000

*Published by*
**Sri Ajeya Kallam, I.A.S.,**
Executive Officer,
Tirumala Tirupati Devasthanams,
Tirupati — 517 507

*Printed at*
Tirumala Tirupati Devasthanams Press,
Tirupati — 517 507

# ముందుమాట

దేవాలయాలు మానవజాతి నాగరికతకు, సంస్కృతికి చిహ్నాలు. మానవజాతి అభ్యున్నతికి దేవాలయాలు నిరంతర కృషిని సాగిస్తూనే ఉన్నాయి. తిరుమల తిరుపతులలో వెలసిన దేవాలయాలు ప్రపంచ ప్రఖ్యాతి గాంచిన ఆ ౹యాలు. ఈ ఆలయాల చరిత్రను సమగ్రంగా తెలుసుకొనేందుకు చాలమంది ప్రయత్నించారు. తిరుమల ఆలయం గురించి మనకు ఆంగ్లంలో అనేక గ్రంథాలు దేవస్థానమే ప్రచురించింది. తిరుపతిలోని దేవాలయాల గురించిన పుస్తకాలు తెలుగులో చాల తక్కువగా ఉన్నాయి.

తిరుపతిలో వెలసిన గోవిందరాజస్వామి ఆలయం, పద్మావతి అమ్మవారి ఆలయం, కోదండరామస్వామి ఆలయాలు ప్రాచీనతను సంతరించుకొన్నవి. కోదండరామస్వామి ఆలయచరిత్రను 'తిరుపతి వెంకటాద్రి రాముడు' అనే పేరున చిరంజీవి తలుపూరు రామ రమేశ్ కుమార్ సంగ్రహంగా వ్రాసాడు. కోదండ రామాలయం గురించిన ఈ రచన చారిత్రకదృక్పథంలో వ్రాయడం ముదావహం. ఈ చిరంజీవికి శ్రీరాముడు ఆశీస్సులు ఉండుగాక!

పాఠకులు మా ప్రచురణలను సమాదరిస్తున్నట్లే ఈ చిన్ని పుస్తకాన్ని కూడ సమాదరిస్తారని భావిస్తున్నాం. ప్రతులు చెల్లిపోయిన కారణంగా పునర్ముద్రిస్తున్నాం.

కార్యనిర్వహణాధికారి
తి.తి. దేవస్థానములు, తిరుపతి.

# ప్రార్థన

"శుభకరమిభరాజముఖం
శుభ్రరదం శూర్పకర్ణమరుణాభమ్!
సుందరమంఘ్రి జితాబ్జం
చతుర్భుజం సాయుధం కలయే" ॥ -

లోకాభిరామం రణరంగధీరం!
రాజీవ నేత్రం రఘువంశ నాథం ॥
కారుణ్య రూపం కరుణాంతరంగం !
శ్రీరామ చంద్రం శరణం ప్రపద్యే ॥

"ఆపదా మపహర్తారం దాతారం సర్వ సంపదాం!
లోకాభిరామం శ్రీరామం భూయో భూయో నమామ్యహమ్॥"

"రామో రాజామణిస్సదా విజయతే రామంరమేశంభజే
రామేణాభిహతా నిశాచర చమూ రామాయ తస్మైనమః
రామన్నాస్తి పరాయణం పరతరం రామస్య దాసోఽ స్మ్యహం
రామే చిత్తలయస్సదా భవతు మే భోరామ మాముద్ధర॥"

"శ్రీరామ రామరామేతి రమే రామే మనోరమే!
సహస్ర నామతత్తుల్యం రామనామ వరాననే॥"

"నమోస్తు రామాయ సలక్ష్మణాయ
దేవ్యైచ తస్యై జనకాత్మజాయై ॥
నమోస్తు రుద్రేంద్ర యమానిలేభ్యో
నమోస్తు చంద్రార్క మరుద్గణేభ్యః॥"

అంజనానందనం వీరం
జానకీ శోకనాశనం।
కపీశం అక్ష సంతాపం
వందేలంకా భయంకరం ॥

# అంకితం



ఇది

శ్రీ సీతా, లక్ష్మణ, భక్తాంజనేయ

సమేత

**శ్రీ కోదండరామస్వాములవారి**

**పాదారవిందములకు**

**సమర్పణం**

# ఆముఖము

తిరుపతి పట్టణము నడిబొడ్డునకల సీతా లక్ష్మణ హనుమత్సమేత శ్రీ కోదండరామస్వామి దేవాలయ పుట్టు పూర్వోత్తరములను తిరుమల యాత్రకై వచ్చు యాత్రికులకును, తిరుపతి వాసులలో కొందరికిని తెలియని విశేషములను పశ్చిమాభిముఖుడగు కోదండరాముని పురాణ గాథను తెల్పే రచన యిది.

"వ్రాసిన రామచంద్రుకథవ్రాయవలెనన్న" ఆర్యోక్తిని మనసున మననము చేసికొని తిరుమల తిరుపతి దేవస్థానముల యాజమాన్యమున నిత్యకైంకర్యములను ఈ దేవాలయమునకధి దైవతయగు శ్రీరామ చంద్రుని అర్చనాదికములను వైఖానసాగమయుక్తముగా ఈయాలయ మున పూజలు సాగుటను సప్రమాణముగా నిరూపించుటకై ఈ గ్రంథ రచయిత కావించిన ప్రయత్నము మెచ్చతగినది. చరిత్ర ప్రసిద్ధికల ఈ ఆలయమును గూర్చిన అనేక పురాణ గాథలను, జన సామాన్యమున ఆనోట, ఆనోట వినవచ్చెడి గాథలను కూడ ఈ రచయిత తన రచననలో చర్చించినారు. దీనికి కారణము ఎందఱో మహానుభావులు ఈ దేవాలయమును గూర్చి తలన్పర్శిగా పరిశీలించియున్నారని తెలియచేయవలెనను తలపుగా నేను భావిస్తున్నాను. స్వామి గర్భాలయ నిర్మాణము మొదలుకొని చుట్టు ఉన్న ప్రాకారము, దాని మీది చిత్రములు, శిల్పాదికములు మొదలగు వానిని కూడా. చి॥ రమేశుడు వివరించుట చూడగా, ఈతనికి దేవాలయ శిల్ప నిర్మాణదికముల మీద కల ఆసక్తి మెచ్చతగ్గది.

ఆంగ్లేయుల పరిపాలన కాలమున భారతదేశము నందలి అందునా దక్షిణ దేశ దేవాలయముల పరిపాలనమునకై వారేర్పఱచిన నియమా వళిని (దీనినే తిరుమల తిరుపతి దేవస్థానములలో సవాల్ జవాబు పట్టి అని అందురు). క్షుణ్ణముగా అధ్యయనము చేసి - తిరుమల శ్రీనివాసుని ఆలయము నందు నిర్వహించు ఆరాధనాదికములను - తిరుపతి

కోదండరాముని ఆలయమున జరుగు నిత్య కైంకర్యములను తులనాత్మకముగా పరిశీలించి - ఈ రెండిటికిని అభేదారాధ్యవసాయముగా నిరూపించుటకై ఈ రచయిత ప్రయత్నము చేసినాడనవలసియున్నది. ఒకనాడు తిరుపతి యందలి కపిలతీర్థమునకు సమీపమున విజయనగర సామ్రాజ్య కాలమున అచ్యుత దేవరాయపురమని పిలువబడుచుండి, అప్పటి మహమ్మదీయుల దండయాత్రలో ఖిలమైన కోదండరామాలయము, తిరుపతి నడ్డి బోడ్డున నేటి కోదండరామాలయముగ పునర్నిర్మితమైనదనుట సత్యము. అయితే ఈ ఆలయమున అనేకములగు మార్పులు కాలగతిననుసరించి 'మారినదను సత్యమును కూడా ఈ రచయిత తన ఈ గ్రంథమున నిరూపించినాడు.

ఈ రామాలయము నందలి వంటసాలలో వకుళమాలిక విగ్రహమున్నదని ఈతడు వ్రాసినాడు. ఇది విచార్యము. శ్రీరామునకెదురుగనున్న ఆస్థాన మండపము అందలి స్తంభాదుల నిర్మాణమును, ఎదురుగనున్న ఆంజనేయస్వామి దేవాలయమును, నిత్యోత్సవ, పక్షోత్సవ, వారోత్సవ, మాసోత్సవ, సంవత్సరోత్సవాదులను జరుపు పద్ధతిని, తిరుమల యందు వలెనే ఇచట జరుగు ఆస్థానోత్సవాదులను చక్కగా వివరించినాడు. అనిటికన్న ఎన్నాళ్లుగానో జరుగకుండిన, సీతాకల్యాణ, శ్రీరామపట్టాభిషేక ఉత్సవములను - ఈ రెండుత్సవములను తప్పని సరిగా నిర్వహింపవలెనని ఉత్తర్వు కావించి దేవాలయదిట్టములో చేర్పించిన నాటి ఎక్సిక్యూటివ్ ఆఫీసరు శ్రీపత్రివెంకటరామకృష్ణప్రసాదు (శ్రీ పి.వి.ఆర్.కె. ప్రసాద్)గారిని పేర్కొనుట ఎంతయో మెచ్చదగి యున్నది.

తిరుమల స్వామితో సంబంధమున్న ఈ ఆలయ చరిత్రను తఱచి తచ్చిన చారిత్రిక పరిశీలన మీ గ్రంథమని చెప్పక తప్పదు. ప్రాచీన చరిత్రను మఱచిపోవు ఈ కాలమున ఈ గ్రంథము చదువరులను ఆస్తిక ఆసక్తికర మార్గమున నడపగలదని నానమ్మకము.

ఈ రచయిత మాతామహులు కీ॥శే॥ తాటికొండ సుందరరామయ్యగారును, వారి సోదరులు కీ॥శే॥ వేంకటకృష్ణయ్యగారును ఆనాళ్లలో

తిరుమల తిరుపతి దేవస్థానములలో ప్రముఖోద్యోగులుగను, ప్రముఖ ఆంధ్ర భాషాధ్యాపకులుగాను వుండి ఈ దేవాలయమునకెంతయో సేవ జేసినవారు. ఈ రచయిత మఱికొన్ని రచనలను చారిత్రక దృక్పధము తో రచించుగాక! తిరుపతి "శ్రీ వేంకటాద్రిరాముడని" పేరు పెట్టుటలో రచయిత మనోభావము -తిరుమల శ్రీనివాసునకును, తిరుపతి శ్రీ కోదండరామునకును భేదము లేదను నమ్మకయేయని నేను తలచు చున్నాను. ఈతడికి సకలైశ్వర్యములను శ్రీనివాసుడనుగ్రహించుగాక! అని ఆశీర్వదిస్తున్నాను.

తిరుపతి

16-02-2003

భక్తాంఘ్రిరేణువు,

సింగరాజ సచ్చిదానందం.

(మాఘ వ్యాసపూర్ణిమ, 16-02-2003)

# తొలిపలుకు

ముందుగా నా తల్లి బాలత్రిపురసుందరి, తండ్రి శివరామయ్యలకు వందనములు.

మన సంస్కృతిని, ఔనత్యాన్ని చాటి చెప్పేవి దేవాలయాలు, రామాయణ, భారత ఇతిహాసాలు అనటం అతిశయోక్తి కాదు! మన దేశంలో పుణ్యక్షేత్రాలు, తీర్థాలు, ఎంతో పురాతన చరిత్ర కలిగిన దేవాలయాలు ఎన్నో వెలసి ఉన్నాయి. వీటిలో కొన్ని స్థల పురాణాల ఆధారంగా, భగవత్ శక్తి కేంద్రీకృత ప్రదేశాలుగా, ఎందరోయోగులు, జ్ఞానులు, తపశ్శక్తి సంపన్నులైన మహర్షులచే ప్రతిష్టించబడి ఉంటే; మరికొన్ని మన సాంప్రదాయాల్ని, భక్తిని పెంపొందింపచేసే ఉద్దేశ్యంతో ప్రతిష్టించబడినవి. ఇవన్నీ పుణ్యభూమికలే. ఎన్నో రకాల పురాణ విద్యలకు, సంగీత, సాహిత్య శిల్ప కళలకు ఈ దేవాలయలే కేంద్రాలు. ప్రతి దేవాలయం తగిన ఆగమశాస్త్ర పద్ధతిలో లోక శ్రేయస్సుకై నిర్మించబడి భక్తుల ఆధ్యాత్మిక, జ్ఞాన, తపస్సముపార్జనలకు దోహదపడుతున్నాయి. వీటి నిర్మాణం వెనుక ఎంతో తపశ్శక్తి, కృషి, దీక్ష ఉన్నాయి. వీటి నిర్మాణానికి కారకులైన వారందరూ మహాపురుషులు, పుణ్యమూర్తులు; వారికి మనం ఎంతో ఋణపడి ఉన్నాము.

మన దేశంలో ఎందరో మహాభక్తులు, కవులు, గాయకులు, కళాకారులు దేవాలయాల ద్వారానే లోకంతో సంబంధం గలిగి లోకప్రసిద్ధులైనారు ఉదాహరణకు పండరీనాధుని కొలిచిన తుకారాం, శ్రీకాళహస్తీశ్వర శతకకర్త ధూర్జటి. బేలూరుహళిబేడు శిల్పకళాకారుడైన అమరశిల్పి జక్కన్న, భద్రాచల భక్తరామదాసు, తిరుమలో శ్రీ వేంకటేశ్వర స్వామి భక్తాగ్రగణ్యుడైన శ్రీ తాళ్ళపాక అన్నమయ్య. ఇలా "ఎందరో మహానుభావులు - అందరికీ వందనములు". ఇలాంటి పవిత్ర ప్రదేశాల్ని గురించి తెలుసుకొనటం, వాటిని దర్శించటం కూడా పుణ్యమే.

దిగువ తిరుపతిలోని శ్రీకోదండరామస్వామి ఆలయము స్థానికులకు

ఎంతో సుపరిచయమైననూ, యాత్రికులకు అంతగా తెలియదు. ఈ స్వామి వారి ఆలయంలో కొన్ని విశేషాలను గమనించిన పిమ్మట, స్వామి వారి "సౌందర్యలహరి"ని భక్తులకు తెలియజేయాలన్న ఆకాంక్షతో, చేసే చిన్న ప్రయత్నమే ఈ పుస్తక రూపం.

ఈ ఆలయం గురించి అనేక సందర్భములలో బంధుజన భక్త మిత్రులతో సాగించిన చర్చల అనంతరం వీరందరి ప్రోత్సాహముతో ఈ సాహసమునకు పూనుకొన్నాను. నిజానికి ఇది నేనొక్కడినే చేసిన పనికాదు. దీని వెనుక ఎందరో మహానుభావుల ప్రేరణ, సహాయము, స్ఫూర్తి ఉన్నవి.

ముఖ్యంగా నన్ను ప్రోత్సహించిన భక్త మిత్రుడు శ్రీ మురళిగారికి (S/o. శ్రీ వి. గోవిందన్, తిరుపతి) ధన్యవాదాలు తెలియజేసికొంటున్నాను. వీరింటిల్లపాది మంచి భక్తులు: సంగీతం అభ్యసిస్తున్న ఇతనికి త్యాగరాజ నుతుడైన శ్రీరామచంద్రుని ఆశీస్సులు ఎల్లవేళలా ఉండునుగాక!

నా ఆలోచనల్ని గ్రంథస్థం చేసి, భక్తజనులకు స్వామిని గూర్చి పుస్తకరూపంలో అందిచమని సలహాలనిచ్చి, అనుక్షణం నావెంట ఉండి నన్ను ప్రోత్సహించిన మా పిన తల్లులు, శ్రీమతి విజయప్రభ, శ్రీమతి యోగప్రభ, నా సహోదరి శ్రీమతి టి. మీనాకుమారి, బావగారు శ్రీ డా॥టి.పి. సుధాకర్, మా పెద్దమ్మ పుత్రుడు జి. రవికుమార్, మా పెదమేనమామ పుత్రులైన రమణకుమార్, కృష్ణమోహన్, ఇంకా ఇంటిల్లపాదికి నా కృతజ్ఞతలు తెలియజేసికొంటున్నాను. మా బంధు మిత్రులు శ్రీ కె.పాపయ్యనాయుడు, శ్రీ వై.జయచంద్రారెడ్డి, శ్రీ కృష్ణాజీ గార్లకు ప్రత్యేకంగా ధన్యవాదములు తెలియజేసుకొంటున్నాను. ముఖ్యంగా మా బంధుమిత్రుడు, నాసహోద్యోగి అయిన చి॥ కె.గోపాల కృష్ణయ్య (S/o. శ్రీ కె. నాగరాజ గారు, Rtd., H.M. TTD Orental High School, Tirupati.) విశేషమైన సహాయసహకారాల్ని అందించారు. వీరికి ప్రత్యేకంగా ధన్యవాదాలు తెలియజేసుకొంటున్నాను. వీరింటిల్లిపాది నాకు ఎంతో ప్రోత్సాహన్ని అందించారు.

ఈ పుస్తక రచన 2002లో వినాయకచవితినాడు ఆరంభించి. విజయ

"శ్రీరామచంద్రహనుమా!" అన్న గీతమును ఆశువుగా వ్రాసి ఇచ్చిన శ్రీ వీరేశ్వరయ్యగారికి ధన్యవాదములు.

పుస్తకము చాలా వరకు పూర్తి అయిన తరువాత తలవని తలంపుగా అన్నమాచార్య ప్రాజెక్ట్ ప్రసిద్ధ గాయకుడైన శ్రీ బాలకృష్ణప్రసాద్ గారి ద్వారా పరిచయమైన శ్రీ వేదాంతంరాజగోపాల చక్రవర్తి గారు (విజయవాడ), (తిరుపతిలోని హిస్టరీ కాంగ్రెస్ కి వచ్చివుండినారు) తను స్వయంగా పుస్తకమును అడిగి తనతో తీసికొని వెళ్ళి ముద్రారాక్షసములను సరిచేసి, తగిన సలహాలను, సూచనలను ఇచ్చి ప్రోత్సహించారు. వీరికి ధన్య వాదములు.

చిన్నవాడైనప్పటికీ ఎంతో కౌశల్యంతో ఆలయ ప్రాకారము, గోపురము, సన్నిధి వీథిలోని ధ్వజస్తంభము ఇంకా అనేక రామాయణ, చిత్రగాథల ఫోటోలను తీసిన చి॥రమణ (వెంకటరమణ స్టూడియోస్)కు ఆశీఃపూర్వక ధన్యవాదములు తెలియజేసికొనుచున్నాను.

మా సంస్థలో ఏజంట్‌గా ఉంటూ అత్యంత ఆకర్షణీయంగా, ఒకసారి చూచినా అలానే చిత్రాలను గీయగల చిత్రకారుడు ఎస్.ఎస్.భవానీ శంకర్‌గారు (S/o. యస్.వి.సుబ్రహ్మణ్యంరెడ్డి, D.No. 2-208, టి.టి.డి. ఎంప్లాయీస్ కాలనీ, Near వైకుంఠపురం, ఎమ్.ఆర్.పల్లి, తిరుపతి) గీచిన, అలంకరణ లేని "శ్రీసీతారామ లక్ష్మణుల" విగ్రహాల చిత్రము ఇందు పొందుపరచడమైనది. వీరికి నా ప్రత్యేక ధన్య వాదములు.

మా చిన్నాన్న శ్రీ సుబ్రహ్మణ్యంగారు శ్రీవారి ముఖమంటపరేఖ చిత్రపటాన్ని గీసి ఇచ్చారు. వీరికి ధన్యవాదములు.

అడిగిన వెంటనే నన్ను ప్రోత్సహించి, ఆశీర్వదించి, పీఠిక, పరిచయము వ్రాసి ఇచ్చిన పూజ్యులు శ్రీ సింగరాజు సచ్చిదానందం గారికి ప్రత్యేకంగా సునమస్కారములు తెలియజేసికొనుచున్నాను.

చి॥ వేలూరు పశుపతి,(S/o.Sri V.RAMACHARI, R.N. MADA STREET, TPT ) చి॥మాణిక్యం కార్తికేయన్,(చింతకాయల వీధి, తిరుపతి), చి॥ వర్ణొత్తు.చంద్రశేఖర్ (క్రొత్తవీధి, తిరుపతి) అనే మిత్రత్రయం

సారథ్యంలో నున్న "సప్తగిరి గ్రాఫిక్స్ & సాఫ్ట్‌వేర్స్" నందు ఈ పుస్తక కంప్యూటర్ ముద్రణ చేసికొనింది. ఈ ముగ్గురు మిత్రులకు నా ధన్యవాదములుతో కూడిన కృతజ్ఞతలందజేసుకొనుచున్నాను. వీరికి శ్రీరామచంద్రుని అనుగ్రహముండుగాక! శ్రీ రామాచారి గారు కూడా చాలా విశేష విషయాలను తెలియపరచి నన్ను ప్రోత్సహించారు. వీరికి కూడా ధన్యవాదములు.

భక్తులెందరో శ్రీ వేంకటేశ్వరస్వామి ఆలయమును బాగా ఎఱిగి వుందురన్న అభిప్రాయమ్ముతో ఈ శ్రీ కోదండరామాలయం వర్ణన చాలవరకు ఆ ఆలయవర్ణన ఆధారంతో సాగించడం జరిగింది. ఇందుకు తగిన విధంగానే ఈ ఆలయ నిర్మాణం మిగతా ఆలయ నిర్మాణాల కంటే శ్రీవారి ఆలయంతో ఎంతో ఎక్కువ పోలిక కలిగి వుండటం మూలాన ఈ వర్ణన చాలా సులభతరమయ్యిందనే చెప్పవచ్చు. అందుకే ఈ పుస్తకమునకు **"తిరుపతి శ్రీవేంకటాద్రిరాముడు"** అని పేరు పెట్టడం జరిగింది.

ఆలయాల్లోని మూల మూర్తులను చూసినప్పుడు ఒకొక్కరు ఒక్కొక్క విధమైన అనుభూతితో, ఒక్కో విధమైన అభిప్రాయముతో పూజించవచ్చు. ఉదాహరణకు శ్రీ వేంకటేశ్వరస్వామినే కొందరు ఈశ్వరునిగా, కొందరు శక్తిగా, కొందరు పూర్తి విష్ణుతత్త్వముగా, కొందరు హరిహరతత్త్వముగా, మరికొందరు సుబ్రమణ్యస్వామిగా ఆరాధిస్తారు. ఇందుకే మా తాతగారు కీ॥శే॥తా.వేంకటకృష్ణయ్యగారు వ్రాసిన "శ్రీవేంకటేశ్వర దివ్యతత్త్వ వైభవము" అనే అధ్యాయాన్ని పొందుపరుచుచున్నాను. ఇదివరకు ఈ వ్యాసాన్ని 1942 లో తి.తి.దే. వారి మాస పత్రికలో ప్రచురించిఉన్నారు.

ఎవరెన్ని విధముల ఆరాధించిననూ చివరకు అన్ని ఆపరమాత్మడైన ఏకస్వరూపుడైన పరబ్రహ్మకే చెందుతాయి. అందుకే ఇందులో శ్రీరామ దివ్యతత్త్వాన్ని నేను శ్రీ వేంకటరామతత్త్వంగా అభివర్ణించాను. ఇందులో ఏమైనా లోపాలు ఉంటే పండితులైనవారు, సహృదయంతో మన్నించ గలరని మనవి.

ఈ పుస్తకమును తిరుపతి శ్రీ కోదండరామునికి అంకితంచేసితిని ఇందుమూలంగా దీనికి సంబంధించిన సర్వహక్కులను తిరుమల తిరుపతి దేవస్థానం వారికి ఇవ్వడమైనది. అనువాదకులు కూడా ముద్రించినా తి.తి.దే. ధర్మప్రచార పరిషత్ వారికే సర్వ అధికారాలు ఇవ్వవలెనని మనవి. ఈ పుస్తకము తి.తి.దే. ధర్మప్రచార పరిషత్ తరపున అచ్చు అయి దేవస్థానం వారి ద్వారానే ప్రజలకు తెలియజేయాలన్నదే ఈ ఉద్దేశ్యం.

ఇందుకు అంగీకరించిన తి.తి.దే. ఇ.ఓ. శ్రీ అజయ కల్లాం గారికి, ధర్మప్రచార పరిషత్ సెక్రటరీ శ్రీ హెచ్.ఎస్. బ్రహ్మానందగారికి, ఎ.ఇ.ఓ. శ్రీ ఆర్. వెంకట రమణారెడ్డి గారికి, పరందామరెడ్డి గారికి, పి.ఆర్.ఓ. శ్రీ డా॥ పి. రంగారావు గారికి, ఎడిటర్ శ్రీ యన్.యస్. రామమూర్తిగారికి, శ్రీరామకృష్ణ గారికి ఇతర సభ్యులకు, సహృదయులకు నా ధన్యవాదములు తెలియజేసి కొంటున్నాను.

భక్తజనులు ఇందులోని పారమార్థిక భక్తిభావాన్ని సహృదయంతో అంగీకరించి, స్వామిని దర్శించి, శ్రీ సీతా, లక్ష్మణ హనుమత్సమేత శ్రీ కోదండరామ స్వామి వారి కృపకు పాత్రులుకావలెనని నా ఆకాంక్ష.

"ఓమ్ తత్సత్"

"శ్రీరామరక్ష.. సర్వజగద్రక్ష"

ఇట్లు,
బుధజన విధేయుడు,
తుపూరు రామరమేశ్ కుమార్.



కోదండరాముని వాహనమండపము



శ్రీవారి ధ్వజస్తంభం
బలిపీఠం

# విషయ సూచిక





శ్రీరామ

# తిరుపతి శ్రీ వేంకటాద్రిరాముడు

ఆంధ్రప్రదేశంలోని చిత్తూరు జిల్లాలోని తిరుపతి నగరపు ప్రాముఖ్యత జగద్విదితమే. విశ్వవిఖ్యాతమైన తిరుమల పుణ్యక్షేత్రాన్ని ఆనుకొని కొండల దిగువ ఉన్న ఈ ప్రాంతంలో ఎన్నో దేవాలయాలు వెలసి ఉన్నాయి. ప్రస్తుతం చాలా దేవాలయాలు "తిరుమల తిరుపతి దేవస్థానం" వారి పరిపాలనలో ఉన్నాయి. ప్రముఖమైన అలమేలు మంగాపురం, శ్రీనివాస మంగాపురం, శ్రీకపిలేశ్వరస్వామి ఆలయాలను భక్తులైన యాత్రికులు బాగా ఎఱిగి ఉందురని నా అభిప్రాయము.

అంతేగాక తిరుపతి పట్టణపు శ్రీ గోవిందరాజస్వామి వారి ఆలయం కూడా చాలామంది యాత్రికులకు తెలుసు. అయితే, అలిపిరి (కాలినడకన తిరుమలకు చేరే మొదటి ప్రదేశము) పోయే మార్గంలో, తిరుపతి పట్టణపు నడిబొడ్డులో ప్రశాంత వాతావరణంలో వెలసివున్న "శ్రీ కోదండరామ స్వామి" వారి ఆలయం గూర్చి చాలామందికి తెలియదు. ఈ ఆలయం కూడా ఏనాటి నుండో తిరుమల తిరుపతి దేవస్థానం పరిపాలనలోనే ఉంది.

తిరుమలలో స్వామివారికీ జరిగే విధంగానే శ్రీకోండదరామస్వామి వారికి వైఖానస ఆగమపద్ధతిలోనే షోడశోపచారాలు, బ్రహ్మోత్సవాలు ఎన్నో యేండ్లుగా నిర్వహించబడుతున్నాయి.



ప్రాంగణము ఫోటో

2

# ఆలయ చరిత్ర

స్థానిక శ్రీ కోదండరామస్వామి వారి ఆలయమును గూర్చిన 'పూర్వ చరిత్ర' అంతగా అందుబాటులో లేదని చెప్పవచ్చు. నాకు తెలిసినంతలో అందుబాటైన చారిత్రక అంశాలను ఆధారం చేసుకొని ఈ ఆలయ చరిత్రను వ్రాయడమైనది. చరిత్ర నా ముఖ్యాంశము కాదు. పండితుల వద్ద ఇంకేమైననూ ముఖ్యాంశములు అందుబాటులో ఉండివుండవచ్చు ను. కనుక తప్పులు ఉంటే పెద్ద మనస్సుతో క్షమించగలరు.

ఆలయచరిత్రకు త్రివిధ ఆధారాలు: 1. స్థానికుల కథనం 2.పురాణ ప్రాశస్త్యం 3.శాసనాధార చరిత్ర.

## స్థానికుల కథనం, పురాణ ప్రాశస్త్యం:

పురాణ ప్రకారముగా శ్రీరామ చంద్రుడు రావణుని సంహరించిన తర్వాత శ్రీ సీతా, లక్ష్మణ, సుగ్రీవ, హనుమ, జాంబవంత, అంగద సమేతంగా తిరుమలకు (పుష్కరిణి స్నానార్థమై) వచ్చిన సందర్భమును పురస్కరించుకొని శ్రీరామాగమన చిహ్నంగా ఈ ఆలయాన్ని నిర్మించినట్లు చెప్తారు.

అయితే "భవిష్యోత్తర పురాణం" లో దశరథ పుత్రుడైన శ్రీరాముల వారు సీతాన్వేషణ సఫలమగుటకు తిరుమలలోని శ్రీ స్వామివారి పుష్కరిణిలో సాన్నమాచరించినట్లు చెప్పబడినది. బహుశా! సీతాన్వేషణ సఫలమైన పిమ్మట కూడా స్వామి ఇచ్చటకు వచ్చి వుండవచ్చును. అందుకేనేమో ఈ స్వామి పడమర ప్రక్క తిరిగి, తూర్పు వైపు చూస్తున్న శ్రీవేంకటేశ్వరస్వామి వారికి ఎదురుగా నిలుచుకొని వున్నారు!

ఆలయానికి పడమట దిక్కులో వున్న రామచంద్ర గుంటయే అలనాటి రామచంద్ర తీర్థం లేదా కోనేరు. చంద్రవంశపు రాజైన శ్రీ జనమేజయ చక్రవర్తి తిరుమలకు వెళ్తూ, స్నానార్థమై ఈ తీర్థంలో దిగినప్పుడు ఈ ఆలయ విగ్రహాలు దొరికనట్లునూ, వెంటనే ఆతను గుడి కట్టించినట్లునూ మా పుర్వీకులు ఒక కథ చెప్పగా నేను విని ఉన్నాను.

ఇక్కడి కొందరు స్థానికుల కథనం ప్రకారం ఈ ఆలయాన్ని శ్రీ జాంబవంతులవారు ప్రతిష్ఠించినట్లు చెప్తారు.

కీ॥శే॥ శ్రీ సాధు సుబ్రహ్మణ్య శాస్త్రి గారు ఈ విషయంలో విశేష కృషి చేసారు. ముఖ్యంగా వీరి 'తిరుపతి శ్రీ వేంకటేశ్వర' పుస్తకమునందలి "సవాల్ యే జవాబ్ పట్టీ" అనే అధ్యాయంలో ఈ ఆలయ ప్రసస్తి కలదు. ఈ సవాల్ యే జవాబ్ ఏమిటంటే బ్రిటిష్ వారు మన దేశమునకు వచ్చినప్పుడు ఆలయముల చరిత్రను అప్పట్లో (క్రీ.శ. 1818 ప్రాంతంలో) ఉన్న స్థానికుల నుంచి సేకరించారు. ఇందులో ఈ కోదండ రామ ఆలయం గురించి స్థానిక కథనంగా దీనిని చంద్రవంశపు రాజైన శ్రీ జనమేజయ చక్రవర్తి నిర్మించినట్లు తెల్పారు. మా పూర్వీకుల నుంచి నే విన్న కథ కూడా మరింత విశదంగా ఇలానే ఉండటం ఆశ్చర్యం!

కీ॥శే॥సాధు సుబ్రహ్మణ్యశాస్త్రి గారి "సవాల్ యే జవాబ్" అంశములకు, ఆధారభూతమైన రెండు ప్రశ్నలను మూలము నుంచి ఇందు పొందు పరుస్తున్నాను. ఇవి "తిరుపతి శ్రీ వేంకటేశ్వర - బాలాజీ" రచయిత శ్రీ వి.ఎన్. శ్రీనివాసరావుగారు తన గ్రంథములో Mythic Society, Bangalore వారి త్రైమాస పత్రిక విశేషాలను వ్రాసిన అంశాల ఆధారముగా తెనుగునకు అనువదించడమైనది.

<u>**సవాల్ యే జవాబ్:-**</u>

ప్రశ్న 26: (పుట 243)అసలు శ్రీరాములవారు ఎప్పుడైనా తిరుమలకి వచ్చివున్నారా?

జవాబు: 'కృతయుగములో శ్రీరాములవారు రావణ రాజ్యంపై దండెత్తి వెళ్ళేప్పుడు (మూలములో త్రేతాయుగమునకు బదులు కృతయుగమనే ఉన్నది. ఇది అచ్చు పొరబాటై ఉండవచ్చు) ఈ తిరుమల వద్ద వానర సైన్యా సమేతుడై ఒక రాత్రి విశ్రమించెను. అప్పుడు హనుమంతుడు ఆదిగా గల వానర వీరులు వైకుంఠ గుహ నుంచి వెలువడుతున్న కాంతులను (శ్రీనివాస తేజస్సును) చూచి ఆ విషయమును శ్రీరాములవారికి తెలియజేసిరట. శ్రీరాముల వారు (అంతః

కలియుగంలో శ్రీనివాసుడన్న సంగతి ఎరుగక) ఈ పర్వతం మొత్తం అంతటి దేవున్న దేనని వారికి తెలియజెప్పెను. రావణ సంహారం అయిన పిమ్మట సీతాలక్ష్మణ సమేతంగా శ్రీరాములవారు తిరుపతిలో కొంత తడవు విశ్రమించినారు. తిరుపతిలోని శ్రీ కోదండరామస్వామి వారి ఆలయము దీనికి గుర్తుగా నిర్మించడమైనది. ఈ ఆలయములో శ్రీరాములవారు, సీతమ్మవారు, లక్ష్మణస్వామి వారు విగ్రహాల రూపంలో వెలసి భక్తుల కోరికలను తీరుస్తూ వారి కష్టములను కడతేర్చుచున్నారు. ఇది "వరాహ పురాణం" మరియు అనేక ఇతర పురాణములలో వివరించ బడి వున్నది.

ప్రశ్న 36: (పుట 250) తిరుపతిలోని శ్రీ కోదండరామ ఆలయాన్ని మొట్టమొదట ఎవరు నిర్మించారు. ఆలయాన్ని, గోపురాన్ని, ప్రాకారాన్ని ఎవరు కట్టారు?

జవాబు: పారంపర్యముగా (ఐతిహాసికంగా) మాకు తెలిసిన కథ ఏమిటంటే. కలియుగం నుంచి 64వ సంవత్సరములో దేశాన్ని పరిపాలించే జనమేజయ చక్రవర్తి అప్పటికే శిథిలావస్తలో వున్న ఈ ఆలయాన్ని ప్రాకారములు, గోపుర శిఖరములు, పునరుద్ధరించి ఆలయములోని విగ్రహములను తిరిగి ప్రతిష్ట చేసినారు. యాదవ వంశ రాజులు శక సంవత్సరము 756 (క్రీ.శ.834)లో తిరిగి దీనిని మండపములు, ప్రాకారములతో నిర్మించినారు.

పూర్తిగా గమనిస్తే అప్పటి స్థానికుల కథనం, ఇప్పటి స్థానికుల కథనం తో పోలిస్తే, శ్రీరామ ఆగమనం, జనమేజయ చక్రవర్తి పునరుద్దరణ, పురాణ అంశాలు చాలా వరకు ఒకటిగానే ఉన్నాయి. కాకుంటే జాంబవంతుల వారి ప్రతిష్ఠ అన్నది కొందరు మాత్రమే చెప్పుచున్నారు. వాయల్పాడులోని శ్రీ పట్టాభిరామాలయాన్ని జాంబవంతులవారే ప్రతిష్టించారు అని అంటారు కనుక ఇది కూడా వారి ప్రతిష్టే అయి ఉండవచ్చునని కొందరి అభిప్రాయము.

**శాసనాధార చరిత్ర - ఇతర అంశములు:**

కీ॥శే॥ శ్రీ సాధు సుబ్రహ్మణ్య శాస్త్రి గారి విరచితమైన "తిరుపతి

శ్రీ వేంకటేశ్వర" ( ఆంగ్లము). "తిరుమల తిరుపతులలో లభించిన శాసనాల వివరాల రిపోర్ట్ ఆధారాలుగా కొంత శాసన చరిత్ర అందుబాటులో ఉంది. ఇంతేకాక కీ॥శే॥ శ్రీ కృష్ణస్వామి అయ్యంగార్ విరచితమైన "ద హిస్టరి ఆఫ్ తిరుపతి" అనే పుస్తకంలో కూడా ఈ శాసనముల వివరములు లభ్యమౌతున్నాయి.

ఈ ఆలయ నిర్మాణానికి సంబంధించి ఏశాసనమూ ఈ ఆలయములో లభించలేదు. స్థానిక శ్రీ గోవిందరాజస్వామి ఆలయం లోనూ, తిరుమల శ్రీ వేంకటేశ్వరస్వామి వారి ఆలయంలోనూ లభించిన శాసనాల ఆధారంగా ఈ ఆలయ చరిత్ర వ్రాయడం జరిగింది. ముఖ్యంగా సాళువ నరసింహరాయల పరిపాలనా కాలం నుంచి శతాబ్ద కాలం వరకు వున్నవాటిల్లో ఈ శాసనములు అన్నియు శ్రీ రామాలయ చరిత్ర అందుబాటుఅయ్యేలా చేసాయి.

ఈ ఆలయములో ప్రస్తుతం లభించిన శాసనములు కేవలం రెండు మాత్రమే. అవి, ఆలయ గోపురం ఉత్తర భాగమునందు శ్రీ అచ్యుత దేవరాయులు సమర్పించిన రథము గురించిన శాసనం[1], ఆలయ వంటశాలలో ఒక పెద్ద రాతి గిన్నెపై నారాయణన్ అనే భక్తుడు (పెరియా పెరుమాళ్ అనే ఆయన పుత్రుడు - నేలటూర్ గ్రామవాసి) స్వామికి ఈ గిన్నెను సమర్పించినట్లున్న శాసనం[2].

స్థానిక శ్రీ గోవిందరాజస్వామి ఆలయములోని 'కూరత్తాళ్వాన్ మండపం' ఉత్తరపు గోడ లోపలి భాగంలో లభ్యమైన శాసనములు చాలా వరకు ఈ ఆలయ నిర్మాణం గురించి ఇలా తెలియజేస్తున్నాయి. వీటి ఆంగ్లానువాదం కూడా ఇందు పొందుపరుస్తున్నాను[3].

ఇక ఈ శాసనాలు, ఇతర శాసనాలు ఆధారంగా ఈ ఆలయ చరిత్రను గమనిద్దాం.

ఈ శాసనంలో, "శక సంవత్సరము 1402 (క్రీ.శ. 1480)లో శఠగోపదాసర్ నరసింహమొదిలియార్ అనే ఆయన నరసింహ ఉడయ్యార్ కాలంనాటి సంస్కృతి, సాంప్రదాయాల చిహ్నంగా ఆయన తరపున

**'రఘునాథుడు'** అను పేరుతో శ్రీరామచంద్రుని విగ్రహాన్ని ఇచ్చి శ్రీ గోవిందరాజస్వామి ఆలయానికి ఉత్తర భాగంలో ఈ స్వామి కొరకు ఒక పెద్ద ఆలయాన్ని నిర్మించినట్లు" తెల్పబడింది. ఈయననే సాధు సుబ్రహ్మణ్యశాస్త్రిగారు వీరసాళువ నరసింహరాయులుగా పరిగణించారు. ఆలయ నిర్మాణానికి సంబంధించిన శాసనం లభ్యమైనప్పటికి ఇది పూర్తిగా శిధిలావస్థలో వున్న కారణంగా కొన్ని చోట్ల పదాలను ఊహించుకొని చరిత్ర వ్రాయబడినది. ఈ నరసింహరాయలు దేవదాన పల్లెలోని (తిరుపతి దగ్గర) అవిలాల లోతట్టు భూభాగం నుంచి 150 కులి ( 15 ఎకరములు) భూమిని ఈ దేవాళయ నిత్య పూజ నైవేద్యములకు ఒప్పగించినట్లు శాసనం ద్వారా తెలియుచున్నది[4]. దీనికి తిరుమల శ్రీ వేంకటేశ్వర ఆలయ కార్య నిర్వహకులుగా ఉన్న స్థానత్తార్ ద్వారా భూములలో నీటి సౌకర్యమై ఆలయ ఖర్చుల నిమిత్తం 100 పణముల సొమ్ము మరలా ఇచ్చినట్లును, కొంతకాలం తర్వాత అంటే క్రీ.శ. 1494లో ఈ నిర్వహణకు అంతరాయం ఏర్పడినప్పుడు ఇతని కుమారుడు రామానుజఅయ్యన్ వీటిని బాగుచేసి మరలా కొంత భూమిని సర్వమాన్యంగా ఇచ్చి పునరుద్ధరించి స్వామివారికి ధూప, దీపములకు "తిరుపొనక్కమ్" నివేదించినట్లు తెలియబడుతుంది. అంటే ఒకప్పుడు ఈ ఆలయము శ్రీ రఘునాథస్వామి ఆలయముగా పిలువబడేది.

శ్రీవారి ప్రాముఖ్యాన్ని ప్రచారం చేయాలన్న సంకల్పంతో నరసింహరాయలు, ఆతని పుత్రుడు, మరి కొందరు భక్తులు క్రీ.శ. 1494 మార్చి నెల 9వ తారీఖున మొట్టమొదటి సారిగా "శ్రీరామనవమి" ఉత్సవములు జరిపి ఒక 'అప్పపడి' స్వామికి సమర్పించి శ్రీ హనుమంతుల వారికి కూడా నివేదన జరిపి ఉత్సవర్లను ఊరేగించినట్లుగా శాసనం ద్వారా విశదమౌతోంది[5].

అంతేకాక 'కనుప్పొడి' రోజున సీతమ్మకు అభిషేకం చేసి రెండుసార్లు 'తిరుపొనక్కమ్' నివేదన చేసినట్లు అదే విధంగా (తిరుపతి లోని) నరసింగరాయ పురమందలి 'చరణుశెట్టి' (తమ్మిశెట్టి అనే వ్యాపారి

పుత్రుడు) స్వామి వారికి ఒక 'అప్పపడి' నివేదన జరుగునట్లు ఏర్పాటు చేసినట్లుగా తెలుస్తోంది.

***అంటే "శ్రీరామనవమి" ఉత్సవములు నేటికి సుమారుగా 510 సంవత్సరములుగా ఈ ఆలయములో జరుగుతున్నట్లు తెలుస్తున్నది.***

శ్రీ రఘునాథస్వామి బ్రహ్మోత్సవాల ప్రస్తావన తిరుమల శ్రీవారి ఆలయం మరియు తిరుపతి శ్రీ గోవిందరాజస్వామి ఆలయములోని శాసనముల నుంచి లభ్యమవుతున్నది. పంగుణి మాసంలో ఈ బ్రహ్మోత్సవాలు జరుపబడేవని శాసనంలో తెలియజేయబడింది[6]. ఈ ఆలయములోని శాసనం[7] కూడా ఇందుకు అధారంగా వుంది. ఈ శాసనం[7] "స్వామివారికి శ్రీ అచ్యుతదేవరాయలు విరోధినామ సంవత్సరం తైమాసం శక సంవత్సరము 1451 (క్రీ.శ. 1529 జనవరి 14) శ్రీ కుమార రామానుజ అయ్యంగార్ ఆధ్వర్యంలో కొయ్యతో నిర్మించిన ఒక అద్భుతమైన రథాన్ని స్వామివారి పంగుణి బ్రహ్మోత్సవాలలో వాడే 8వ రోజున ఉత్సవముగాను తయారుచేయించినారు" అని తెల్పుతుంది.

ఉత్సవములో స్వామివారు నాలుగు మాడా వీధులు తిరుగుతూ స్థానికుల హారతులు, నివేదనలు సమర్పించికొన్నట్లును అప్పటి స్థానికులు అయిన శ్రీనివాస అర్యంగార్ అతని కుమారుడైన తాతయ్యంగార్‌లు తిరుమల నంబి గోపురంగా పిలువబడే గోపురము వద్ద నివేదనలు జరిపినట్లు శాసనం ద్వారా తెలుస్తున్నది[8]

***అంటే దీని మూలంగా స్వామి వారి బ్రహ్మోత్సవాలు నేటికి సుమారుగా 470 సంవత్సరములుగా జరుగుతున్నదని చెప్పవచ్చు.***

ఇంకా ఈ స్వామి వారికి "ఉద్ధానదార్వర్ ఉళగప్పన్" అనే అతను క్రీ.శ. 1598లో "అధ్యయనోత్సవం" (దివ్య ప్రబంధ పారాయణం) జరిపించినట్లు, అప్పుడే ఆరవ రోజున కుమార రామానుజఅయ్యంగార్ 'శాత్తుమొర' సన్నిధి వద్ద పండుగగా జరిపించారు.ఒక్కరోజు జరిగే "తిరుప్పళ్ళి ఓడమ్" (తెప్పోత్సవం) సందర్భముగా శ్రీ తాళ్ళపాక తిరుమలాచార్యులు (తాళ్ళపాక పెద్ద తిరుమలాచార్యులు పుత్రుడు -

శ్రీ వేంకటేశ్వర స్వామి ఆస్థాన సంగీత గాయకులు) "ఇడ్డలిపడి" అనే నివేదనను క్రీ.శ.1547లో సమర్పించారు. వేసవిలో జరిగే "కోడైతిరునాళ్" (వసంతోత్సవం) ఫస్లీ 950 (క్రీ.శ.1540) నుంచి తిరువేంగడ రామానుజ జియ్యంగార్ ఆధ్వర్యంలో బ్రహ్మోత్సవాలతో పాటు జరుగుతున్నవి[9]!

క్రీ.శ. 1547లో "పారువేట్టయ్" అనే మరో ఉత్సవములో ప్రాంగ్నాడు (ఉదయగిరి తూర్పు భాగం వారు) ప్రాంతము వారైన శ్రీ సింగనల్లప్పన్ పుత్రుడు శ్రీ చవ్వునాయకన్ అనే భక్తుడు తను స్వయంగా నిర్మించిన ఒక మండపమునకు శ్రీరామలక్ష్మణుల ఉత్సవర్లను గుర్రములపైనను, శ్రీ సీతమ్మను బంగారు పల్లకిలోను ఊరేగింపుగా తీసుకొని వెళ్ళి కొలువు చేయించెను. ఇలా ఈ ఆలయములో జరిగిన ఎన్నో ఉత్సవాల గురించిన విశేష విషయాలు ఈ శాసనల ద్వారా వెల్లడౌతోంది.

శాసనం నుంచి తిరుచానూరు సభైయ్యార్ శ్రీ భక్తాంజనేయ స్వామి ఆలయాన్ని రాములవారి ఆలయానికి పడమటి భాగములో నిర్మించి నట్లున్నది[10]. ఇది కూడా క్రీ.శ.1480 ప్రాంతందేనని తెలుస్తున్నది.

"పింగళ పెరియ పెరుమాళ్ దాసర్" అనే అతను క్రీ.శ. 1497లో వైష్ణవ పండితులతో సమావేశమై వారి కోరిక మేరకు శ్రీరామనుజులవారి విగ్రహాన్ని ఈ ఆలయములో ప్రతిష్ఠించి ఆయనకు "తిరుపోనక్కమ్" ను స్వామి నివేదన తర్వాత నివేదించేలా ఏర్పాటు చేసినట్లు శాసనం తెలుపు తున్నది[11].

శ్రీ గోవిందరాజస్వామి ఆలయము నుంచి ఉత్సవమూర్తులు శ్రీ కోదండరామస్వామి వారి ఆలయమునకు కొన్ని ముఖ్య పండుగులకు వచ్చి వేంచేపు చేస్తునట్లూ, పెద్ద శేషవాహన ఉత్సవం రాములవారికి జరిగేటట్లు తెలియుచున్నది[12]

మరి స్థానిక గోవిందరాజస్వామి ఆలయములో రఘునాథ సన్నిధి ఒకటి ఉంది కదా! ఆ సన్నిధిని క్రీ.శ.1488 ఆగష్టు నెల 12వ తారీకున 'విఘ్నేశ్వరరామన్' నిర్మించినట్లునూ, పైగా ఆ ఆలయములోని రఘు నాథుడు చిన్న మూల విగ్రహం మాత్రమే కనుక ప్రస్తుత కోదండరామా

లయరాములవారిని పెరియ రఘునాథునిగా పిలిచేవారు.

శ్రీవారి నిత్య పూజల నిమిత్తం ఉదయగిరి నుంచి [illegible] వచ్చి వుండిన లేదా ప్రత్యేకంగా పిలిపించిన వైఖానస బ్రాహ్మణ కుటుంబమును వినియోగించినట్లు తెలుస్తూంది. [illegible] రాజా సదాశివ కాలంలో క్రీ.శ. 1544 నందు ఉదయగిరి శ్రీనివాసభట్టార్ (కాళిదాస శకుంతల నాటక ప్రఖ్యాత వ్యాఖ్యాత), అతని [illegible] ఉదయగిరి దేవరాయభట్టార్‌ల పేర్లను స్వామి సేవలో ఉన్నట్లు [illegible] డం వల్ల వీరి ప్రాముఖ్యత తెలుస్తోంది[13] **ఇప్పటికీ ఆ స్వామి సేవలో ఉన్నవారు ఉదయగిరి వైఖానస బ్రాహ్మణులే కనుక [illegible] అప్పటి శ్రీ శ్రీనివాసభట్టార్, శ్రీ దేవరాయభట్టార్ కుటుంబమునకు చెందిన వారే అయి వుంటారన్నది కీ॥శే॥ సాధు సుబ్రహ్మణ్య శాస్త్రిగారి అభిప్రాయం. వీరెంతటి ధన్యాత్ములో!**

"అయోధ్య రామానుజఅయ్యంగార్" (రాయల కాలంనాడు అని తెల్పబడింది.) అనే అతను స్వామివారికి గోపురమును ప్రాకారమును నిర్మించినట్లు తెలుస్తోంది. క్రీ.శ.1816-17లో ఈ ఆలయ విమానం పునరుద్ధరింపబడి పూర్ణ కుంభాభిషేకము జరిగి పవిత్రం గావించబడినట్లు ఆధారములు ఉన్నవి.

ఈ ఆలయము రెండవ ప్రాకారముపై ప్రస్ఫుటంగా కన్పించే వరాహము, ఖడ్గము, ప్రహరీ గోడలపై కనిపించే సూర్యుడు, అర్ధ చంద్రుడు చిహ్నాలను బట్టి స్పష్టంగా ఈ ఆలయము విజయనగర సామ్రాజ్యాధీశుడైన శ్రీకృష్ణదేవరాయల కాలములో పునరుద్ధరించినట్లు తెలుస్తున్నది.

అయితే బాగా గమనిస్తే ఆలయపు మొదటి ప్రాకారపు తూర్పు భాగంలో దక్షిణ భాగంలో గోడ బయట పై భాగంలో ప్రస్ఫుటంగా కనిపించే మత్స్యముల చిహ్నములు ఆలయ చరిత్ర గురించి ఎవరినైన ఆలోచింపచేస్తాయి. ఈ మత్స్యములు పల్లవరాజుల, పాండ్యరాజుల కట్టడములలో వాడిన చిహ్నములని కొందరూ, సముద్రతీరాలలో రాజ్యము పాలించిన రాజుల చిహ్నములని కొందరూ, ఎక్కడనుంచో

వీటిని ఆలయ పునరుద్ధరణప్పుడు పెట్టివుండవచ్చునని కొందరూ రక రకాల అభిప్రాయాలు వెలిబుచ్చుతున్నారు. అంటే క్రీ.శ. 1480 కంటే ముందుగానే ఈ ఆలయము నిర్మించబడి ఉండాలి అని కొందరి అభిప్రాయము. అసలు ఒకప్పుడు ఈ ఆలయము స్థానిక కపిలతీర్థము వద్ద వుండేదని, కొన్ని కారణాల మూలంగా తిరిగి ఇక్కడ పునర్మించారని ఒక కథనం కూడా ఉంది. కాని శాసనాధారాలు లభించుట లేదు. విజయనగర సామ్రాజ్యాధీశులు పునరుద్ధరించేటప్పుడు ఎంతో సహృదయంతో తమ చిహ్నాలైన సూర్యుడు, అర్ధ చంద్రుడు, సత్యభామా, రుక్మిణీ సమేత శ్రీ కృష్ణమూర్తి పైభాగములో ఈ మత్స్యములను ఉంచటం వలన వారి కంటే ముందు ఈ ఆలయ నిర్మాణాన్ని మరొకరు చేసిఉన్నారని సంజ్ఞాపరంగా సూచించడమేమో! అయితే మరో విశేష విషయమేమిటంటే ఈ ఆలయములో ప్రతి విగ్రహమునకు ప్రక్కన అదే మాదిరిగా మరొక విగ్రహం (భంగిమలో కొంత మార్పుతో) ఇప్పటికీ దర్శనమిస్తాయి. ఉదా హరణకు భగవత్‌రామానుజులు పెద్ద రాతి విగ్రహం బోధన భంగిమలోనూ, చిన్న రాతి విగ్రహం ప్రక్కనే అంజలి ఘటించు భంగిమ లోనూ; విష్వక్సేనులవారి విగ్రహం ప్రక్కన అటువంటిదే మరో రాతి విగ్రహం, జయ విజయులను పోలిన చిన్న జయ విజయుల విగ్రహాలు (భంగిమల మార్పుతో) దర్శనమిస్తాయి. బహుశా! చిన్న విగ్రహాలు పురాతనమైనవైవుండొచ్చునని మరి కొందరి అభిప్రాయము. ఇంకే ఆలయములోనూ ఇలా అగుపించుటలేదు. కనుక పరిశోధిస్తే ఈ ఆలయ చరిత్ర మరింత విస్తారంగా దొరకవచ్చునని నా అభిప్రాయము.

టి.టి.డి. వారి వెబ్ సైట్‌లో ఈ ఆలయము గురించి దీనిని క్రీ.శ. 10వ శతాబ్దంలో ఒక చోళరాజు నిర్మించినట్లూ, పురాణాల ప్రకారము శ్రీరాముని ఆగమన సందర్భముగా ఈ ఆలయ నిర్మాణం జరిగినట్లు వ్రాయబడి ఉంది. దీని నకలు పొందుపరుస్తున్నాను.

ఆధ్యాత్మికంగా ఆలోచిస్తే ఋషిమూలం. నదిమూలం ఇత్యాది వివరాలను తెలిసికొననవసరంలేదు. పురాతనమైన దని పూర్తిగా ఆధారాలు

ఉన్నా ఈ ఆలయ నిర్మాణంగూర్చిన ఇంకా పురాతన శాసనాలు ప్రత్యేకంగా ఈ ఆలయములో ఏవీ లభ్యం కాకపోవడం విశేషం. బహుశా! భక్తులు కీర్తి కాంక్షను వదలి కర్మ ఫలాన్ని శ్రీస్వామి వారికి సమర్పణ చేసి ఈ ఆలయాన్ని నిర్మించారనడం సమంజసం.

పెద్దలు. స్థానికులు చెప్పే విషయాల ఆధారంగా పుణ్యాత్ముల ఫలమైన ఈ దేవాలయం బహుపురాతనమైనది. ఐదు విధాలైన ప్రతిష్ఠలలో ఈ స్వామి పురాణపురుషుల ప్రతిష్ఠ. తిరుమల శ్రీ వేంకటేశ్వరస్వామి వారు **స్వయంభువు,** తిరుపతి శ్రీ కపిలేశ్వరస్వామి వారు శ్రీ కపిలమహర్షి ప్రతిష్ఠ (ఋషి ప్రతిష్ఠ), శ్రీ కోదండరామస్వామి జాంబవంతులవారి లేదా జనమేజయుని ప్రతిష్ఠ (పురాణ పురుషుల ప్రతిష్ఠ), శ్రీ గోవిందరాజ స్వామి వారు ***భగవత్ రామానుజుల వారి ప్రతిష్ఠ,*** నారాయణవనం, శ్రీనివాస, అలిమేలు మంగాపురం, లోని మూర్తులు ఆకాశ రాజు, శుక మహర్షి ప్రతిష్ఠించి ఉండవచ్చు నంటారు ***(దేవతల ప్రతిష్ఠ).*** ఇవిఅన్నియును తిరుపతిలోనే ఉండి మరలా అన్ని కూడా తి.తి.దేవస్థానం అధికారపాలనలో వుండటం మరింత విశేషం.

ఒకప్పటిఆదాయ ఖర్చుల విషయాలు మరియు ఆలయ నిర్మాణం ఇతర విషయాలు పరిశీలిద్దాం.

## దిట్టం (క్రీ.శ. 1790 - 1840):

ఈ దిట్టం ఆనాటి ఆర్కాట్ నవాబుల కాలంలో ఇంగ్లీషు ఈస్ట్ ఇండియా కంపెనీ చొరవతో ఏర్పడినటువంటిది. నవాబు మహ్మదాలీ 1750 నుండి దేవస్థానము ఆదాయం కంపెనీకి బదలాయించడమే దీనికి కారణం. కంపెనీ వారు దేవస్థానం ఖర్చు అనవసరముగా ఎక్కువగా ఉందనే అపోహలతో ఈ ఏర్పాటును చేసినారు.

ఆనాడు వ్యావహారికంగా జరిగే నైవేద్యాలు, వాటికి అయ్యే దినుసు లు. ఖర్చులను కుదించి ఒక తరంగా (అంటే స్కేల్‌గా) చేయటం ఈ దిట్టం'కు ప్రాతిపదికలు.

ఈ దిట్టం ఆనాటి విచక్షణ, వివేచన మహంతుల కాలం వరకూ కొనసాగి, స్వల్ప తేడాలతో అమలులో ఉంటూ, దేవస్థాన పరిపాలనా రంగంలో నేటికీ మిక్కిలి విశేషంగా ఒక ప్రత్యేకతను సంతరించుకొంది.

అందుకే ఈ దిట్టం ప్రతి ఆలయ దేవస్థానానికి సంబంధించిన అన్ని అంశాలను విషయంగా అచ్చు వేయించి, అన్ని కోర్టు వ్యవహారాలలో సాక్ష్యంగా నిలిపి, స్వరూప నిజాన్ని వ్యక్తం చేస్తుంది.

కాబట్టి శ్రీ కోదండరామాలయ దేవస్థానానికి సంబంధించిన శ్రీరామనవమి దిట్టం ఇందు పొందుపరచడమైనది[14]

**శ్రీరామనవమి (దిట్టం - 2, క్రీ.శ. 1790 - పేజి నెం.15)**

* శ్రీరామస్వామికి సాయంకాలం తిరుమంజనం చేయటం.
* పిమ్మట సర్వ భూపాల వాహనం మహా ప్రదక్షిణంగా వచ్చి, రంగమండపంలో ఆస్థానం అయ్యేది.
* అచ్చట నైవేద్యం.

  3 అరసోల భక్ష్యంపడి

  1 వడపడి, 1 అప్పపడి, 1 దోశపడి

  4 తళిహెలు (పొంగళి, పులియావగరం (పుళిహోర), దధ్యోదనం, పాయసం).

  ఈ ప్రకారం నైవేద్యం అయినదే అచ్చటనే వినియోగమయ్యేది.
* బాలకాండ పురాణశ్రవణం చేయడం.
* దశమి దినం బొక్కసం వాళ్ళది ఉభయం.
* రాత్రి శ్రీరామస్వామికి హనుమంత వాహనం మహా ప్రదక్షిణంగా వచ్చేది.
* బొక్కసం వాళ్ళచే పడిచేరప (ముడి అన్నం) నైవేద్యంగా వినియోగమయ్యేది.
* పట్టాభిషేక పురాణం చదివేవారు. ఈ ప్రకారం ఉత్సవం జరిగేది.

## సవాల్ యే జవాబ్ పట్టీ ( క్రీ.శ. 1817 -18)

**దినచర్య :-** ఈ ఆలయములో అప్పట్లో అర్చకస్వామి, బొక్కసం గుమాస్తా, వంట మనిషి, ఇద్దరు గొల్లవారు, తోట పనిమనిషి మొత్తం 6 మంది ఉండేవారు. అర్చక స్వామి ప్రతిరోజు ఉదయం 7 గం॥ల నుంచి 9 గం॥ల వరకు దధ్యోదనం నైవేద్యం, మధ్యాహ్నం 10 గం॥ల నుంచి 12 గం॥ల కాలములో మరొక నైవేద్యము, రాత్రి 7 గం॥ల నుంచి 9గం॥ల కాలములో పులిహోర నైవేద్యముతో స్వామివారి పూజలను చేసి రాత్రి తీర్మానంలేదా ఏకాంతసేవ జరిపేవారు. వంటమనిషి స్వామి నైవేద్యములను వండటం, తోటమనిషి తోటపని, గొల్లవారు పై నివేదనలకు కావలసిన సామాగ్రిని తెచ్చిపెట్టడం, బొక్కసం గుమాస్తా స్వామి అభిషేకానికి గంధం అరగదీయడం, అభిషేకానికి నీళ్ళు తోడిపెట్టడం వంటి పనులను చేసేవారు.

గుండప్ప, వేంకట్రావు అనే వారు చాలా కాలం ధర్మకర్తలుగా వ్యవహరించారు. నవాబ్ సాహేబ్ పాలనలో రఘునాథాచారి అనే ఆయనను "మస్దార్" (ఆలయ పరిపాలక అధికారి) గా నియమింపబడెను. ధర్మకర్త లు, పాలక అధికారులు ఆలయ ఆదాయములో కొంత సొమ్మును జీతభత్యాలకి వినియోగించికొని, కొంత ఆలయము కోసం వెచ్చించేవారు.

సర్కార్ ఖర్చులు - క్రీ.శ.1789-90 (ఫస్లీ 1199)లో అనగా జూన్, జూలై మాసాలలో పంటదిగుబడి వల్ల రైతులకు వచ్చే పంట ఆదాయమును ఫస్లీ సంవత్సరముగా పరిగణించేవారు.

**ఆదాయము:**

ఎ) గుత్తకు యిచ్చిన భూమి. కానుకల నుంచి- పులివరహా 80-04-02

బి) ఉభయములు. భక్తుల కానుకలు ------ పులివరహా 71-08-42

మొత్తం ఆదాయం ------------------ పులివరహా 151-12-44

**ఖర్చు:** సర్కార్ ఖర్చులు - జీతభత్యములు ---- పులివరహా 145-38-0.

ఇందులో ఒక పులివరహా అనగా ఒక పెద్ద బంగారు నాణెం. కేవలము

పరిపాలనా సౌలభ్యం కోసం ఆలయ ఆదాయ ఖర్చుల పట్టి పొందు పరచడమైనది. అప్పట్లో (క్రీ.శ.,1817-18) ఈ ఆలయ అర్చక మిరాశిదార్ పేరు శ్రీ పట్టు తాతాచారి.

**పైమాషి లెక్కలు (క్రీ.శ. 1817-19):** శ్రీ కోదండరామస్వామి ఆలయము "సాంగబాంది" (Sanga - bandi) అనే శాస్త్ర పద్ధతిలో నిర్మించబడివుంది. ఆలయ గర్భగుడి రెండున్నర అడుగులు ఎత్తుకలిగిన అరుగుపై, పది అడుగులు కలిగిన నాలుగు గోడలతో, సుమారు ఇరవై అడుగుల ఎత్తు కలిగిన విమానముతో బహుసుందర శిల్పశైలితో రాతి కట్టడముగా నిర్మించబడిఉన్నది.

ఈ ఆలయములో శ్రీ సీతారామ లక్ష్మణుల మూలమూర్తులతో పాటు ఎనిమిది మంది ఉత్సవమూర్తుల విగ్రహాలు ఉన్నవి. రాగితో చేసిన విష్వక్సేన, ఆంజనేయ, నమ్మాళ్వార్ మరియు భగవత్‌రామానుజుల విగ్రహాలు కూడా "స్నపన మండపం" (ప్రస్తుతం శ్రీవారి ముఖ మండపం) లో ఉన్నవి. రాతితో చేసిన పెద్దవి, చిన్నవి అయిన రామానుజుల, విష్వక్సేనుల విగ్రహాలు కూడా ఉన్నవి. స్నపన మండపం ఆనుకొని ఆస్థాన మండపం ఉంది. వీటిఅన్నింటిని (గర్భగుడి, స్నపన, ఆస్థాన మండపములను) ఒకే ప్రాకారములో ఉండేలా రాతితో నిర్మించారు. ఆలయ పెద్ద ప్రాకారము 345 అడుగుల పొడవు, 174 అడుగుల వెడల్పు, పదమూడున్నర అడుగుల ఎత్తున్న గోడతో, పైభాగము ఒకటిన్నర అడుగుల కప్పు కలిగి, మొత్తం పదిహేను అడుగులు ఎత్తుతో నిర్మించబడి ఉంది. పడమర ప్రాకార గోడ మధ్య భాగంలో ఆలయగోపుర మహాద్వారం ఉంది. ఇది 24 అడుగుల పొడవు, 30 అడుగుల వెడల్పు, 11 అడుగుల ఎత్తు గల పీఠముపై 29 అడుగుల ఎత్తైన గోపురముతో 15 అడుగుల దారి కలిగివుంది. ఆలయ గోపురము, విమానగోపురము ఒకప్పుడు గార సున్నపు కలవతో (Mortar) నిర్మించబడిఉండేది. ప్రస్తుతం గోపురము, విమానము సిమెంటుతో పునరుద్ధరించి ఉన్నారు. ఇప్పటికీ ఈ ఆలయ నిర్మాణం ఇదే కొలతలతో ఇదే విధముగా ఉన్నది.

ఇక ఈ ఆలయ విశేషాలను వర్ణనాత్మకంగా గమనిద్దాం.

**ఆలయ తూర్పు భాగపు ప్రహరి గోడపైని మత్స్య చిహ్నం**

## శాసనముల సంఖ్యల వివరములు

1. శాసనము సంఖ్య.318 గోవిందరాజస్వామి గుడి, తిరుమల తిరుపతి దేవస్థాన శాసనములు.
2. శాసనము సంఖ్య.319 గో.గు., తి.తి.దే.శా.
3. శాసనమునంఖ్య.310, సంఖ్య.184 గో.గు., తి.తి.దే.శా.
4. శాసనం సంఖ్య.159 గో.గు., తి.తి.దే.శా.
5. శాసనం సంఖ్య.66 గో.గు., తి.తి.దే.శా.
6. శాసనము సంఖ్య.415 గో.గు., తి.తి.దే.శా.
7. నం.1 మాదిరే
8. శాసనము సంఖ్య. 667 తిరుమల దేవాలయం, తి.తి.దే.శా.
9. శాసనము సంఖ్య. 252 గో.గు. మరియు తిరుపతి జియ్యంగార్ల గురుపరంపర పట్టిక (అముద్రితం) నుండి.
10. శాసనము సంఖ్య.61, 66, 403 గో.గు., తి.తి.దే.శా.
11. శాసనము సంఖ్య.150 గో.గు., తి.తి.దే.శా.
12. శాసనం సంఖ్య.27, 66 గో.గు., తి.తి.దే.శా.
13. శాసనం సంఖ్య.352 గో.గు., తి.తి.దే.శా.
14. తి.తి.దే. వారి దిట్టం - ఫస్లీ 1200 (క్రీ.శ. 1790 91) నుండి 1250 (క్రీ.శ. 1840) వరకు.



16

# ఆలయవిశేషాలు

స్వామివారి ఆలయ ప్రధాన గోపురము పడమటి వైపు నుంచి ద్వారము కలిగి తూర్పు, ఉత్తర, దక్షిణ మాడా వీధుల మధ్య బహు విశాలమై వెలసియున్నది. ఎదురుగానే శ్రీ భక్తాంజనేయస్వామి ఆలయం, రామచంద్రగుంటకు దగ్గరగా, స్వామివారికి అభిముఖముగా ఉన్నది. స్వామి వెలసి ఉన్న వీధిని "రాములవారి సన్నిధి వీధి" గా పిలుస్తారు.

సన్నిధి వీధిలోనే స్వామివారి ఉత్సవాలలో వాహన సేవకు ఉపయోగించే మండపం, దీనిని అనుకొని వెనుక భాగంలో (మెట్లు ఎక్కి వెళ్ళే విధంగా) రథోత్సవ సమయంలో ఉపయోగించే మరొక మండపం, దక్షిణమాడ వీధిలో శ్రీస్వామి వారి రథము ఉన్నాయి. విశాలమైన వీధులతో, ప్రశాంతమైన వాతావరణంలో స్వామివారు వెలసిఉన్నారు.

ఈ ఆలయము కూడా స్థానిక శ్రీ గోవిందరాజస్వామి ఆలయము లాగా చుట్టుప్రక్కల నివాస స్థానములు, బజారువీధుల మధ్య ఉన్నది. అయితే, స్వామివారి ఆలయము మూడు ప్రక్కల మాడా వీధులు మరియు సన్నిధి వీధి చాలా విశాలముగా వున్నవి. ఆలయము మాత్రము కొద్దిగా లోతట్టుగా ఉంటుంది. స్వామివారి ఉత్సవాలప్పుడు ఉత్సవ మూర్తులు. సన్నిధివీధి ద్వారా బయలుదేరి మూడు వీధులు తిరిగి, ఆనక సన్నిధి వీధి ద్వారా ఆలయంలోనికి ప్రవేశిస్తారు. దీనిని మహాప్రదక్షిణం అంటారు.

స్వామివారి ఆలయము 3 ప్రాకారాలుగా అనుకోవచ్చు. దీర్ఘ చతురస్రాకారంలో ఉండే మొదటి ప్రాకారము, పైభాగాన అన్ని మూలల్లో గరుత్మంతుల విగ్రహాలు నమస్కార భంగిమలో ఉన్నాయి. ఈ ప్రాకారపు పడమటి వైపు గోపురము వుంది. అంటే ద్వారము పడమటి నుంచి తూర్పుకు ఆలయం లోనికి ప్రవేశించేలా వుంది. ఈ ప్రాకారాన్ని అనుకొని లో తట్టుగా సుమారు 12 నుంచి 15 అడుగుల వెడల్పుతో ఉత్తర, తూర్పు, దక్షిణ భాగాలలో స్వామి వారి పెద్ద ఉద్యానవనము ఉంది.

ఈ ఉద్యానవనం ఉన్న వరసలోనే ఆగ్నేయంలో స్వామివారి నైవేద్యాలకు వంటశాల ఉంది. తరువాత రెండవ ప్రాకారము స్వామి వారి ఆస్థాన, ముఖ మండపములను కలిగివుంది. మూడవ ప్రాకారములో స్వామి వారి గర్భగృహాలయము, శయన మందిరములు ఉన్నవి. తోటగోడకూ రెండవ ప్రాకారానికి మధ్య చాలా విశాలమైన భాగము ఉంది. దీన్ని పెద్ద ప్రదక్షిణంగా పిలుస్తూంటాం.

ఈ ఆలయానికి మొత్తం 11 మండపాలు ప్రధానంగా ఉన్నాయి. అవి 1.స్వామి వారి ఊంజల మండపం 2.ఆస్థాన మండపం 3.పురాణ పఠన మండపం 4.మరొక ఆస్థాన మండపం 5.ముఖ మండపం 6.రామానుజుల వారి మండపం 7.విష్వక్సేనుల వారి మండపం 8.శయన మండపం 9.గర్భ గుడి మండపం 10.వాహన మండపం 11.ఉత్సవ మండపం.

ఈ ఆలయంలో మూలమూర్తులు శ్రీ సీతా దేవి, శ్రీ కోదండరామ స్వామి, శ్రీ లక్ష్మణ స్వాములు, వారి ఉత్సవ మూర్తులు ఉండటమే కాక, సీతారాముల మధ్య భక్తాంజనేయ స్వామి ఉత్సవ విగ్రహం కూడా వుంది. మరో విశేషమేమంటే, తిరుమలలో వలె ఇక్కడ నిత్య పూజలో పంచబేర మూర్తులు ఉన్నారు. ఇలా పంచబేర మూర్తులు ఉండటం (తిరుమలలో వలె) ఈ ఆలయ ప్రత్యేకత. ఏకాంతసేవకు శ్రీకృష్ణస్వామి విగ్రహం ఒకటి ఉన్నది.

ఇక ఆలయ గోపురం, ప్రాంగణం, ఆలయంలోని శిల్పాలు. ఇతర విశేషాలు. శ్రీస్వామివారి మూలవిరాట్ విగ్రహాల గూర్చి తెలుసుకొందాం,



# ఆలయ గోపురము

స్వామి వారి ఆలయగోపురపు పడమట దిక్కులో ముఖ ద్వారము యున్నది. గోపురము సుమారు 40 అడుగుల ఎత్తుతో (పీఠము నంచి) ఏడు కలశములు కలిగి ఉన్నది. ఈ గోపురముపైన వివిధ రకములైన శిల్పాలను చూడవచ్చు. ముఖ్యముగా శ్రీ పంచముఖ ఆంజనేయ స్వామివారు, లక్ష్మణ, భరత శత్రుఘ్న, వశిష్ఠ, విశ్వామిత్ర సమేత శ్రీ సీతారామ పట్టాభిషేకము, గోవర్ధనగిరిధారి (గోవుతో సహ) అయిన శ్రీకృష్ణుడు, త్రివిక్రమావతారము, ఆలయ గోపురాన్ని మోస్తున్న భంగిమలో వివిధ దేవతలు, గోపుర పార్శ్వ శిఖరములపై (యిరు ప్రక్కల) దేవతలు, ఇంకా ఇలా వర్ణిస్తూపోతే ఎంతో చెప్పొచ్చు. నిజానికి చెప్పటుకంటే చూచితరించుటయే భాగ్యము - ఈ గోపురము మిగుల చూడ చక్కనిదై, చూపరులను ఇట్టే ఆకర్షించుచున్నది. ఇదొక అద్భుత కళానైపుణ్యము. దీనిని దేవస్థానం వారు 1951 సం॥లో పునరుద్ధరించినట్లు తెలుస్తున్నది. ఇది మూడు అంతస్తులు కలిగిఉన్నది. ముఖ్యముగా ఏకాంత సేవానంతరము, తలుపులు మూసి ఉన్నప్పుడు, ఈ గోపురము, అందం వర్ణించ నలవికాదు. "వైకుంఠద్వారములు ఇలా ఉంటాయేమో!" అనిపించేంత అద్భుతముగా ఉంటుంది ఈ గోపుర ద్వారము. తలుపుల ప్రక్కన ఇరువైపుల రెండు అరుగులు ఉన్నాయి. ఈ అరుగులపై రెండు స్తంభములు ఎదురెదురుగా వుండి, ఒక స్తంభముపై శ్రీ కోదండ రాములవారు ఎదురుగా ఉన్న మరొక స్తంభముపై శ్రీ భక్తాంజనేయ స్వామి వారి శిల్పాలు ఉన్నవి. ఇంకనూ అనేక శిల్పాలను చూడవచ్చు. ఈ అరుగులపై కూర్చొని, మేళగాళ్ళు, సన్నాయివాళ్ళు, ఉషోదయ, సంధ్యా కాలాలలో మేళం, సన్నాయివాద్యాలు వాయిస్తారు.

ఈ విధంగా దినములో రెండుసార్లు, ప్రొద్దున, సాయం సంధ్యవేళల్లో సన్నాయి మేళం వాయించుట ఇక్కడి ఆచారముగా ఉంది . బహుశా! ఇది దేవతలకు ఆహ్వానమేమో!

స్వామి వారి ఆలయంలోకి వెళ్ళేందుకు ఈ గోపురము ఒక్కటే మార్గము. ఒకప్పుడు ఈ గోపురాన్ని "పడికావలి గోపురం" అని పిలిచేవారు. ప్రస్తుతము చుట్టూ ఉన్న నాలుగు భాగాల కన్నా ఆలయము కొంత లోతట్టున ఉన్నకారణంగా, మెట్లు దిగి ఆలయంలోకి ప్రవేశిస్తున్నాము. ఒకప్పుడు మెట్లెక్కి మరలా మెట్లు దిగి లోనికి వెళ్ళేవిధంగా ఉండేదట!

ఈ గోపురద్వారం కుడి ప్రక్క కొంచెం పై భాగాన (ఉత్తరాన) వరాహము, ఖడ్గము చిహ్నాము కనిపిస్తాయి. ఇది విజయనగర సామ్రాజ్యధీశులకు సంబంధించినది. దిగువననే ఒక శాసనం (బహుశ ద్రావిడ భాషలో ఉండవచ్చు) కనిపిస్తుంది. దీన్ని గురించి ఆలయ చరిత్రలో తెలుసుకొన్నాం. గోపురము ఆవలివైపున వున్న శిల్పాలు పరిశీలిస్తే ఆలయ పునరుద్ధరణ చేసిన సం॥ 1951 అని తెలిపే రెండు విగ్రహాలు, వెన్నె తింటున్న కృష్ణుడు, వరాహస్వామి, ఇంకా భక్తితో అంజలి ఘటిస్తున్న అనేక శిల్పాలు, హయగ్రీవ స్వామి, శ్రీ వేంకటేశ్వర స్వామి, ఇతర మహర్షుల శిల్పాలను చూడవచ్చు. గోపుర పార్శ్వముల పై కూడా చాలా అద్భుతమైన శిల్పాలను చూడవచ్చు.

ఈ గోపుర శిఖరాన్ని చూస్తే, సరిగా నాఊహకు, తిరుమలలో స్వామి సన్నిధిలోని వెండి పడికావలి గోపురము గుర్తుస్తోంది. ఆగోపురముపై కూడా దాదాపుగా ఇవే శిల్పాలు, ఇలాంటి భంగిమలో ఉన్నాయి. దీన్ని తిరుమలలో **"హతిరాం బావాజీ"** గోపురంగా పిలవటం అందరికీ తెలిసిందే. ఇది కూడా 7 కలశములు కలిగి, మూడు అంతస్తులలో ఉన్నది. శ్రీకోదండరామస్వామి వారి ఆలయ గోపురము కూడా దాదాపు ఇంతే ఎత్తు కలిగి, ఏడు శిఖరములు కలదై, అదే విధంగా మూడు అంతస్తులలో అమరి ఉండడం విశేషము. అయితే ఇది పడమటి ముఖ ద్వారము, తిరుమలలో తూర్పు ముఖద్వారము అట్లయినా కూడా అద్దములలో పెట్టినట్లు అనుకోవచ్చు ఎంతవిశేషం! తిరుపతిలోని చుట్టు ప్రక్కల ఇదే కాలానికి చెందిన ఏ ఆలయానికి ఇట్టి పోలిక కనిపించదు. తిరుమల హతిరాం బావాజీ గోపురానికి (వెండిపడి కావలి గోపురము) తిరుపతి

శ్రీకోదండరామస్వామి వారి గోపురశిఖరానికి ఏదో అవినాభావ సంబంధం ఉందనిపిస్తుంది. ఇది ఒక పోలిక. హతీరాం బావాజీ దాయాలాడుతున్న తిరుమల వెండిపడి కావలిని "సీతారామ గోపురం" అని కూడా పూర్వం పిలిచేవారు. ఇదీ ఒక విశేషము. ఇందుకు కారణము ఆ గోపురం దిగువ గోపురానికి ఎడమ ప్రక్క శ్రీ సీతారామ పట్టాభిషేక దృశ్యం చెక్కబడి ఉండటమే. (స్వామి ఏ రహస్యాన్ని ఎలా దాస్తున్నాడో అనిపిస్తుంది). ఇక ఆలయ ప్రాంగణంలోకి అడుగిడదాం. ఇంకెన్ని విశేషాలు కనిపిస్తాయో!

ఆహా! ఏమి ఈ అద్భుతము ఎంత పెద్ద ప్రాంగణము! ఎంత ప్రశాంతత! పట్టణం మధ్యన ఇంతటి ప్రశాంతత ఎలా లభిస్తోంది? సందేహము లేదు ఇది కేవలము స్వామి వారి కరుణే.

సామాన్యముగా ఆలయ గోపుర కలశములు 3, 5, 7, 11 వంటి బేసి సంఖ్యలతో నిర్మితమై ఉండుటను అందరూ గమనించే ఉంటారు. దీని గురించి వివరణ ప్రత్యేకించి వైఖానస ఆగమములో కనిపించుట లేదని పండితుల అభిప్రాయము. 'మరీచి విమానార్చన కల్పము' నందు కూడా దీని గురించిన వివరణ అందుబాటులో లేదట! బహుశా! శిల్ప శాస్త్రమునందు దీనికి వివరణ ఉండవచ్చునని కొందరి పండితుల అభిప్రాయము. శిల్పశాస్త్ర పరంగా ఆలయ గోపురపు ఎత్తు, ఏర్పడి వున్న ప్రదేశం ఆధారంగా కలశాలు నిర్మిస్తారని కొందరి అభిప్రాయము.

ఇక్కడ 7 కలశములు ఉండటం బహుశా! సప్తగిరుల మధ్య వెలసిన మూర్తుల ఆలయాలను నిర్మించేటప్పుడు అలా నిర్మించటం సబబని శిల్పచార్యుని ఉద్దేశ్యమేమో! ఇక సనాతన మతంలో ఈ 7 సంఖ్య ప్రాసస్థ్యం గురించి వేరుగా చెప్పనవసరం లేదు. సప్తర్షులు, సప్తస్వరాలు, సప్తవర్ణములు, సప్తమాత్రుక దేవతలు, ఇలా ఒక్కటేమిటి ఎన్నో విధాలుగా ఈ 7 సంఖ్య ప్రమాణమైయున్నది. శ్రీరాములవారి పరాక్రమానికి సప్తతాళ వృక్షభేదనం ఒక ఉదాహరణ అని అందరికీ తెలిసిందే!



21

# స్వామి వారి ప్రాంగణము

## స్వామి వారి ధ్వజ స్తంభము:

ముఖ ద్వార గోపురమునకు సుమారు 15 నుంచి 20 అడుగుల దూరములో స్వామి వారి ధ్వజ స్తంభము, బలిపీఠం దర్శనమిస్తాయి. గోపురం బయట నుంచి కొంతదూరంలో నిలబడి చూస్తే, ఈ ధ్వజ స్తంభము,. బలిపీఠం సరిగ్గా తిరుమల శ్రీవారి ధ్వజస్తంభము, బలి పీఠంలను గుర్తుతెస్తున్నాయి.

ఈ మధ్యనే (2000 సం॥లో) బంగారు పూత కలిగిన రేకులచే కప్పబడిన ఈ బలిపీఠం ఒక అత్యద్భుతమైన కళానిధి. ఎంతో ఆకర్షణీయమైనది. పూర్తిగా రాతితో నిర్మించబడిన బలి పీఠము ఇది. దీనిని ఏర్పరిచిన శిల్పి, (లేదా) శిల్పులు ఎంతటి ధన్యులో అంతటి చిరస్మరణీయులు. దీని ముందున్న ధ్వజస్తంభము సుమారు 40 అడుగులు (భూమి నుంచి) ఎత్తుకలదై, పతాకముపై మూడు అరలు ఉన్నవి. దీనికి బంగారు తాపడంతో చేసిన తొడుగులు ఎంతో ఆకర్షణీ యంగా, భక్తి కలిగించే విధంగా ఉన్నాయి. ఇటువంటి ధ్వజస్తంభము ఎక్కడో చూసినట్లు అనిపిస్తుందే! సరిగ్గా గమనిస్తే పైభాగములో తిరుమల శ్రీవారి ధ్వజస్తంభము లాగానే ఉంది. కొంత ఎక్కువ ఎత్తు అనిపించినా అలానే ఉంది. అయితే, ఈ ధ్వజస్తంబం దిగువన స్వామికి అభిముఖంగా గరుడాళ్వారు, ఉత్తర, దక్షిణ దిక్కులలో శంఖం, చక్రం, మరో ప్రక్క (బలిపీఠం ఎదురుగా) శ్రీ భక్తాంజనేయస్వామి విగ్రహాలు చెక్కబడి ఉన్నాయి. అంటే ఘనాకారంగా ఉండే పీఠంపై స్తంభము ముందు నాలుగు భాగములుగా విభజించబడి తరువాత స్తూపాకారపు అరలుగా అమర్చి పతాకము కలిగి ఉంది. తిరుమలలో ధ్వజస్తంభం దిగువ 8 భాగాలు కలదై వీని యందు శ్రీకృష్ణుల వారి విగ్రహము. నామములు, శంఖు, చక్రము ఇత్యాది శిల్పములతో నిర్మించినారు.

దీనికి బంగారు తొడుగులు70 సం॥ల క్రితం వేశారట. (తిరుమల స్వామివారి ఆలయ ధ్వజ స్తంభానికి. శ్రీ కోదండరామస్వామి వారి ధ్వజ స్తంభానికి అత్యంత ఎక్కువ పోలికలు ఉండటం విశేషమే!) సామాన్యంగా ధ్వజస్తంభములపై ఆగమ శాస్త్ర ప్రకారముగా ఆలయంలోని మూర్తి స్తంభము పైభాగములో అమరి ఉంటారట. భక్తులకి స్వామి ఇక్కడ వెలసి ఉన్నట్లు తెలిపే ఉద్దేశం ఇదని కొందరి అభిప్రాయము. ఈ ధ్వజ స్తంభములు ముఖ్యముగా మూడు విధములుగా నిర్మిస్తారు. గోపురం ఎత్తు వరకు, స్వామి మూల విగ్రహం ఎత్తు వరకు లేదా విమానం ఎత్తు వరకు నిర్మిస్తారు. తిరుమలలో గోపురం ఎత్తు వరకు ఉంటే ఇక్కడ విమానం ఎత్తు వరకు ఉండటం వలన పొడవుగా ఉంది. ఈ ప్రాంగణంలో ఉన్న ధ్వజస్తంభంపై బ్రహ్మోత్సవాలప్పుడు ధ్వజరోహణం జరుగుతుంది. ఒక్కసారి ధ్వజస్తంభంపై దేవతలకు, బలిపీఠానికి నమస్కరించి, చుట్టు ప్రక్కల ఇంకనూ ఏమున్నవో పరిశీలిద్దాం!

## ప్రాంగణము - ఇతర విశేషాలు :-

శ్రీ స్వామివారి ప్రాంగణము అత్యంత విశాలమై, చూపరులను ఇట్టే ఆకర్షిస్తోంది. దీనిని ఇలా నిర్మించినవారు ఎంతటి ధన్యాత్ములో! కాదు పుణ్యాత్ములో! వీరు తప్పక స్వామివారి కృపకు పాత్రులై ఉంటారు. బహుశా! వారి కోరికపైనే స్వామి ఇక్కడ ఇంతటి ప్రశాంతతను ఏర్పరచాడేమో!

ఆహా! ఏమి ఈ ప్రాంగణ సౌందర్యము దీనిని మనకు అందించిన పూర్వులకు. కాపాడుతున్న తి.తి.దే. వర్గానికి మన కృతజ్ఞతలు తెలియజేసుకుందాం.

ఈ విశాల ప్రాంగణంలో స్వామి వారు వెలసి ఉన్న రెండవ ప్రాకారము ధ్వజస్తంభానికి సుమారు 50 నుంచి 60 అడుగుల దూరంలో ఉంది. ఈ రెండవ ప్రాకారమునకు సరిగా మధ్యగా నేరుగా సరళరేఖ గీస్తే ఏర్పడే భాగంలో ధ్వజస్తంభం నిర్మాణం జరిగిఉన్నది. అంటే

ధ్వజస్తంభము ఏర్పడిన బిందువు నుంచి ప్రాకారనికి సరళ రేఖ గీస్తే అది స్వామి ఎదురుగా ఉండటమే కాక. ఈ ప్రాకారాన్ని సరిగా రెండు సమ భాగాలుగా విభజిస్తుంది. ఇలాంటి అమరిక తిరుమల శ్రీవారి ఆలయంలో కనిపిస్తుంది. ఈ ప్రాంగణంలో ధ్వజస్తంభానికి దక్షిణం వైపు రెండు "4 స్తంభాలమండపాలు". ఉత్తరం వైపు ఒక విశాలమైన మంటపము ఉంది. వీటినే ఊంజల సేవ మండపం. హరికథ మండపం. నాట్య మండపంగా పిలుస్తారు. ఈ ఊంజల మండపం పెద్ద అరుగు కలిగి, నాలుగు స్తంభాలపై నాలుగు ప్రక్కల నాట్య భంగిమలో స్త్రీలు వారి పైభాగములో గొలుసుల ఆకృతిలో వున్న శిల్పాలలో దశావతరములు, కృష్ణ లీలలు చెక్కబడి పైభాగాన్న విమానం కలిగి శ్రీ సీతారామ లక్ష్మణులు, శ్రీ వేంకటేశ్వర స్వామి ఇతర శిల్పాలను కలిగివుంది. స్వామి వారి ఊంజలసేవ, ప్రస్తుతం కళ్యాణోత్సవం ఈ మండపంలోనే జరుగు తున్నవి. ప్రక్కనే వున్న ఆస్థాన మండపంగా పిలువబడే మండపము పై ఎటువంటి విమానము లేదు. ఈ మండపంలోని 4 స్తంభాలపై ఆలయములోని రాములవారి భంగిమలోని శిల్పం, సీతాదేవి శిల్పం, భగవత్ రామానుజుల శిల్పము లను చూడవచ్చు. ఉత్తర భాగంలో ఉన్న మంటపం పురాణ మండపంగా పిలుస్తారు. ఈ మండపములో స్తంభము లపై వీణ మొదలగు సంగీత వాయిద్యములు, శ్రీ వేంకటేశ్వర స్వామి, యోగ నరసింహస్వామి, నాట్య భంగిమలో స్త్రీ, పురుషులు (బహుశా! శివ పార్వతులు ఉండువచ్చు), తుంబురుడు ఇత్యాదిగా శిల్పములు బహు చక్కగా చెక్కబడి శిల్పి యొక్క సంగీత నాట్య సముపార్జిత విజ్ఞానాన్ని తెలియచేయడమే కాక ఒకప్పుడు ఈ మండపం వద్ద పురాణ శ్రవణమే కాక, సంగీత కచ్చేరిలు జరిగేవని తెలియజేస్తొంది. ఈ శిల్పము లన్నియు నిత్య నూతనముగా ఉన్నవి. ఈ మండపమును ఆనుకొని పాతకాలం నాటి బావి ఒకటి వుంది. ఒకప్పుడు రెండు బావులు ఉన్న స్వామివారి తోటలో ఈ దిగుడు బావి చాలా పెద్దది. దీనిని **"తోటబావి"** అని పిలిచేవారు. ఇది రెండు బావుల కలయిక. పెద్ద

ద్వారబంధము వీటిని విభజించుచున్నది. ద్వారము పై భాగములో శ్రీ కోదండరాముల వారి విగ్రహము ఉంది. ఒకప్పుడు ఈ పెద్ద బావి పై మెట్టు వరకు నీళ్ళు ఉండేవి. అయితే యిప్పుడు అసలు నీళ్ళు లేవు. కట్టడము మాత్రము ఒక చిహ్నంగా మిగిలి ఉంది. స్థానిక రామచంద్ర గుంటలో నీళ్ళు వస్తే, ఈ బావిలో తిరిగి నీళ్ళతో నిండే అవకాశం ఉంది. రెండవ బావి "**పోటుబావి**", ఇది వంటశాల ప్రక్కనే వంటనీటి కొరకు ఉండేది. ఇప్పుడు మూసివేయబడినది.

ప్రస్తుతం ధ్వజస్తంభ దక్షిణ భాగంలో ఉన్న మండపములో ఏ హరికొలువు జరుగుటలేదు. ఈ చిన్న మండపాన్ని ఆనుకొని ఒక పెద్ద అశ్వత్థవృక్షం (రావిచెట్టు) ఉంది. ఇది సుమారు 100 - 120 సం॥ల క్రింతం నుంచి ఉండిఉండవచ్చునంటుటూరు. దీనికి విశాలమైన అరుగును ఈ మధ్య కాలంలోనే ఏర్పచి ఉన్నారు. భక్తులు ఈ వృక్షం నీడన అనేక విగ్రహాలను పెట్టి ఉన్నారు. శేషశయన విష్ణుమూర్తి, శ్రీకృష్ణుడు, విఘ్నేశ్వరుడు ఇత్యాదిగా విగ్రహాలు కనిపిస్తాయి. పురాతన కాలం నాటి ఒక శిలా ఖండాన్ని వృక్షానికి ఉత్తరం భాగాన అరుగుపై ఉంచారు. దీనిపై రెండు ప్రక్కల ఏనుగు ఘీంకారాల మధ్యనున్న లక్ష్మీదేవి, మధ్యన ఒక చక్రము ఉన్నది. ఈ శిల్పం ఆలయంలో ఒకప్పుడు ఎక్కడో ఉండి ఉండాలి. ఈ అశ్వత్థ వృక్షానిక ఈ శిల్ప ఖండానికి కలిపి ప్రదక్షిణ చేసే వీలుగా ఈ వృక్షం ఉండటం విశేషం. పిల్లలు లేనివాళ్ళు మండలం రోజులు ఉదయాన్నే ఈ వృక్షానికి ప్రదక్షణలు చేస్తే పిల్లలు కలుగుతారని ప్రతీతి. అయితే శాస్త్రం నిర్ణయించిన విధంగా నిర్ణయించిన సమయంలో మాత్రమే ప్రదక్షిణం చేయాలని సలహా. అశ్వత్థం తన రూపమని శ్రీ మహావిష్ణువే స్వయంగా భగవత్ గీత విశ్వరూప సందర్శన యోగంలో తెలిపియున్నారు. ఇక్కడ అట్టి వృక్షము చెంతనే శ్రీ మహాలక్ష్మి చేరి ఉండటం ఎంత ఆశ్చర్యం. అంటే నారాయణున్ని స్మరిస్తే, పూజిస్తే తప్పక శ్రీ లక్ష్మి అనుగ్రహం పొందగలరు.

బ్రహ్మ, విష్ణు,శివాత్మకమైన ఈ వృక్షానికి నమస్కరించి, ప్రదక్షిణ

చేస్తే మంచిది. శుభం కలుగుతుంది.

స్వామివారి 2వ ప్రాకారాన్ని చూస్తే, పైభాగములో రామాయణ ఘట్టములు అరలలో ఏర్పరచి తిరుమల శ్రీవారి ఆలయములో వలె నిర్మించబడి ఉన్నది. ఇందులో అహల్యా శాప విమోచనం, రామ సుగ్రీవ మైత్రి, శ్రీ సీతారామ వనవాసం, శివధనుర్భంగం, మరొక ప్రక్క రావణుని ఎదురుగా వాలం చుట్టి, కూర్చుని సంభాషిస్తున్న హనుమంతుల వారిని, శ్రీరామ పట్టాభిషేక దృశ్యాన్ని ఇతరత్రా విశేష శిల్పాలన్ని చూడవచ్చు. ఇవన్ని నూతనమైనవే. ఈ ప్రాకారము అచ్చంగా శ్రీ వేంకటేశ్వరస్వామి వారి ఆస్థాన మండప ప్రాకారములాగానే (గరుడాళ్వార్‌ని, శ్రీ వేంకటేశ్వర స్వామి వారిని కలిగి వున్న ప్రాకారము లాగనే) ఉంది. అయితే తిరుమలలో ధ్వజస్తంభానికి, ఈ ప్రాంగణానికి మధ్య సీతారామ గోపురం (హతీరాం బావాజీ వెండి పడికావలి) ఉండటం వల్ల ప్రాకారము కేవలం 6 నుంచి 8 అడుగుల దూరంలో ఉన్నది. ఇక్కడ ఈ ఆలయంలో కూడా మరొక గోపురము ఉండి ఉంటే సరిగ్గా తిరుమల ఆలయంలాగానే ఉండేదేమో! ఈ ప్రాకారం వల్ల ఏర్పడిన మంటపాన్ని "ఆస్థాన మండపం" అంటారు. ఈ ప్రాకారము కూడా తిరుమల శ్రీవారి ఆలయంలో వలె మూలవర్లని, గరుడాళ్వార్ వారిని కలిగిఉంది. తిరుమలకు సీతారామ గోపురంను అనుకొని ఒక ప్రక్క శ్రీ వరదరాజ స్వామి వారి ఆలయం, మరొక ప్రక్క శ్రీ యోగ నరసింహస్వామి వారి ఆలయం ఉండటం అందరూ చూచే ఉంటారు. శ్రీ కోదండరామస్వామి ఆలయంలో ధ్వజస్తంభం తరువాత మరొక గోపురము ఉన్నట్లయితే, (ఈ రెండు ఆలయాలు నిర్మించేవీలుగా కూడా ప్రదేశం అందుబాటులో ఉంది). అచ్చం అలానే ఉండివుండేది. అయితే, అలా నిర్మాణం చేయటం ఆలయ ఆగమశాస్త్రానికి విరుద్ధమేమో! కేవలం పోలికను చెప్పటానికి ఇలా వ్రాస్తున్నాను.

స్వామి వారి రెండవ ప్రాంగణానికి తోట ప్రాకార గోడకు మధ్య ఉండే ప్రదేశం గుండా "స్వామి వారి ఆలయానికి" రెండవ పెద్ద ప్రదక్షిణం చేసేవీలుగా ఉంది. (మొదటి ప్రదక్షిణం ఆలయం సన్నిధి మరియు మాడా

వీధుల గుండా చేసే వీలుంది. దీన్ని మహా ప్రదక్షిణం అంటారు). ఆహా! ఎంత విశాలంగా, అద్భుతంగా, ప్రశాంతంగా ఉంది, ఈ ప్రదక్షిణ మార్గం. ఈ ప్రదక్షిణం చేసేటప్పుడు, ఉత్తర భాగంలో తోట ద్వారబంధము ఎదురుగ నాలుగు అరుగులు, ఒక ప్రక్క చిన్న గూటిలో వెలసి వున్న శ్రీ భక్తాంజనేయ స్వామివారిని దర్శించవచ్చు. స్వామివారి ఆలయము 2వ ప్రాంగణము వెనుక తూర్పు భాగం నుంచి చూస్తే, అలిపిరి గాలిగోపురంపై ఉన్న శ్రీ వేంకటేశ్వరస్వామి నామాలు, శంఖు చక్రాలు కనిపిస్తాయి. అలాగే దక్షిణం వైపు నుంచి తిరుమలకు నడిచి వెళ్ళే ఈ మార్గం బహు సుందరంగా దర్శనమిస్తుంది. పగటి పూట రెక్కలు విడిచి ఎగురుచున్న ట్లున్న గరుత్మంతుడి వలె, రాత్రి అలిపిరి నడక దారి దీపాలంకరణ పడగ విప్పిన ఆది శేషుని వలె అత్యంత అద్భుతంగా దర్శనమిస్తుంది. తిరుమల శ్రీవారి ఆలయము వెనుక వైపు ఏర్పడి వున్న పర్వతములు కూడా శ్రీ బేడి ఆంజనేయస్వామి వారి వద్ద నుండి చూస్తే, సరిగ్గా రెక్కలుచాపి ఎగురు చున్నట్లున్న గరుత్మంతుని వలె ఉండటం అందరూ గమనించి ఉంటారు. ఇక ఇక్కడి 2వ ప్రాకారపు గోడలని పరిశీలిస్తే, ఈ కట్టడానికి వినియోగించిన రాళ్ళు, (Size & Shape) పూర్తిగా తిరుమల శ్రీవారి ఆలయ ప్రాకార (వైకుంఠద్వారమార్గము, గర్భగుడిని కట్టిన రాళ్ళ ఆకృతి వలే) ఉండటం విశేషం. ఈ రాళ్ళపై వరాహము, ఖడ్గము, సూర్యుడు చిహ్నాలు చాలా ఉన్నాయి. స్వామి వారి ఈ ప్రదక్షణ మార్గంలోనే, తూర్పున ఆగ్నేయంలో స్వామివారి నైవేద్యాలు వండే వంటశాల ఉంది. ఈ వంటశాలలో ఒక అమ్మవారి విగ్రహము, చిన్న ఆలయములో ఉంది. ఈమెను ఇక్కడి అర్చకస్వాములు "**వకుళాదేవి**"గా వ్యవహరిస్తున్నారు.

తిరుమలలో కూడా స్వామివారికి వంటశాలలో "**వకుళాదేవి**" ఉండటం అందరికీ తెలిసిందే. "**తల్లి చేతి వంట**" ఎవరికైనా ఇష్టమేకదా! మరి శ్రీ కోదండరాముల వారి ఆలయంలో కూడా శ్రీ వకుళమాత ఉండటంమూలన, ఈయనను శ్రీ వేంకటాద్రి రాముడు అనుకోవటం సబబే. ఇది మరొక పోలిక. ఇలా ప్రదక్షిణ చేసేటప్పుడు స్వామి వారి

విమానాన్ని దర్శిస్తే. వివిధ దేవతల నిలయమై ముఖ్యంగా శ్రీ వరాహస్వామి. శ్రీ నరసింహస్వామి. శేషుని పై ఆశీనుడై ఉన్న శ్రీమహావిష్ణువునూ. విమానమును మోస్తున్న భంగిమలో ఇతర శిల్పాలను చూడవచ్చు. అత్యంత రమణీయంగా ఉంది ఈ విమానం దీని గురించి ఆలయ చరిత్రలో వివరించడమైనది. ఈ స్వామివారి విమానం ముందు వైపున. పడమర ప్రక్క చూస్తున్నట్లు మూలవర్లను పోలిన శ్రీ సీతారామలక్ష్మణులు ఉన్నారు. ఈ ప్రదక్షిణం తిరుమల శ్రీవారి విమాన ప్రదక్షిణాన్ని గుర్తు చేస్తుంది. [ఈ విమాన శిఖరానికి కొంత దూరంలో పడమటి నుంచి శ్రీ సీతారామ లక్ష్మణులకు అభిముఖంగా వుండి తీసిన ఒక చిత్రపటము (ఫోటో). గమనిస్తే తూర్పు భాగంలో ఏర్పడి వున్న కొండ ఆకృతి, తిరుమల శ్రీవారి విమాన శిఖరానికి పడమటి భాగం నుంచి తీసిన చిత్ర పటము (ఫోటో)లో తూర్పుఈశాన్యభాగంలో ఏర్పడిన కొండ ఆకృతిని పోలి వుంది. దీనికి నిదర్శనంగా ఈ ఫోటోలను ఇందు పొందుపరుస్తున్నాము.] ఈ ప్రదక్షణ పూర్తి చేసికొని రెండవ ప్రాకారము లోనికి పడమట ద్వారం నుంచి స్వామి వారి గర్భగుడిలోనికి వెళ్లాము. ఇక ఆస్థాన మండపం ఇతర విశేషాలను చూస్తాం



# స్వామి వారి ఆస్థాని మండపం

రెండవ ప్రాకారములో "స్వామి వారి ఆస్థాన మంటపము" లోనికి వెళ్తున్నాం. ఇదివరకనుకొన్నట్లుగానే ఈ మండపము తిరుమల శ్రీవారి గరుడాళ్వారు ఉన్న మంటపంలాగానే ఉంది. అయితే ఉత్తర ద్వారం నుంచి వచ్చి ఉంటే, సరిగ్గా అలాగే అనిపిస్తుంది. ఇక్కడ కూడా ద్వారం వద్ద ఒక్క పెద్ద గంట (బహుపురాతనమైనది) వుంది. ఒక యాగ శాల వుంది.

బ్రహ్మోత్సవాలలో ఈ యాగశాలలో హోమం చేస్తారు. ఒక గది ఆలయ కార్యవర్గానికి కేటాయించబడి ఉంది. మరొక గదిపై **"శ్రీ సీతారామ కళ్యాణ మండపం"** అని వ్రాసి వుంది. అయితే యిప్పుడు భక్తుల సంఖ్య ఎక్కువయిన కారణంగా సీతారామకళ్యాణ, పట్టాభిషేక మహోత్సవాలను బయట ప్రాంగణంలో జరుపుతున్నారు. మరొక చిన్నగది (బహుశా! ప్రసాదాలను నిలువ ఉంచేందుకు కాబోలు) కూడా ఉంది.

ఈ మండపంలోనే స్వామి వారికి అభిముఖంగా "గరుడాళ్వార్" సన్నిధి వుంది. గరుడాళ్వార్ భక్తితో అంజలిఘటిస్తున్న భంగిమలో రెక్కలు సాచి, దోవతి ధరించి స్థానక భంగిమలో ఉన్నారు. ఈ మంటపంలో గరుడాళ్వార్‌కు ప్రదక్షిణం చేయగలిగే విధంగా చిన్న గుడివలె, నిర్మించబడి వుంది. వెనుకనుంచి కూడా స్వామిని దర్శించుకొనే విధంగా ఒక రంధ్రము ఏర్పరచబడి వుంది. ఈ ప్రదక్షిణ మార్గం నుంచి ఎదురుగా ఆలయములో వున్న ఆంజనేయస్వామి బాగా దర్శనమిస్తారు. ఈ గరుత్మంతుని ఆలయం పై. ముందు భాగంలో ఒక పొడవైన అద్దమును, అరలో మూయుటకు తలుపులు గలిగిన విధంగా అమర్చి ఉన్నారు. ఈ ఆలయము చిన్నదైనా కమ్ముల తలుపులు కలదై బహుసుందరముగా నిర్మించబడి వుంది. దీని పై ఉన్న అద్దం నుంచి కూడా స్వామిని దర్శించుకోవచ్చు : ఆశ్చర్యం! ఎంత చక్కగా కొలచి నిర్మించారు ఈ విధమైన అమరికను. (తిరుమలలో ఇలా కనిపించరు!). ఎంత చక్కగా ఉన్నారు స్వామి! అద్భుత మనోహర

సౌందర్య రూపం స్వామిది! అచ్చం శ్రీ వేంకటేశ్వరస్వామి వలె ఉన్నారు. కొంతదూరం నుంచి చూస్తే, గరుత్మంతుని అధిరోహించిన స్వామి వలె ఊహించుకోవచ్చు. స్వామి వారి సేవలలో "గరుడసేవ" శ్రేష్టమైనదని అందరికీ తెలిసిందే! బహుశా! అందుకే ఇలా అమర్చినారేమో ఈ అద్దాన్ని! ప్రతి ఆలయంలోను మూల విగ్రహములకు ఎదురుగా ఇలా అద్దములు అమర్చబడి ఉంచటం అందురూ చూచి ఉంటారు. దీనికి కారణం ఏమైఉండవచ్చు? ఆగమ శాస్త్ర ప్రకారమైతే సమాధానం అందుబాటులో లేదు. కాని ఆధ్యాత్మిక పరంగా ఆలోచిస్తే, మన మనస్సులను అద్దంతో పోలుస్తారు. మనస్సు నిత్యం లోకంలో చూస్తున్న ఎన్నో వస్తువులను, విషయాలను (ముఖ్యంగా మనకు బాగా నచ్చినటువంటి విషయాలను, దృశ్యములను). మన మనో ఫలకాలపై చిరస్థాయిగా ముద్రించుకొనేలా చేస్తుంది. అది మనస్తత్వం. అట్టి అద్దమంటి మన మనస్సులలో విశేషమైన స్వామి వారి సుందర రూపాన్ని నిలుపుకొని నిత్యం ఆరాధించి భక్తి మార్గంలో తన్మయత్వంతో మోక్షాపేక్షుడై భక్తుడై ఉండగలగాలని ఇలా అమరుస్తారు. (అంతే కాని ఆ అద్దంలో మన అందచందాలు చూచుకొని సవరించుకొనుటకు కాదు. తస్మాత్ జాగ్రత్త!) నిత్యం గరుడసేవని తలచే విధంగా ఉంది ఈ అమరిక. దీనకి అనుగుణంగా ఈ ద్వారం నుంచి, అద్దం నుంచి కూడా కేవలం స్వామివారు మాత్రమే దర్శనమిస్తారు.ఈ మధ్యనే సెప్టెంబరు 2002లో ఈ అద్దంను మాత్రము దేవస్థానం వారు మార్చినారు. ఇదివరకటి పురాతనమైన అద్దాని కంటె యిది కొంచెం చిన్నది అనిపిస్తుంది! గరుడాళ్వార్, ఆలయం నందు మూయుటకు కమ్మెల తలుపు కలిగినదై: ఒక హుండీ ముందర ఉంచబడివుంది. ఒకసారి స్వామికి గరుడాళ్వార్‌కి, నమస్కరించి ఇంకా విశేషాలు చూద్దాం!

అసలు ఈ మండపం నుంచే స్వామి వారిని దర్శించుకొంటూ వెళ్ళే అవకాశం ఉంది. మూడు ద్వారముల అవతల గంభీరమైన సుందరమైన, మనోజ్ఞమైన స్వామి వారి రూపం ఒక్కటే చక్కగా దర్శనమిస్తుంది. చాల మంది భక్తులు ఇక్కడ నుంచి స్వామిని చూచి శ్రీ వేంకటేశ్వరస్వామిగా

పొరపాటుపడుతుంటారు. అంత పోలిక విగ్రహంలో, అలంకరణలో కనిపిస్తుంది.

ఈ ఆస్థాన మంటపంలోనే, స్వామి వారి ముఖ మండపానికి వెళ్ళే ద్వారానికి సుమారు 10 అడుగుల దూరంలో ఆస్థాన సేవకు ఉపయోగించే ఒక అరుగు ఏర్పాటు చేయబడి ఉన్నది. స్వామివారి ఉత్సవ విగ్రహాలకు ఆస్థానం, అలంకరణ, అభిషేకం ఇత్యాది కార్యక్రమాలను ఈ అరుగుపైననే జరుపుతారు. ఈ అరుగు నాలుగు స్తంభాల ఆవృతంలో ఉంది. తెరలు నాలుగు వైపుల ఏర్పరచగలిగేందుకు వీలుగా స్తంభాలపై కొక్కెములు అమర్చి ఉన్నారు. నాలుగు స్తంభాలపై ఆవృతం పై కప్పు (అరుగుకు నేరుగా) అందమైన తైల చిత్రవర్ణన కలిగి వుంది. ఈ మండపమంతా రంగురంగుల రంగవల్లులతో బహు సుందరంగా, ప్రశాంతంగా ప్రమోదం కలిగించే విధంగా ఉంది. ఈ మండపంలో అరుగు వద్ద స్తంభముపై మరో చిన్న గంట కూడా అమర్చబడి వుంది.

ఈ ఆస్థాన మండంప స్తంభాలపై ఎక్కడ చూచినా శ్రీరాములవారు, శ్రీ శ్రీనివాసుడు, ఆసనంలో శ్రీ మహాలక్ష్మీదేవి, దోగాడే చిన్ని కృష్ణుడు, తాండవ కృష్ణుడు, వెన్న దొంగలించే కృష్ణుడు, ముఖ్యంగా మర్రి ఆకుపై ఉన్న బాలకృష్ణుడు (వటపత్రసాయి), రోలునులాగుతున్న కృష్ణుడు (రోలుకి కట్టివేసినప్పుడు), శ్రీ వీరాంజనేయ స్వామి వారు, గరుత్మంతులవారు, తామర మొగ్గ తినే హంస, బోధనలో ఉన్న మూర్తులు, ధ్యానంలో ఉన్న మూర్తులు ఇత్యాది శిల్పాలను చూడవచ్చు. ఇంకా శ్రీ పరశురాముల వారు, శ్రీ నరసింహస్వామి వారు, సీతమ్మ కాలునందలి ముల్లును బాణంతో తీస్తున్న శ్రీరాములవారు, చిత్రాలు దర్శనమిస్తాయి. ఎక్కువగా శ్రీ వీరాంజనేయస్వామి వారి శిల్పాలు ఉన్నవి. ప్రతి స్తంభము దిగువ భాగంలో సింహములను చెక్కి ఉన్నారు. ఆలయంలో బయటగానీ, లోపలగానీ ఎటువంటి అసభ్యకరమైన శిల్పాలు కనిపించవు. ఇది మరో విశేషం! ఇలాంటి అమరికకు ముఖ్య కారణం ఆలయానికి వస్తే నిరంతర భగవత్ధ్యాన పరులై మనస్సును



రాతి దీపస్తంభం





తిరుమల శ్రీవారి విమానం ముందుభాగంలో అతి చేరువలో ఏర్పడివున్న కొండ, శ్రీకోదండరామస్వామి విమాన వెనుకభాగంలో సుదూరంగా ఏర్పడివున్న కొండల ఆకృతులు పై చిత్రములలో గమనించగలరు.

పూర్తిగా స్వామిపై నిలపాలని, అంతేకాక భాగవత. రామాయణ ఆదిగా గల ఇతిహాస పురాణ పఠనమప్పుడు కాని, శ్రవణమప్పుడు కాని. కొన్ని మూర్తులను ధ్యానించడం యంత్రముగా ఉపాసన చేయడం మంచిదన్న భావన. భాగవతంలోని "శ్రీకృష్ణలీల"ల్లో ఒకొక్క రూపాన్ని ధ్యానిస్తే ఒక్కొక్క ఫలితం ఉపనిషత్తుల యందు వివరించబడి ఉందని పెద్దల మాట. మొట్టమొదటగా ఉన్న స్తంభము పైన, సృష్టి ఆది అంతాలలో సకల జీవులు నశించిన తర్వాత చిద్విలాసంగా నవ్వుతూ మర్రి ఆకుపై శయనించిన శ్రీ కృష్ణుని రూపాన్ని చెక్కడం విశేషమే. ఇంతేకాక ఈ ఆలయంలో కొన్ని స్తంభములపై యంత్రముల వంటివి దర్శనమిస్తాయి. వీటి వివరములు తెలియుటలేదు. స్త్రీ, పురుష దేవతమూర్తులు రంగవల్లుల వంటి చక్రములు (బహుశా యంత్రములు) జంతు, పుష్ప లతాధికములు బహు సొగసుగా, సుందరముగా మలచిబడి ఉన్నవి. ఈ మండపంలోనే శ్రీ సీతారామ కళ్యాణ మండపం గోడపైన ఒక పురాతన "శ్రీసీతారామపట్టాభిషేకం" తైలవర్ణ చిత్రపటము ఉంది. ఈ చిత్ర పటములో లక్ష్మణ, భరత, శత్రుఘ్న, ఆంజనేయ, జంబావంతాది వానరవీరులు, పుర ప్రముఖులు మరియు విశ్వామిత్ర, వశిష్ట మహర్షుల సమేత శ్రీ సీతారాములను దర్శించవచ్చు. ఇది అత్యంత అద్భుతంగా వుంది. అందరూ దీనిని చూచి తరించాల్సిందే! ఇలాంటి చిత్ర పటాన్ని దేవస్థానం వారు మరలా చిత్రించుటకు ప్రయత్నించినారు. కాని కళ అంతగా రాలేదని చెప్పవచ్చు. ప్రస్తుతం ఈ క్రొత్త చిత్రపటాన్ని యాగశాల గోడ వైపు వుంచారు. ఈ మండపంలోని యాగశాలను అనుకొని ఒక గది (Broad Casting కొరకు) ఉంది. ఇక్కడి నుంచి భక్తీగీతాలు వినిపిస్తుంటారు. ఈ గదిపై ఒక అరలో శ్రీ వేంకటేశ్వరస్వామి వజ్ర కవచ, వజ్రమకుటధారియై యున్న ల్యామినేషన్ పటం దర్శనమిస్తుంది. దీనికి కూడా మూయుటకు తలుపులు ఉన్నది.

ఈ ఆస్థాన మండపంలోనే ముఖ మండపానికి, గర్భగుడికి దారినిచ్చే మొదటి అతిపెద్ద ద్వారం వుంది. ఇక్కడ ముందర భాగంలో ఒక పెద్ద

మకర తోరణం వుంది. (ఈ మధ్యనే "క్యూ" పద్ధతి నిర్మాణమప్పుడు దీనిని తీసివేసారు). దీనిపై విద్యుద్దీపాలంకృతములతో "శ్రీరామ" అని వ్రాయబడి వుంది. ఈ ద్వారము ముందు ఇరువైపుల రెండు అరుగులు వుంది. అరుగులపై జయ విజయులు వంటి విగ్రహాలు చిన్నవి రెండు వైపులా చెరి ఒకటి ఉన్నది. అయితే జయ విజయుల భంగిమలో మార్పు కలదు. చతుర్భుజులై, శంఖ చక్ర దండములను ధరించి ఉన్నారు. బహుశా! ఇది ఒకప్పుడు గర్భగుడి ముందర ఉండి ఉండాలి. విజయనగర సామ్రాజ్యాధీశులు పునరుద్ధరణ చేసేటప్పుడు క్రొత్తగా చేసిన, ఇప్పుడున్న పెద్ద జయ విజయుల మూర్తులను గర్భగుడి ముందుంచి, వీటిని ఇక్కడ వుంచి వుండవచ్చని నా అభిప్రాయం.

ఒకప్పుడు స్వామివారి ఆస్థానం, ఇతర విశేష ఉత్సవములు స్థానిక స్వామివారి పుష్పతోటలో జరిగేవి. ప్రస్తుతం ఈ పుష్పతోటని ఎస్.వి. జూనియర్ కాలేజ్ హాస్టల్‌గా ఉపయోగిస్తున్నారు. ఈ పుష్పతోటలో ఇప్పటికీ బహు సుందరమైన పాతకాలపు మండపం దర్శనమిస్తుంది.

ఈ ద్వారం నుంచే స్వామి వారిని దర్శనం చేసుకొంటూ వెళదాం! ఆహా ఏమి సుందర రూపం! ఈ స్వామి శ్రీ వేంకటేశ్వరుని గుర్తు తెస్తున్నారు. స్వామి దర్శనార్థం వచ్చే యాత్రీకులు స్వామిని ఇక్కడ నుంచి చూచిన వెంటనే "**హే! భగవాన్ బాలాజీ హై!**" అనటం స్వయంగా విని వున్నాను. అంతటి పోలిక, అలంకరణలో ముఖ కవళికలలో ఈ స్వామికి ఉంది. ఇది వాస్తవం! అవునూ! ఇది శ్రీ సీతారామ లక్ష్మణుల ఆలయం అయినా, ఈ ద్వారం నుంచి గర్భగుడి ద్వారం వెళ్ళే వరకు కేవలం శ్రీ కోదండరామ స్వామి వారిని మాత్రమే బాగా చూడగలం! అలా నిర్మాణం జరిగివుంది.

ఈ ఆస్థాన మండపం 20 స్తంభాలతో నిర్మితమైవుంది. ఇవి 5 అడ్డు వరుసలలో ఒక్కొక్క వరుసలో 4 స్తంభముల చొప్పున అమర్చబడి వున్నవి. ఈ అమరికలో ఒక అంతర్యం ఉందనిపిస్తుంది. సామాన్యంగా సరిసంఖ్యలు విష్ణుతత్త్వాన్ని, బేసి సంఖ్యలు శివతత్త్వాన్ని సూచిస్తాయి.

సనాతన మతం ప్రకారం శివకేశవులకు బేధంలేదు.

ఇక్కడ 5 వరసలలో ఉన్న 4 స్తంభములు 'చతుర్బాహు, చతురు వ్యూహః, చతుర్భుజ, చతుర్దంష్ట్రః, చతురాత్మ అనే విష్ణుతత్త్వాన్ని సూచిస్తే, 4వరుసలలోని 5 స్తంభములు త్రినేతుడై, పంచముఖుడై చెరి రెండువైపుల పంచాయుధములను ధరించిన, పంచాక్షరీ మంత్ర శివతత్త్వాన్ని సూచిస్తున్నాయి. ఇది పంచముఖుడైన వీరాంజనేయ తత్త్వంలోని రుద్రుని కూడా సూచిస్తుందనోకోవచ్చు. ఇట్లు వ్యక్తావ్యక్త సమన్వయ సూత్రతత్త్వమును సంఖ్య పరంగా అమర్చి శిల్పులు, సగుణ, నిర్గుణతత్త్వ భోదకులైరని చెప్పవచ్చు. అంటే మనం దర్శించబోయే, శ్రీరాములవారు సమన్వయ రూప తేజమనే దీని భావన. అష్టాక్షరీ మంత్ర మందలి 'రా' కారము, పంచాక్షరీ మంత్రమందలి 'మ'కారము 'రామ' నామమైన విషయం అందరికీ తెలిసిందే. ఈ తారకమంత్రమే సదసత్, సగుణ నిర్గుణో పాసన, నరనారాయణ, అర్థ నారీశ్వరతత్త్వములకు ప్రతీక. వేదకాలమునాటి అగ్నీషోమతాత్త్విక సూత్రమే, యర్ధనారీశ్వర తత్త్వముగా సగుణదృష్టిగా అవతరించినది అని అంటారు. (అగ్నీషోమాత్మకం జగత్ - శివుడు ఉష్ణతత్త్వము, విష్ణువు శీతలతత్త్వము). ఖజురాహో దేవాలయము లందు 'హరిహర శిల్పములు' కలవు. శిల్పశాస్త్రము ఈ తత్త్వములో ఎడమ వైపు విష్ణు చిహ్నములు, కుడిప్రక్క శివచిహ్నములు చెక్కవలెనని చెపుతుంది. ఎడమవ్యక్తదశ, కుడియవ్యక్తదశ. విష్ణుదేవీ, తేజస్సులు, శక్తులు సోదరీ సోదరులని పురాణప్రవచనము. మన భారతదేశంలో కళాసృష్టి ద్వారా ఆధ్యాత్మికత యిలా సంఖ్య ప్రమాణంలో శిలా వర్ణములందు అవతరించి ఉపాసింపబడటం గమనార్హం. శ్రీరాముల వారు రామేశ్వరంలో సైకత లింగాన్ని ప్రతిష్టించారు. మరి సాక్షాత్తు ఈశ్వరుడే రాములవారిని విష్ణు సహస్రనామంలో "శ్రీరామ రామరామేతి రమే రామే మనోరమే! సహస్ర నామత త్తుల్యం రామనామ వరాననే॥" అని స్తుతించారు. అలాంటి ఈ స్వామికి ఒక్కసారి చేతులెత్తి భక్తితో నమస్కరించి, ఈ ప్రాంగణం ద్వారం దాటి, ముఖమండపంలోనికి అడుగిడదాం.

# 34
# శ్రీవారి (శ్రీరామ) ముఖ మండపం

ఈ మండపం మరింత ఎక్కువ ప్రశాంతంగా ఆహ్లాదంగా ఉంది. దీనిని "**శ్రీవారి ముఖమండపం**" గా పిలుస్తారు. స్వామి దర్శనానికి వెళ్ళేప్పుడు, ఈ మండపంలో ఎడమవైపు స్తంభంపై యోగ నరసింహస్వామి వారి శిల్పము. దిగువనే శ్రీ వేంకటేశ్వర స్వామి శిల్పము ఉన్నాయి. ఈ శిల్పానికి ఎదురుగానే మరొక స్తంభంపై శ్రీ వరదరాజస్వామి వారి శిల్పం ఉంది. ఇవన్నీ తిరుమలలో శ్రీవారి ఆలయంలోని మూర్తులే.

ఈ శ్రీ వేంకటేశ్వరస్వామి, శ్రీవరదరాజ స్వామి, శ్రీ యోగ నరసింహస్వామి వారి శిల్పాలను మాత్రం మకర తోరణంలో ప్రతిష్ఠించి ఉన్నారు.

ఆహా! ఏమి ఈ విశేషం. శ్రీ వేంకటేశ్వర స్వామి వెలసివున్న ఈ స్తంభంపై మరొక ప్రక్క కూర్చున్న భంగిమలో శ్రీ మహావిష్ణువు, మకర తోరణంలో శ్రీ మురళీ కృష్ణుడు ఉన్నారు. ఈ శిల్పాలు బహు పురాతనమైనవయ్యూ, అత్యంత, నూతనంగా, సుందరంగా ఉన్నాయి.

ఇక, మకర తోరణంలో ఉన్న శ్రీ వేంకటేశ్వర స్వామిని పరిశీలిస్తే, అత్యంత ఆసక్తికరమైన, విశేషమైన విషయాలు తెలుస్తున్నాయి. అసలు ఈ శిల్పమే నాకు స్వామి వారికి, తిరుమల శ్రీవారికి ఏదో అవినాభావ సంబంధం ఉన్నదన్న స్ఫూర్తిని నాలో కలుగజేసింది.

ఈ స్వామిని చెక్కిన శిల్పి బహుశా! రాజాజ్ఞ మేరకు శ్రీ వేంకటేశ్వర స్వామి బాగా పరిశీలించిన పిమ్మట, ఆ శిల్పాన్ని చిన్నదిగా చేస్తే ఎలా ఉంటుందో అలానే చేయించి ఉండాలి. చిన్న మాటలో చెప్పాలంటే శ్రీ విమాన వేంకటేశ్వరస్వామిని పోలిఉంది. అత్యంత చేరువ నుంచి, శ్రీవారిని దర్శించుకొనే భాగ్యం భక్తులకు అందజేయాలన్న కాంక్షతో ఈ శిల్పాన్ని చెక్కినారనిపిస్తూంది.

అలంకరణ లేకుండా శ్రీ వేంకటేశ్వరస్వామి వారిని దగ్గర నుంచి చూస్తే స్వామి చతుర్భుజుడు, నాగాభరణుడు, మెడలో హారములు, కటి బంధములు, యజ్ఞోపవీతము, భుజములపై రామావతారంలో స్వామిని

విల్లంబులు ధరించిన కారణంగా ఏర్పడిన చారలు, దోవతి. వక్షస్థలంలో శ్రీ మహాలక్ష్మీదేవి స్వామి వారికి ఉన్నాయని అందరికీ తెలిసిందే. ఇవన్నీ ఈ విగ్రహంలోనే చూడొచ్చు. పైగా, హృదయ స్థానంలో లక్ష్మీదేవి బదులు ఓంకారాన్ని శిల్పి బహు జాగ్రత్తగా చెక్కి ఉన్నాడు. ఆహా! ఏమి ఈ శిల్పి నైపుణ్యము! ఎంతటి చతురత? మనకు ఈ కాలంలోని ఒక చిత్ర పటాన్ని ఇస్తే, అతి పెద్దది లేదా చిన్నది, కంప్యూటర్ స్కానింగ్ (లేదా) జిరాక్స్ ద్వారా చేయవచ్చు. అది కూడా కొన్ని వ్రాత విషయాలోన్లనే. అట్లాంటిది ఒక విశ్వవిఖ్యాతమైన శిల్పాన్ని చిన్నదిగా చేస్తే ఎలా ఉంటుందో, అలా తీర్చిదిద్దటం ఎంతో గొప్ప కళ. ఈ విగ్రహాన్ని చూస్తే స్వామిని అత్యంత దగ్గరగా చూసిన అనుభవం అందరికీ కలుగుతుందనటంలో సందేహం లేదు. ప్రక్కల నుంచి కూడా స్వామి వారిని చూడొచ్చు. స్వామివారు కటి వరదహస్తాలతో ఉన్నారు. శంఖ, చక్రాలు ధరించి, చిద్విలాసంగా నవ్వుతూ నేరుగా చూస్తున్నట్లుఉన్నారు. వేయి వర్ణలేల, శ్రీ స్వామివారిని, శ్రీ విమాన వేంకటేశ్వర స్వామిని ఇక్కడ నుంచి అత్యంత దగ్గరగా చూచి నమస్కరించి ఆ ఫలాన్ని పొందవచ్చు. ఈ స్తంభంను ఆనుకొని ఉన్న గదిలోనే స్వామి వారి ఆభరణాలు ఉండటం విశేషం! "ఓ" ఆకార రూపంలో స్వామి వారి హృదయంలో లక్ష్మీదేవి వెలసి ఉన్నది. తీక్షణంగా చూస్తే ఈ "ఓం కారన్ని" అందరూ దర్శించవచ్చు. ఒకసారి స్వామికి నమస్కరించి యింకా ఇక్కడ ఉన్న యితర శిల్పాలను పరిశీలిద్దాం. (తి.తి.దేవస్థానం వారు తిరిగి దాన్ని పునరుద్ధరించి, బంగారుతో గానీ, వెండితోగానీ తొడుగు ఈ శిల్పానికి అమరిస్తే బాగుంటుంది. ఎంచేతంటే ప్రతిదినము వచ్చే భక్తులు పండరీ పురంలో పండరీనాథున్ని దర్శనం చేసికొని పాదాలు తాకి నమస్కరించేటట్లు అందరికీ అవకాశం ఉండటం వలన స్వామి పాదాల వేళ్ళు, నాసిక కొంతవరకు అరిగినట్లు అనిపిస్తుంది). ఇంత అద్భుతమైన ఈ శిల్పంలో స్వామివారి విగ్రహంలో కనుబొమలు, పాదాల వేళ్ళు కూడా ప్రస్ఫుటంగా కనిపిస్తుంది. వేయి మాటలేల! ఇది స్వామి వారి నకలుగా అనుకోవచ్చు. శ్రీవారి యజ్ఞోపవీతం, కటి బంధములు శిఖలు, ఇలా

దగ్గర నుంచి దర్శించటం ఎంత భాగ్యమో! అందుకే ఈ మండపాన్ని "శ్రీ వేంకటేశ్వరస్వామి" మండపంగా నేను ఊహిస్తున్నాను. తిరుమలలో స్వామివారి విమానం పైవుండి ఉత్తరం వైపు చూస్తునట్లున్న విమాన వేంకటేశ్వరస్వామి రూపం ఇక్కడ స్వామివారి ఆలయములో దిగువననే వుండి, దక్షిణం వైపు చూస్తున్నట్లు ఉండటం గమనించవచ్చు!

అన్నట్లు, శ్రీ వేంకటేశ్వరస్వామి ఆలయంలోని శ్రీవారి శయన మందిరం ముందరున్నది "శ్రీ రాముల వారి మేడ" ఆహా! ఎంత ఆశ్చర్యము. ఇక్కడ శ్రీరాముల వారి శయన మందిరము ముందున్నది. "శ్రీ వేంకటేశ్వర స్వామిని" దగ్గర నుంచి చూపే శ్రీ వారి ముఖ మండపం. ఈ మండపంలోని ఇతర వివరాలను పరిశీలిస్తే ఇది నాలుగు స్తంభములు కలిగి ఉండి గర్భ గుడిలోకి, ఐదు మెట్ల ద్వారా (మొదటి మెట్టు ప్రక్కన నుంచి చూస్తే బాగా అగుపడుతుంది.) దారి కలిగి ఉండటమే కాక, స్వామి వారికి అతి "చిన్న ప్రదక్షణం" చేసే విధంగా నిర్మించబడివుంది.

ఈ మండపంలోనే దక్షిణం వైపు "శ్రీరామానుజులవారు" ఉత్తరం వైపు "శ్రీ విష్వక్సేనుల" వారి విగ్రహాలు కలిగిన చిన్న ఆలయమండపాలు ఉన్నాయి.

శ్రీ రామానుజుల వారి విగ్రహం "ఉపదేశ ముద్ర" లో ఉన్నది. ఈ విగ్రహాన్ని పోలిన చిన్న రాతి విగ్రహం మరొకటి, ఇక ఇద్దరు (రామానుజులు, తిరుమల నంబి అనుకుంటా) ఉన్న పంచలోహ విగ్రహములు కూడా ఉన్నవి.

శ్రీ విష్వక్సేనులవారి ఆలయంలో పెద్ద విగ్రహమున్నూ, దీన్ని పోలిన చిన్న రాతి విగ్రహము మరియు పంచలోహ విగ్రహము, చక్రత్తాళ్వార్ (పంచలోహముతో చేసినవి) ఉన్నాయి. వీటికి కూడ ఆగమశాస్త్ర పద్ధతిలోనే నివేదనలు, పూజలు జరుగుతున్నాయి. బ్రహ్మోత్సవాలు, ఇతర విశేష రోజుల్లో స్వామి వారి సేవలు ఆరంభమయ్యే ముందు, ప్రతిరోజు విష్వక్సేనుల వారు (చక్రత్తాళ్వార్) కార్యాలన్నీ సరిగ్గా జరుగుతున్నాయో లేదో అనట్లుగా సన్నిధి వీధి, మూడు మాడా వీధుల్లో ఉత్సవంగా వచ్చి

పరిశీలిస్తారు. (తిరుమలలో వలనే)

ఇంకా ఈ మంటపంలోనే అతి పెద్ద జయ విజయుల విగ్రహాలు (పూర్తిగా గ్రానైట్ అనిపిస్తాయి) అత్యంత ఆకర్షణీయంగా, శంఖ, చక్ర, గదా ధారులై ద్వారపాలకులవలె, ఒక వేలును చూపిస్తూ (చూపుడువేలిని) నిలబడి ఉన్నారు. ఆహా! ఏమి అద్భుత శిల్ప సౌందర్యం. ఇంత పెద్ద జయ విజయులు స్థానిక శ్రీ గోవిందరాజస్వామి వారి ఆలయంలో మాత్రమే దర్శనమిస్తాయి. అవి కూడా ఇంత పెద్దవిగా అనిపించవు.

అయితే ఈ మహా మండపం ముందు కూడా, ద్వారపాలకులు అరుగులపై ఉన్నారే! నాకు తెలిసినంతలో ఇక ఏ (తిరుపతి) ఆలయంలో రెండు ద్వారములందూ, ద్వారపాలకులు ఉండరు (గర్భ గుడి ముందు తప్ప!) ఇక్కడి విశేషం, ప్రతి ద్వారము ముందు ఉండటం. అందుకే ఇది వేంకటేశ్వరస్వామి లోపల ఉన్న కారణంగా అనుకోవచ్చు. గర్భగుడి ముందున్న పెద్ద ద్వార పాలకులు శ్రీ కోదండరామ స్వామి వారి కొరకు ఉన్నారని అనుకోవచ్చు (ఆధ్యాత్మిక పరంగా).

ఇంకా ఈ మందిరంలో రామానుజులు వున్న ఆలయంపైన ఎడమవైపు "శ్రీ విఘ్నేశ్వరుని" విగ్రహం మలచబడి ఉంది. భక్తులెవరో గమనించి ఒక విద్యుత్ దీపాన్ని ఏర్పరచిఉన్నారు. ఈ విఘ్నేశ్వరుని తొండము ఎడమవైపునకు ఉండి, ఏక దంతంతో కూర్చొన్న భంగిమలో వుంది. స్వామి వాహనం ఎలుక కూడా చెక్కబడి వుంది. ఈ విగ్రహాన్ని చూస్తే మనకు ఒక్క సారిగా **"శ్రీ కాణిపాక విఘ్నేశ్వరుడు"** గుర్తుకొస్తారు. అయితే స్వామి ఇక్కడ చతుర్భుజుడై అభయ హస్తంతో ఆసన భంగిమలో వున్న శ్రీ మహా గణపతి లేదా. సిద్ధగణపతి.

సామాన్యంగా వైష్ణవాలయాల్లో విఘ్నేశ్వరునికి సంబంధించిన శిల్పాలు కనపడవు. అయినప్పటికీ ఇక్కడ ఉండటం విశేషమే! అది కూడా భగవద్రామానుజుల ఆలయంపైన ఏర్పడి ఉండటం! అంతేకాక, ప్రతి వినాయకచవితికి ఇక్కడి అర్చకులు పూజలు జరిపిస్తున్నారు బహుశా! ఆలయ పునరుద్ధరణ ఈ గోడ వద్ద నుంచే ఆరంభమై

ఉండవచ్చునని, అందుకే ఇక్కడ విఘ్ననాయకుని ప్రతిష్ఠించి ఉండవచ్చునని కొందరి అభిప్రాయము. ఇక్కడ గోడలో అమరిక కూడా కొంత వెనుక భాగాన ఉన్నట్లుగా (రెండవ ప్రాకారానికి) కనిపిస్తుంది. తత్త్వ విచారణ చేస్తే శ్రీ రాములవారి సన్నిధిలో అన్ని సిద్ధాంతాలు ఒక్కటే అని చూపటంకాబోలు! ఒక్కసారి! ఈ విఘ్నేశ్వరునికి, విఘ్ననాయకునికి గుంజీలు తీసి, నమస్కారాలు చేసి,

"శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్।
ప్రసన్నవదనం ధ్యాయేత్ సర్వ విఘ్నోపశాంతయే॥
వక్రతుండ! మహాకాయ! సూర్యకోటి సమప్రభ!
అవిఘ్నం కురు మే దేవ! సర్వకార్యేషు సర్వదా॥"

అని ప్రార్థించి ఇంకా ఈ ఆలయంలోని స్తంభాలపై ఉన్న శిల్పాలను గమనిస్తాం. పోట్లాటలో వాలిసుగ్రీవులు (కిష్కింధకాండ), ధ్యాన నిమగ్నమైన యోగులు, (ఆసన నమస్కార భంగిమలో), నమస్కార భంగిమలో వానర వీరులు దర్శనమిస్తారు. జయ విజయులకెదురుగా నున్న ఒక స్తంభంపై 'మకరతోరణంలో పాండురంగస్వామి', శ్రీ లక్ష్మీనరసింహ స్వామి, తాండవ కృష్ణుడు (కాళీయమర్ధనం), గోవర్ధనగిరిధారి, శ్రీ వేంకటేశ్వరస్వామి, తుంబురుడు శిల్పాలను మరియు స్వామిని తల్లులు ఉయ్యాల్లో ఊపుచున్న దృశ్యం (కౌసల్య, కైకేయి 'రామాలాలీ మేఘశ్యామాలాలీ' అంటునట్లుగా ఉండే బాలకాండ దృశ్యం), కృష్ణుడు వెన్న దొంగలించే దృశ్యం, దోగాడుతున్న చిన్ని కృష్ణుడు కనిపిస్తాయి. ఇలా ఎన్నో ఆకర్షణీయమైన శిల్పాలకు భక్తితో చేతులు జోడించి నమస్కరించి స్వామివారిని దర్శించే ముందు "చిన్న ప్రదక్షిణం" లోకి వెళితే, ఇంకెన్ని విశేషాలు కనిపిస్తాయో చూద్దాం!

స్వామి వారి గర్భగుడి, శయన మందిరంలకు మాత్రమే వేరుగా అనిపించేటట్లు చేసే ఈ ప్రదక్షిణం సుమారు 8 అడుగుల వెడల్పు కలిగివుంది. జయ విజయులలో, జయ ద్వారపాలకుని నుంచి, శ్రీ విష్వక్సేనులవారి ఆలయాన్ని దర్శించి, నమస్కరించి, ప్రదక్షిణకు వెళ్దాం.

ఈ ప్రదక్షిణ చేస్తుంటే, ఆలయ నిర్మాణం, గర్భగుడి వెలుపలి గోడల్లో ఖాళీగా వున్న అరలు, గర్భగుడి వెలుపలి గోడలోనే పై భాగాన కొంత వరకు కనిపించే గుండ్రటి స్తంభాలు, రమణీయంగా మలచబడిన తీరు విజయనగర రాజుల కాలంలోని శిల్పకళా వైభవాన్ని ప్రస్ఫుటపరుస్తూ, మనోల్లాసాన్ని, భక్తిపారవశ్యాన్ని ప్రమోదాన్ని కలుగజేస్తోంది ఈ ప్రదక్షిణం తిరుమల శ్రీవారి వైకుంఠద్వార ప్రదక్షిణాన్ని గుర్తు చేస్తోంది. తిరుమలలో కూడా నిర్మాణం ఇలానే ఉన్నాయి. అక్కడ కూడా ఖాళీగా ఉన్న అరలే ఉన్నాయి. రాములవారి ప్రదక్షిణంలో ఇవి ఉత్తర, దక్షిణ గోడలలో చెరిరెండు, తూర్పున ఒకటి (మొత్తం 5) వుంది. ఈ అరలపై కూడా పూర్ణకలశములలోని సింహములను చూడవచ్చు. మొత్తం ఈ ప్రదక్షిణంలో 14 స్తంభాలు వున్నది. వీటిలో గరుడాళ్వారు, శ్రీ భక్తాంజనేయ స్వామి, సుదర్శన చక్రము కలిగిన ఒక స్తంభము ఆలయం తూర్పు వైపు, (స్వామి వెలసిన ఆలయమునకు వెనుక) ఒకటి భక్తులను విశేషంగా ఆకర్షిస్తోంది. కారణం ఆలయంలో ఏ స్తంభంపైనైననూ గరుత్మంత, హనుమ, సుదర్శనులు ఉంటే అది పూజనీయమట! ముఖ్యంగా ఈ స్తంభంపై నున్న ఆంజనేయస్వామి, శ్రీ వీరాంజనేయ స్వామి. దీనికి భక్తులు సింధూరం పూసి, తమలపాకులతో అలంకరించి, వెన్నపూసి ప్రదక్షిణలు చేస్తుంటారు. ఆంజనేయస్వామి చాల అద్భుతంగా చెక్కబడి ఉన్నారు. ఈ ప్రదక్షిణంలో ఉన్న 14 స్తంభాలకు గర్భగుడి గోడకు మధ్య, గాలి వెలుతురు వచ్చే విధంగా పైకప్పు అమర్చబడి (స్వామి వారి విమానం కొంత భాగం దర్శనము అయ్యేలా), ప్రతి స్తంభానికి ప్రదక్షిణ చేసే వీలు కలిగి ఉండటం మరో ఆశ్చర్యకరమైన విషయం. ఇంకా స్తంభాలపై ఒక్కొక్క విగ్రహం బహుసుందరంగా మలచబడి ఉంది. ఇందులో ఒక స్తంభంపై నున్న కోదండరాముని విగ్రహం ఈ ఆలయంలోని మూల మూర్తిలా వుంటే. మరొక చోట తిరుమల శ్రీవారి ఆలయంలోని శ్రీరాములవారి (ఉత్సవ మూర్తులను)ని పోలి ఉంది ఇంకా శ్రీ వేంకటేశ్వరస్వామి వారి శిల్పాలు. భక్తితో ధ్యాన నిమగ్నులైన వున్న

విగ్రహాలు, భగవత్ రామానుజులు, తిరుమలనంబి, సుందరకాండలోని ఆంజనేయస్వామి (అంగుళీయకముతో), పోట్లాడుకునే యోధులు, నాట్య భంగిమలో నాట్యకారులు (విష్వక్సేనుని పోలిన తప్పెటకారు), పద్మముల వంటి చక్రములు. తాబేలు, ఏనుగులు, పులి, పక్షి ఇత్యాదిగా ఎన్నో విశేషమైన శిల్పాలను దర్శించి, ప్రదక్షిణ పూర్తి చేసుకొని, రామానుజులను, పైనున్న విష్వక్సేనునికి మరొక్కసారి దర్శించి, నమస్కరించి, విజయ ద్వార పాలకుని ద్వారా శయన మండపంలోనికి ప్రవేశించాల్సి ఉంది. ఆలోచిస్తే ఈ ముఖ మండపంలో మొత్తం 18 స్తంభాలు, ప్రతి ఒక్కదానికి ప్రదక్షిణం చేసే విధంగా బహు సుందరముగా మలచబడి, మొదటి నాలుగు స్తంభాల మండప ఆవృత్తం పైకప్పు అష్ట భుజి వంటి ఆకృతి కలిగిఉన్నది. తిరుమల శ్రీ యోగనరసింహస్వామి వారి ఆలయ నిర్మాణంలో కూడా పైకప్పు ఇలాంట నిర్మాణమే కలిగిఉండటం గమనించవచ్చు.

ఈ ఆలయంలో ఋషుల వలే కాక రాజవేషధారులై (ఆభరణ ములు, కిరీటములు కలిగి - రాజర్షుల వలె) వున్న పురుషమూర్తులు కొన్ని చోట్ల ధ్యాననిమగ్నమై ఉన్నట్లు, బోధన చేస్తున్నట్లు కనిపిస్తాయి. తపస్సు లేదా ధ్యానముద్రలో వున్న ఈ శిల్పాల ముఖ కవళికలలో అంతః ప్రశాంతత, ఆధ్యాత్మికానురక్తి ప్రస్ఫుటంగా దర్శనమిచ్చేలా చెక్కబడి ఉన్నది. వీరుఎవరో తెలియటం లేదు. ముఖమండపములోని ఇటువంటి ఒక శిల్పాన్ని కొందరు విష్వక్సేనులుగా చెపుతారు.

అసలు ఒకప్పుడు ఈ మంటపాన్ని ''స్నపనమండపం'' గా పిలిచేవారు ఈ మండపంలో స్వామివారి గర్భగృహము ఒక పెద్ద అరుగు (24 x 24 x 2.5 అడుగులకొలతలతో)పై, గర్భగుడిగోడలు 10 అడుగుల ఎత్తు కలిగి బహు సుందరముగా నిర్మించబడివున్నది. ఈ మంటప నిర్మాణాన్ని పరిశీలిస్తే మండపంలో మొత్తం 18 స్తంభములు ఉండి ప్రతి స్తంభమునకు ప్రదక్షిణం చేసే విధంగా ఏర్పరచబడి వుందని తెలుసు కొన్నాం గర్భగుడి ముందు 4 స్తంభములు. చిన్న ప్రదక్షిణ మార్గములో

14 స్తంభములు కలిగివుంది. మరలా ఈ 14 స్తంభములునూ ఉత్తర భాగంలో నుంచి చూస్తే 6 గానూ తూర్పు భాగంలో నుంచి చూస్తే 4 గానూ, దక్షిణ భాగంలో నుంచి చూస్తే 6 గానూ అగుపడుతాయి. అంటే రెండు స్తంభాలు ఒకటి ఆగ్నేయమూల మరొకటి ఈశాన్యం మూలవున్నాయి. భక్తి తత్వచింతనతో, లోతుగా ఆలోచించి ఇలా నిర్మించినారనిపిస్తుంది. బాగా ఆలోచిస్తే భగవంతుని వద్ద వేదములు లేదా ధర్మముల వలె నాలుగు స్తంభములు ముందు వెనుకల ఉన్నవి. ఋక్, యజుః, సామ, అథర్వణ వేదములు నాలుగు, అహింస, సత్యము. దయ, శాంతి అను నాలుగు దేవతా రూపములు అనుకోవచ్చు. ప్రదక్షిణకు ఇరు ప్రక్కలను ఆరు వేదాంగముల వలె (శిక్షా,వ్యాకరణము, ఛందస్సు, జ్యోతిషము, నిరుక్తము, కల్పములవలె) ఆరు స్తంభము లు నిర్మించబడివున్నవి. శ్రీరాముడు వేద వేదాంగములను క్షుణంగా ఎరిగినవాడని వాల్మీకితో నారదుడే స్వయంగా చెప్పారు. పైగా ధర్మస్వరూపుడు (రామో విగ్రహవాన్ ధర్మః అంటారు). భగవంతుడున్న చోట వేదమ్ములు, వేదాంగములు ఎప్పుడూ ఉండును అని శాస్త్ర ప్రమాణము. అందుకే ఉత్సవములప్పుడు మంగళ వాద్యములతో పాటు, దివ్య ప్రబంద ప్రవచనములు చదివే పండితులు ముందర, వేదపండితులు వెనుకగా వచ్చుచుందురు. ఇక చిన్న ప్రదక్షిణంలో మొత్తము 14 స్తంభములు మాత్రమే ఉన్నవి. దీని రహస్యమేమిటంటే రామాయణము 7 కాండలు కదా! 7 స్తంభాలకు మాత్రమే ప్రదక్షిణ చేస్తే, స్వామి ప్రదక్షిణ వీలు కాదు కనుక మరొక 7 స్తంభాలను అదే మాదిరి నిర్మించి, రామాయణ కాండ ప్రదక్షిణంగా తలపింపజేసారు. శ్రీ సీతారామ వనవాసం పదునాల్గు ఏండ్లు అని కూడ గుర్తు చేయడం. అంతేకాక శ్రీరాముడు, శ్రీకృష్ణుడు ఇత్యాది అవతారాలలో స్వామి అవతరించినప్పుడు. భగవదైశ్వర్యములతో జన్మించినారు. ఇవి ఆరుగా చెప్పబడినవి. (షడ్గుణైశ్వర్యములు - ఐశ్వర్యము (లేదా) శ్రీ. ధైర్యము. కీర్తి, తేజస్సు, జ్ఞానము, వైరాగ్యము). చిన్న ప్రదక్షిణ మార్గంలొని ఉత్తర

దక్షిణ దిక్కులలో ఉన్న ఆరు స్తంభములు భగవంతుని ఐశ్వర్యరూపములుగా కూడా ఊహించవచ్చు. ఇరు ప్రక్కల ఈ ఐశ్వర్య నిలయముతో ఉన్న భగవంతుని ప్రదక్షిణ ఇది అనే ఉద్దేశ్యం కూడా ఇక్కడ అగుపిస్తుంది.

జన్మించినప్పుడు శ్రీ కృష్ణావతారము నందు స్వామి చతుర్భుజుడై, దేవదేవుడు తానేనని స్పష్టపరిచారు. అంటే పూర్ణపురుషుడై "షోడశకళల" (16 కళలు)తో జన్మించెను. కానీ శ్రీరామ జన్మమప్పుడు రాములవారు 14 కళలతో జన్మించినారట! మిగతా రెండు కళలు పరశురాముని వద్ద వుండినవనీ, ఆ తరువాత విష్ణు ధనస్సు ధరించి ఆయనకు గర్వభంగము చేసినప్పుడు మిగిలిన రెండు కళలను సొంతం చేసికొన్నారని చెపుతారు. ప్రదక్షిణలో ఉన్న ఈ 14 స్తంభాలు రాములవారి 14 కళలే అనుకోవచ్చు. మన శాస్త్రాలు 14 లోకాలు (భువన భాండములు) కలవని అంటారు. ఇది కూడా ఉండవచ్చు. ప్రదక్షిణ పూర్తి చేసేప్పుడు జయవిజయులు ముందునున్న రెండు స్తంభాలకు కలిపి ప్రదక్షిణ చేస్తే 16 స్తంభాలు అవుతాయి. అందుకే స్వామిని "షోడశ కళానిధి" గా కొలచి షోడశోపచారములు చేయాలంటుంది శాస్త్రం.

ఇక మండపంలో ఉన్న మొత్తం 18 స్తంభాల విషయం చెప్పనవసరం లేదు. భారతము 18 పర్వములు, భాగవతము 18స్కందములు, పురాణములు18, ఉపపురాణములు 18, భగవద్గీత 18 అధ్యాయాలు. అంటే భగవంతుడైన శ్రీరాముని కొలువులో వేద, వేదాంగ పురాణేతిహాస శాస్త్రములు సంఖ్యా ప్రమాణ రూపములో ఎలా కొలువై ఉన్నాయో బాగా ఆలోచిస్తేనే తెలుస్తుంది. ఈ అమరికను ఈ చిత్ర పటంలో తెలియజేస్తున్నాను.

మన పూర్వులు ఎంతో గొప్పగా ఆలోచించి నిర్మాణం చేస్తే తప్ప ఇలాంటి అమరిక రాదనీ, దీని నిర్మాణమప్పుడు ఎంతో కృషి సలిపి ఉంటారని గమనించాలి. వారికి మనం ఎల్లప్పుడూ ఋణపడి ఉంటాం!

ఇక స్వామి వారి గర్భ గుడి లోని శయన మందిరం ద్వారం నుంచి

స్వామి దర్శనమునకు వెళ్దాం. ఆహా! ఏమి ఈ ద్వారము. లోనికి వెళ్ళుటకు మనము అయిదు మెట్లను ఎక్కి వెళ్ళాలి. ఎందుచేతంటే స్వామి మిగతా ప్రదేశం కంటె పై భాగాన వెలసివున్నారు (మొదటి మెట్టు ప్రక్కల నుంచి చూస్తే అగుపడుతుంది). ఈ ద్వారము నిజంగా వైకుంఠ ద్వారము వలె వెలుగుతూ సువర్ణ భరితమై "శ్రీరామ, శ్రీరామ, శ్రీరామ" అని వ్రాయబడి ఎంతో రమణీయంగా, అత్యంత ప్రశాంత సౌందర్య సొగసులను కలిగి ఉంది. ఈ ద్వారం మనపంచేంద్రియాలను, అదుపులో ఉంచుకొంటూ స్వామి దర్శనం చేసుకొనండని చెప్తూన్నట్లుగా అయిదు మెట్లు నెక్కి లోనికి వెళ్ళేట్లుగా నిర్మించబడి ఉంది. స్వామి వారిని ఇక్కడ నుంచి దర్శిస్తూ పోదాం. ఇప్పుడు శ్రీ సీతారామ లక్ష్మణుల దర్శనమౌతోంది.

ఈ ద్వారపు గడపపై ఒక ప్రక్క గరుత్మంతుడు మరొక ప్రక్క శ్రీ అంజనేయస్వామి ఉన్నారు. గడపకు నమస్కరించి, దాటి స్వామి వారి దర్శనానికి లోనికి వెళ్ళదాం "జై శ్రీరామ!"

"శ్రీ రామ రామ రామేతి రమేరామే మనోరమే
సహస్రనామ తత్తుల్యం రామనామ వరాననే"



# గర్భగుడి, శయన మందిరం

శయన మందిరం నుంచి, స్వామిని అతి చేరువ నుంచి చూస్తున్నాం, ఇప్పుడు ఆలయంలో మూడు మూర్తులను చూడగలుగుతున్నాం. శ్రీ కోదండరామస్వామి వారు, దక్షిణ భాగంలో శ్రీ సీతామహాలక్ష్మీ వారు, వామ భాగంలో శ్రీ లక్ష్మణస్వామి వారు ఉన్నారు. స్వామి వారిని పూర్తిగా అలంకరణలో ఉన్నప్పుడు చూస్తున్నాం. ఈ చుట్టుప్రక్కల ఉన్న రామాలయాల్లో ఇంతటి అద్భుతమైన, పెద్ద శ్రీసీతారామలక్ష్మణుల విగ్రహాలు లేవనేది సత్యము. స్వామి వారు నేరుగా చూస్తున్నట్లు ఉండి, చిద్విలాసంగా నవ్వుతున్నట్లున్నారు. ఎడమ చేతిని భుజానికి సమాంతరంగా ఉంచి మోచేతి వద్ద వంచి, ధనస్సును (కోదండమును) పట్టుకొన్నట్లున్నది. కుడి చేతిని మాములుగానే నడుముకు కొంత ఎడమగా ఉంచి అర్ధ చంద్రాకృతిలో నున్న బాణమును అర్ధ చంద్రాకృతి పైవైపుకు ఉండేల ధరించి, ఎడమ కాలును కొంచెం కుడి కాలు కంటే ముందుకు వుంచి కొంత వంచివున్నట్లు నిలబడిన భంగిమలో ఉన్నారు. సామాన్యంగా శ్రీరామ భంగిమను "త్రిభంగి మధురాకృతి" అంటారు. అంటే భుజము, నడుము, మోకాళ్ళ అనే మూడు భాగములు సొంపుగా కొంత వంగినట్లు నిలబడి ఉండే భంగిమ. ఇక్కడ స్వామి వారు పద్మంలో నిలబడి స్థానక భంగిమలో ఉన్నారు. ముగ్గురు మూలవర్లకి బంగారు తొడుగులు ఉన్నాయి. ఆశ్చర్యమేమంటే స్వామివారి కోదండంలో ఏడు గంటలున్నాయి. ఇవి ఏడుకొండలకు చిహ్నామై, శ్రీ వేంకటేశ్వరస్వామి శ్రీరామావతారంలో తాను ఎలా ఉండేవాడినో భక్తులకు చూపేందుకే ఇలా అవతరించిన స్వయంభువేమో అనిపిస్తుంది. స్వామివారు చాలా గంభీరంగా, ఎంతో అందంగా ఉన్నారు. ఈ అలంకరణలో స్వామిని చూస్తే శ్రీ వేంకటేశ్వరస్వామిని చూచిన అనుభూతి కలుగుతుందనటంలో అతిశయోక్తి లేదు. ఆ పాదమస్తకం స్వామివారు అలానే ఉన్నారు. ఎందరో భక్తులు స్వామి వారి ఎదుటనే "ఈయన శ్రీ వేంకటేశ్వరస్వామి" అని పెద్దగానే అనటం ఎన్నో సార్లు వినివున్నాను. ముఖ్యంగా పచ్చ కర్పూర


సింహ వాహనం


గరుడ వాహనం


హనుమద్వాహనం


రథోత్సవం

నామం, వజ్రకిరీటం, నగలు, ఇత్యాది అంలకరణలు అన్ని ఎంతో ప్రభావితం చేస్తున్నాయి. స్వామి వారి బంగారు కిరీటం ఆకృతి కూడా శ్రీ వేంకటేశ్వర స్వామి కిరీటం వలనే ఉన్నది. ఇరు ప్రక్కల శ్రీసీతాలక్ష్మణుల విగ్రహాలు ఒకింత స్వామి వైపు తిరిగియు, మూడు విగ్రహములు ఒకే వరుసలో ఉన్నట్లు అనిపిస్తాయి. అమ్మవారు పద్మమును ఎడమ చేతిలో ధరించి కుడి చేతిని వయ్యారంగా నడుముకు సమాంతరంగా ఉంచి స్థానక భంగిమలో స్వామి వారికి దక్షిణ భాగంలో స్థానక భంగిమలో ఉన్నారు. అమ్మవారి కళ్యాణ తిలకం, ముక్కు పుడకలు జగజ్జేయమానంగా రత్నములతో మెరియుచున్నది. ఈ అలంకరణలో శ్రీ మహాలక్ష్మి కళతో మిగుల మనోహరంగా సాక్ష్యాత్కరిస్తున్నారు. శ్రీ లక్ష్మణస్వామివారు స్వామివారికి వామ భాగంలో ధనుర్ధారియై ముఖ కవలికలలో కొంత వరకు స్వామి వలె ఉండి స్వామి భుజములకు ఒకింత దాటి కొంత స్వామి వైపు తిరిగినట్లున్నా నేరుగానే చూస్తున్నట్లున్నారు. లక్ష్మణ స్వామి ధనస్సులో కూడా ఏడు గంటలు ఉన్నవి. అభరణములు లేకుండా, మూల విగ్రహాలని చూచే అవకాశం కేవలం, శనివారం అభిషేకం జరిపేరోజున మాత్రమే లభ్యమవుతుంది. ఈ మూడు కూడా పూర్తిగా సాలగ్రామ శిల్పాలేమో అనిపిస్తున్నాయి. ఆభరణాలలో, పెద్దగా కనిపించే స్వామి, అభిషేక సమయంలో నిజమూర్తిని చూస్తే కొంత చిన్నదిగా, ఇంకా ఎన్నో విశేషాలతో కనిపిస్తారు.

స్వామి వారు కొలతలు ఇంచుమించు శ్రీ వేంకటేశ్వరస్వామి వలనే ఉండటం మరో విశేషం! అందుకే శ్రీ వేంకటేశ్వర స్వామికి తయారు చేయించిన వజ్ర కిరీటం, నకలు శ్రీ కోదండరామస్వామి వారికి మాత్రమే సరిపోయిందట. ఇది ఇక్కడి అర్చకులు చెప్తున్నారు. ఇప్పటికీ ఈ వజ్ర కిరీటమును విశేషమైన రోజుల్లో శ్రీ కోదండరామస్వామి వారికి అలంకరిస్తున్నారు. ఇంకా ఇతరత్రా ఆభరణాలు కూడా శ్రీ స్వామివారి వద్ద నుంచి, శ్రీ కోదండరామస్వామి అందుతూండటం కూడా మరో విశేషం. స్వామి వారు కోదండం బదులు కటి వరద హస్తాలతో,

చతుర్భుజుడై సాక్షాత్కరిస్తే సరిగ్గా వేంకటేశ్వరస్వామి వలనే ఉంటారని చాలామంది అభిప్రాయము. అభిషేక సమయాలలో అలంకరణ లేకుండా స్వామిని చూస్తే ఈ దిగువ వర్ణించిన విధంగా ఉంటారు.

ఆహా! ఏమి ఈ స్వామి సౌందర్యము. మూల విగ్రహంలో స్వామి వారు నేరుగా చూస్తూ చిరునవ్వుతో, రాజసంగా ఉన్నట్లుగా ఉంది. స్వామి వారు కిరీటధారియై ఉన్నారు. కిరీటము శ్రీ వేంకటేశ్వర స్వామి కిరీటము వలనే ఉంది. విగ్రహము కొలతలు కూడా సుమారుగా అంతే ఉండొచ్చు. పద్మముల వంటి నేత్రములు, నున్నటి చెక్కిళ్ళు, చిరు మందహాసముతో పెదవులు, సుందరముగా కనిపించే చుబుకము, విశాలమైన నొసలు, సొంపైన నాసిక కలిగి చంద్రబింబము వంటి మోముతో కోటి సూర్య తేజస్సుతో ఇతడొక్కడే ప్రియదర్శనుడనట్లుగా ఉంది ఈమూర్తి. స్వామి వారి కర్ణాభరణములు, శంఖంలాంటి మెడ, భుజముల పైవరకూ కేశములు, ఈ అభిషేక దర్శనములో చూడవచ్చు. స్వామివారికి కేశములు వెనక రాజముడి కలదని అర్చకులు చెపుతుంటారు. వామహస్తము భుజానికి సమాంతరంగా ఉంచుకొని ధనస్సును పట్టుకొన్నట్లున్నది. కాని ధనస్సు భుజము వరకు మాత్రమే చెక్కబడి ఉంది. కుడి చేతిని క్రిందనే వదలి కొంత ప్రక్కకు త్రిప్పి బాణాన్ని ధరించినట్లుగా ఉంది, కాని చేతిలో బాణము లేదు. చూపుడు, మధ్య చేతివేళ్ళు మాత్రం కొంత వంచి బాణమును పట్టుకొనట్టి భంగిమలో కనబడుతుంది. దీనిని "జ్ఞాన ముద్ర" అని అంటారు. "మరి కోదండరాముడన్న తర్వాత కోదండము ఎందువలన లేదు?" మన పూర్వులు ఇలా ప్రతిష్ఠించటంలో ఏదో అర్థము ఉండి ఉండవలె. ఈ విషయం గురించి యోచిస్తే నాకెందుకో కీ॥శే॥ కవిసామ్రాట్ విశ్వనాథవారు తన "నారాముఁడు" అన్న గ్రంథములో "కోదండరాముని" గూర్చి వివరించిన క్రమం స్ఫురణకు వస్తూంది. వారు ఈ విధంగా వర్ణించిరి.

"కోదండ శబ్దము సంస్కృతము కదా! వానికి వ్యుత్పత్తి ఏమనగా దేని చేత క్రీడింపబడుచున్నదో అది కోదండమని విలు విద్య నేర్చిన

వారందరి పేర్లకు వెనుక కోదండము చేర్చుటలేదు. శ్రీరాముని మాత్రమే కోదండరాముడందుము. అర్జునుని కోదండర్జునుడనలేదు. శ్రీరామ చంద్రునికి తప్ప సృష్టిలో తక్కిన వారందరికి కోదండమొక ఆయుధము. దాని కల్లెత్రాడు, దానిని బిగించుట, బాణము సంధించుట, బాణము వదులుట మొదలుగా ఆ ఆయుధము నుపయోగింతురు. రాముడట్లే చేయును. కాని, చేయుచున్నట్లెవరికి తెలియదు. కాని, తరువాత యిరువది యెనిమిదవ మహాయుగములో ద్వాపరమున పుట్టిన అర్జుననకు కూడా ఇందులో కొంత శక్తి కలదు. ఈ మన్వంతరవములో ఇరువది నాల్గవ మహాయుగమున త్రేతాయుగమున జన్మించిన శ్రీరామునకు మాత్రమే కోదండరాముడన్న పేరు కలదు. ---- శ్రీరాముడు తన కోదండముతో నిది చేయగలడిగిచేయలేడని లేదు. ప్రదరము అనగా "బాణమునులస్తకము వింటి మధ్య భాగము, ఎడమ చేతి పిడికిలితో పట్టుకొనిడి చోటు" ధనస్సు వంచి త్రాడు వదలిపెట్టుగా నల్లెత్రాటి వేగము చేత బాణము పోవును. ఈ రామునకు లస్తకముతో పనిలేదు. చాపాంతము చాపాది ధనస్సు చివర మొదలు ధనస్సులోనే భాగమైననూ సరే ఆయనకు లస్తకము. ఆయన బాణప్రయోగాబ్ధి. బాణ ప్రయోగము నందు సముద్రము వంటివాడు. ఆ బాణము ఎట్లువేయునో తెలియదు. ఇతరులకు వలె సామాన్య లక్ష్యము కాదు. ---- రాముడు వింటిని తానెట్లు పట్టిన అట్లేవంచును. అదియెట్లున్నను సరే బాణము పోవుచునే యున్నది. ఆ విల్లు ముఖ్యమా? తాను ముఖ్యమా? తానే ముఖ్యము. ఆ ధనస్సు వట్టి నిమిత్త మాత్రము. మఱి విల్లెందుకు? రాముడు విల్కాడని చెప్పుకొనుటకు కాకాసురుని మీద గడ్డిపోచ నభి మంత్రించి వేసెను. దీనిని బట్టియే విల్లాడుకొనువస్తువని తేలిపోవు చున్నది. కోదండము యొక్క వ్యుత్పత్త్యర్థము సరిపోయినది. రావణాదులను ఇట్లే చంపవచ్చును. మహాస్త్రములకు విల్లక్కర్లేదు కాబోలు! మరి విల్లెందుకు? తాను కోదండరాముడగుటకు. ఆ విల్లు భుజా, కుండవలయును. ధానితో సహా స్వామిని ధ్యానించవలయును."

ఇక చేతిలో బాణములు చెక్కబడలేదు. "బాణమునకు నజిహ్మగము" అని పేరు. జిహ్మ-వక్రమైనది. అజిహ్మము - సూటియైనది. మరొక ఉదాహరణముగా ఏడు తాటి చెట్లు ఒకే వరుసలోలేకుండా, గుంపులుగా ఒకేచోట దగ్గరదగ్గరగాకాక, అక్కడక్కడ వంకరలలో దూరదూరముగా వున్నప్పుడు ఒకే బాణముతో కూల్చుట అసాధ్యము, (ఊహకందనివిషయము), ఎందుచేతనంటే బాణము మలుపు తిరుగ వలెనని ఎఱుగవలెను. సుగ్రీవునకు తనపై బాణప్రయోగములో నమ్మిక ఏర్పడుటకు రాములవారు ఈ సప్తతాళ దళనమును చేసిరి. అందువలననే ఈ అంశమును శ్రీరాముని ధనుర్విద్యకుదాహరణముగా చెప్పుదురు. "అంటే ఆయన బాణములకు బాణముల లక్షణము లేదు. వీటి త్రోవలన్నియు శ్రీరాముని మీదుగానున్నది. ఆ వ్యవహారము బాణముల మీదలేదు. స్వామి మీదయున్నది. ఆయన బాణములు పోయెడి తీరులోని విలక్షణత్వము చెప్పినగాని ఆయన కోదండరాముడన్న మాటలోని అర్థము తెలియదు. ఆ కోదండమాట వస్తువు. అంటే విల్లు లేదు, --- బాణము వేయుట లేదు ---- లోకములోని ధనస్సులకు లోకములోని బాణములకు శ్రీరామచంద్రుని ధనుర్బాణములకు సంబంధములేదు. కోదండరాముడుపాసనా మూర్తి. కోదండరాముడనగా నిధి."

ఇలా సాగిన విశ్వనాధవారి "నారాముడు" లోని కోదండరాముని వర్ణన ఈ స్వామి భంగిమకి సరిపోతూంది. కనుకనే మన పూర్వులు భుజము వరకు మాత్రమే ధనస్సును కన్పించేటట్లు చేసారేమో! చాలా పంచలోహ విగ్రహాలలో, చిత్రాలలో శ్రీ కోదండరాములవారిని ధనస్సు, కోదండము లేకుండా భంగిమతో చిత్రించడం చాలా మంది చూసే వుంటారు. అయితే ఈ ఆలయంలో వున్న శ్రీ కోదండరాముల వారి భంగిమ ఒక ప్రత్యేకతను, విభిన్నతను సంతరించుకొని వున్నదని గమనించగలరు! తిరుమల శ్రీవారి ఆలయములోని వైకుంఠప్రదక్షిణ ద్వారములో బయటకు వచ్చే మార్గములో (హుండివద్ద) పై భాగములో దశావతారములు చెక్కబడి వున్నవి. అందులోని శ్రీరాముని శిల్పం ఈ

ఆలయములోని స్వామి భంగిమ వలె ఉన్నది. అలాగే, ఈ ఆలయము లోని చిన్న ప్రదక్షిణం చేసి బయటకు వచ్చే మార్గములో ఆగ్నేయ మూలన వున్న స్తంభముపై చెక్కబడి వున్న శ్రీరాములవారి శిల్పం, తిరుమల శ్రీవారి ఆలయములోని శ్రీరాఘులవారి ఉత్సవమూర్తుల భంగిమలో దర్శన మివ్వటం విశేషమే! స్వామి ధరించిన దోవతిని నడుము నుంచి మోకాళ్ళ వరకు పార్శ్వములనందు బహు సుందరాకృతిలో వుండుట దర్శంచవచ్చు. దీనిని శిల్ప శాస్త్రంలో "మేఖల బంధం" అంటారు. స్వామి వారికి కంఠంలో హారములు, యజ్ఞోపవీతము; కటిబంధములు, భుజకీర్తులు, ముంజేతి కంకణములు స్పష్టంగా కనిపిస్తున్నాయి. ఆశ్చర్యం! శ్రీ స్వామి వారి వక్షః స్థలంలో శ్రీమహాలక్ష్మీదేవిముద్ర (ఇలా "▼") దర్శనమిస్తుంది. ఆహా! సందేహం లేదు! శ్రీనివాసుడే ఇలా కోదండ రామునిలా అవతరించి మనల్ని తరింపజేస్తున్నారు. అభిషేక సమయంలో ఇక్కడ "శ్రీ లక్ష్మీముద్ర" ఉన్న భాగంలో గంధాన్ని, చందనాల్ని అద్దుతారు. కానీ తిరుమలలో వలె వీటిని అచ్చులుగా ఇవ్వరు. అందరికీ అభిషేకానంతరం పసుపు, గంధం చందనాల్ని పంచేస్తారు. స్వామివారు విశాలమైన, ఉన్నతమైన వక్షఃస్థలముతో అత్యంత సన్నని నడము కలిగి వున్నారు. ఎడమకాలు క్రొద్దిగా ముందుకు వుంచి, వంచినట్లనిపిస్తున్న భంగిమలో ఉన్నారు. కుడి కాలు ఒకింత వెనుకగా నేరుగానే వుంచుకొని హొయలుగా స్థానక భంగిమలో ఉన్నారు. బహుశా! అస్త్రసంధానం చేస్తున్న భంగిమ అనిపిస్తుంది. అయినా ప్రశాంత వదనంతో చిరునవ్వుతో కరుణరసాన్ని ప్రదర్శిస్తూ సాక్షాత్కరి స్తున్నారు. కటిభాగము, మోకాళ్ళు, పాదాలు ప్రస్ఫుటంగా దర్శనమిస్తు న్నాయి. పద్మంలో నిలబడి, పాదచారి వలె ఉన్నారు. పాదములోని వేళ్ళను కూడా దర్శించవచ్చు. హృదయంలో లక్ష్మీదేవిని ముద్ర కలిగిన ఈ స్వామి అందం వర్ణించతరం కాదు. శ్రీ వేంకటేశ్వరస్వామి స్థానక భంగిమను మెట్టమొదటిసారిగా త్రిభంగి అని చాలా మంది తలచారు. కాని ఆయన మోకాళ్ళ వద్ద, నడుమువద్ద మాత్రమే వంచి నిలబడివున్నట్లు తర్వాత తెలుసుకొన్నారు. ఈ

కోదండరాములవారు కూడా నడుము వద్ద, వామ భాగంలో మోకాలు వద్ద మాత్రమే వంచినట్లు అనిపిస్తుంది. కాని ఇది శ్రీ రాములవారి విగ్రహం కనుక "త్రిభంగి మధురాకృతి" అని ఇక్కడి అర్చకులు అంటారు. ఇది జగదేక సుందరరూపం. జగదానంద కారకుడీయన. శ్రీ వేంకటేశ్వరస్వామి వారికి తిరుపతి శ్రీ కోదండరామ స్వామి వారికి, గోవిందరాజస్వామి ఆలయంలోని శ్రీ పార్థసారధిస్వామి వారికి విగ్రహాల ముఖకవళికలొకటి గానే ఉన్నాయనిపిస్తుంది. ముఖ్యంగా శ్రీ కోదండరామ స్వామి పూర్తి విగ్రహం అలానే అనిపిస్తుంది. కాకుంటే స్వామి ద్విభుజుడు. కేవలము దోవతి మాత్రము ధరించి ఉన్నారు. ఈ స్వామిని చూస్తున్న కొలది ఆమోహన రూపాన్ని ఇంకా చూడాలి అని తన్మయత్వంలో మునిగి పోక తప్పరు భక్తులు. "అబ్బ! ఎంత అందంగా ఉన్నారో ఈ స్వామి!" అని అందరూ అంటూంటారు. విష్ణు ప్రతిమల్లో శ్రీ వేంకటేశ్వరస్వామిని పోలిన ప్రతిమ ఇది అనచ్చు అందుకే ఇంత సోయగం, సొంపుగలిగి ధనుర్బాణములను ధరించి ఉన్నా ముద్దునగవులొలికే మోముతో, స్వామి ఏ ఒక్కరి వంకా దృష్టి నిలుపక, సమదృష్టి కలిగి భక్తులకు దివ్యానుభూతిని కలిగిస్తూంటున్నట్లుంది. విశాలమైన వక్ష స్థలము, సన్నటి నడుము కలిగిన స్వామి తన కరుణా దృష్టితో భక్తుల కోరికలను తీర్చు తానన్నట్లుంటున్నారు. అందుకే నేమో! స్వామి చెంత చేరి, భక్తితో ప్రణమిల్లి కోరితే, కోరికలు ఇట్టే తీరుస్తాడు. అందుకే ఈయన్ను వేంకటాద్రి రాముడంటాను. స్థానికులు కొందరు ఈయనను వరప్రసాది అని అంటారు. ఇక్కడి శ్రీ రాములవారి సుందర స్వరూపం చూస్తే, భక్తులైన నారదులవారు, ఆంజనేయులవారు, వాల్మీకి రామాయణంలో శ్రీరాముని అందచందాల్ని వర్ణించిన విధానాన్ని గుర్తు తెస్తోంది. ఈ విషయాన్ని ఇక్కడ కొంత గుర్తు తెచ్చుకొందాం.

స్వామి భక్తుడైన హనుమంతులవారు 'సుందరకాండ'లో సీతమ్మవారి కోరిక మేరకు శ్రీరాములవారి అందచందాల్ని ఇలా వర్ణించారు. అసలు 'సుందరకాండ' పేరులోనే మహర్షి వాల్మీకి అంతరార్థము నుంచారు.

హనుమంతులవారికి మంత్రశాస్త్ర పరంగా "సుందరుడు" అని పేరు. ఈ సుందరకాండలో లంక సుందరంగా వర్ణించబడింది: మండోదరి సౌందర్యము. పుష్పక విమాన వర్ణనము చేయబడినది (సౌందర్య పరంగా). ముఖ్యముగా సాముద్రిక శాస్త్ర పరంగా శ్రీరామ సౌందర్యమునే కాక ఆయన గుణ గణములు కూడా వర్ణించబడినది.ఆ వర్ణన ఇలాసాగింది. "శ్రీరాముడు కమలదళములవంటి కన్నులు కలవాడు, ప్రాణులందరికీ చూచినంతనే మనోహరమైన రూపంగా కనిపించువాడు. రూపంలోనే కాక స్వభావంలో కూడా దాక్షిణ్యం కలవాడు. శత్రువులను తపింపచేయువాడూ, విశాలమైన మూపులతో, మహా బాహువులు కలిగి శంఖాకృతి వంటి కంఠంముతో, సుందర వదనం కలవాడు; నున్నటి భుజములతో (సంధులవద్ద ఎముకలు కనపడనవి వాడు) సమ బాహు దేహుడై, శ్యామ వర్ణంతో, బొమ్మ, మణికట్టు, పిడికిలి స్థిరముగా ఉన్నవాడూ; కనుబొమ్మల, భుజాలు, ముష్కాలు పొడవుగా గలవాడు; తలవెంట్రుకలకొనలు (కేశవనామధేయుడు), ముష్కములు, మోకాళ్ళు హెచ్చుతగ్గులు లేక సమముగా ఉండి, బొడ్డు లోపలి ప్రదేశం, ఉదరం, బొమ్మ ఉన్నతములుగా కలవాడు: నేత్రములు, గోళ్ళు, కాలు చేతులందు ఎఱ్ఱని రేఖలు కలవాడు. పాదరేఖలు, తలవెంట్రుకలు నున్నగా వున్నవాడు; గంభీరమైన గమనము, కంఠస్వరములతో, ఉదర మందు, కంఠమందు, పాదములందు (నిమ్న రేఖ) 3 రేఖలు కలవాడు. శిరస్సు నందు మూడు సుడులు కలిగి నాలుగు కళలు కలవాడు. లలాటం, పాణి, పాదములలో నాలుగురేఖలు కలిగి, 8 అడుగుల పొడవుగలగి, బాహువులూ, మెకాళ్ళు, తొడలు, చెక్కిళ్ళు సమముగా నున్నవాడు. 14 జంట అవయవములు సమముగా కలిగి చక్కదైన పలువరుసతో సింహ, శార్దూల, గజవృషభముల నడకను పోలిన నడకగలవాడు: వాక్కు, ముఖం, నఖములు, చర్మం, రోమములు నున్నదనం కలవాడు. ఎనిమిది నిడుపైన అవయవములూ, పద్మాకారం కలిగిన పది అవయవములు, శిరస్సు,

లలాటము. కర్ణము. వక్షస్థలము విశాలముగా నున్నవాడు. తేజస్సు, యశస్సు సంపద అనే మూడింటి చేత వ్యాపించి. ఎగుభుజాలు, నొసట, పావట మొదలైన ఆరు అవయువాలలో ఎత్తు గలగినవాడు. తలవెంట్రుకలు, గోళ్ళు బుద్ధి, ఇతరత్రా అవయవ భాగములు కొనతేలి వున్నవాడు. అట్టి శ్రీరాముడు సర్వజీవులకు సమ్మోహనం కలిగించేవాడు". అని (ఆధారం: నీలకంఠాచార్యుల భాష్యం - ఋషిపీఠం నుంచి) సాముద్రిక శాస్త్ర పరంగా శ్రీరాముని రూప, గుణ, సౌందర్యాన్ని వర్ణించారు ఆంజనేయులవారు.

నారదుల వారు శ్రీరామ సౌందర్యాన్ని "ఏక ప్రియదర్శనుడని" పొగడినారు. శ్రీరామ రూప సౌందర్యాన్ని హనుమంతులవారు, తన వర్ణణనతో శోకసాగరములో వున్న సీతమ్మవారి ముందుంచి ఆ తల్లిని ఆనందపరచిన రీతిలో, ఈ దేవతా శిల్పి శ్రీకోదండరాముని మనముందుంచి మన దుఃఖములను పోగొట్టి భక్తి ఆనందపారవశ్యముతో మనల్ని ముంచెత్తి మనల్ని ధన్యులను చేసాడు. వీరికి మనం ఎంతో కృతజ్ఞతతో ఋణపడి ఉన్నాము. రాముని నుండి మనస్సును, కళ్ళను మరల్చటం సాధ్యంకాదట! అందుకేనేమో ఈ స్వామిని పదే పదే చూడాలనిపిస్తుంది. శ్రీరామ దర్శనముతో మన జన్మ సార్థకమౌతుంది.

అన్నమయ్య, త్యాగయ్య ఈ కోదండరామున్ని దర్శించి, కీర్తనలు వ్రాసి వుంటారు. ముఖ్యంగా అన్నమయ్య వ్రాసిన "రసికుడవురా! తిరుపతి రఘువీరా!" ఖచ్చితంగా ఈ స్వామిని దర్శించి ఆలాపించినదేనని పలువురి అభిప్రాయము. ఇలాగనే "దేవదేవం భజే దివ్యప్రభావం---" అన్న కీర్తన కూడా ఇక్కడిదే ఉండవచ్చు.

భద్రాచలంలో రాములవారు చతుర్భుజులై ఆసన భంగిమలో నున్నారు. తిరుమల స్వామివారు చతుర్భుజులై స్థానక భంగిమలో నున్నారు. ఇక్కడ స్వామివారు ద్విభుజుడై వెలసి ఉన్నారు. రామావతార విశిష్టత ఎంతటి దంటే తిరుమల శ్రీ వేంకటేశ్వర స్వామివారి మూలవర్లకు ఇప్పటికీ ధనుర్బాలను ధరించిన చిహ్నాలు. చారలుగా భుజములపై

ఉన్నాయట! స్వామి వారి ప్రక్కన వున్న అమ్మవారిని దర్శిద్దాం.

ఈ స్వామికి ప్రక్కనే దక్షిణ భాగాన శ్రీ సీతామహలక్ష్మి కొలువై ఉన్నారు. అమ్మవారి విగ్రహం పూర్తిగా స్వామి వలె పడమర ప్రక్కకు నేరుగా కాక క్రొద్దిగా స్వామి వైపునకు ప్రక్కగా ఉన్నట్లు అమర్చినారు. అమ్మవారు పద్మంలో నిలబడి ఉన్నారు. విగ్రహం స్వామి భుజముల వరకు ఉండి కిరీటధారియై ఉంది. కిరీటం స్వామి కిరీటం ఆకృతి వలె కాక వేరు ఆకృతిలో ఉన్నది. అమ్మ వారిలో లక్ష్మీకళ ఉట్టి పడుతూంది. ఎడమ చేతిలో పద్మం ధరించి, మోచేతి వరకు పైకెత్తి, కుడి చేతిని విలాసంగా నడుముకు సమాంతరంగా దిగువకు వదలి ఒయ్యారంగా నిలుచుకొన్న భంగిమలో ఉంది ఈ మూర్తి రూపం. దృష్టి నేరుగా చిరునవ్వుతో చూస్తున్నట్లుంది. రవ్వల కళ్యాణ తిలకము, ముక్కు పుడకలు ధరించి, అత్యంత మనోహరంగా, శ్రీ మహాలక్ష్మిని నిజంగా చూచిన అనుభవం కలుగుతుంది, ఈ తల్లిని చూస్తే! శనివారం స్వామితో పాటు అమ్మవారికి కూడా అభిషేకం చేస్తారు. అప్పుడు పసుపుతోనే మూర్తిని అద్దుతారు. శ్రావణ శుక్రవారాల్లో అమ్మవారికి ప్రత్యేక అలంకరణలు చేస్తారు. అప్పుడు అత్యంత ఆకర్షణీయంగా ఉంటుంది. లోకాలనుగాచే ఈ తల్లి చల్లని చూపుతో మనల్ని ఆశీర్వదిస్తూన్నట్లుటుంది.

"నమామి ధర్మ నిలయాం కరుణాం లోకమాతరమ్,
పద్మప్రియాం పద్మహస్తాం పద్మాక్షీం పద్మసున్దరీమ్.
పద్మద్భవాం పద్మముఖీం పద్మనాభప్రియాం రమామ్,
పద్మమాలాధరం దేవీం పద్మినీం పద్మగన్ధినిమ్.
లక్ష్మీం క్షీరసముద్రారాజ తనయాం శ్రీరఙ్గధామేశ్వరీం
దాసీభూత సమస్తదేవవనితాం లోకైక దీపాఙ్కురామ్,
శ్రీమన్మన్దకటాక్షలబ్ధవిభవ బ్రహ్మేన్ద్రగంగాధరామ్
త్వాం త్రైలోక్యకుటుమ్బినీం సరసిజాం వన్దే ముకున్దప్రియామ్॥"

అనే స్తోత్రముతో అమ్మను స్తుతించి ఇంకా విశేషాలు ఏమున్నాయో చూద్దాం!. మరయితే వామ భాగంలో ఉండాల్సిన సీతాదేవి దక్షిణ భాగంలో

ఎందుకుంది? ఇదీ విశేషమే. అయితే వాయల్పాడులోని పట్టాభి రామాలయంలో కూడా అలానే ఉంది. అది కూడా జాంబవంతుడి ప్రతిష్ట అనీ, కుడి వైపు అమ్మవారు ఉన్నట్లు కొలిస్తే మోక్ష ప్రాప్తి కలుగుతుంది. పూర్వీకుల నమ్మకమని, శ్రీ ఎం. సుదర్శన్, తిరుపతి వారు సప్తగిరి జూలై, 1997 సంచికలో వాయల్పాడులోని "పట్టాభి రామాలయం" గురించి వ్రాసేటప్పుడు తెలిపివున్నారు. వామ భాగంలో సీతమ్మ ఉన్నట్లు కొలిస్తే ఐశ్వర్య సిద్ధి, దక్షిణ భాగంలో ఉన్నట్లు కొలిస్తే మోక్ష ప్రాప్తి కలుగుతాయని శాస్త్రం.

అయితే, వైఖానస ఆగమ శాస్త్ర ప్రకారం అమ్మవారు స్వామికి దక్షిణ భాగంలో ఉండటం సంప్రదాయము. ఈ దిగువ వివరించిన శ్లోకం ఇందుకు నిదర్శనం.

శ్లో "సీతాయదక్షిణే పార్శ్వే లక్ష్మణస్యచ పార్శ్వతః।
తన్మద్యే రాఘవం వందే ధనుర్భాణాధరం హరిం॥"
విమానార్చనకల్పం - ప్రతిష్టానుక్రమణిక; వైఖానసాగమము.

తిరుమలలోని శ్రీవారి ఆలయం లోని ఉత్సవ మూర్తులుగా వున్న శ్రీ సీతారామ లక్ష్మణ విగ్రహాలు ఇదే క్రమంలో అమర్చబడి ఉన్నాయి.

వాల్మీకి రామాయణంలో యుద్ధకాండంలో బ్రహ్మదేవుడు, శ్రీరామునితో సీతమ్మ గురించి ఇలా పలికారు. "రామచంద్రా! ఈ సీత సాక్ష్యాత్తూ లక్ష్మీదేవియే. నారాయణుడవైన నీవు రావణసంహారార్థము మనుష్య రూపము ధరించితివి". అలాగే అగ్ని దేవుడు "ఓ రామా! ఈమె నీ వైదేహి. ఈమె ఎందెంత మాత్రము దోషము లేదు. పుణ్యశీలా! శీలవతి యగు ఈమె వాక్కుతో గానీ, మనస్సుతో గానీ, నేత్రములచే గానీ నిన్ను మీరి (నీ ఆజ్ఞమీరి) నడచినది కాదు".

ఈ ఆలయములో వున్న ఈ అమరికను ఇలా ఊహించవచ్చు. శ్రీనివాసుడు రామావతారంలో తన రూపాన్ని ప్రదర్శించినప్పుడు, శ్రీవారి వక్షస్థల భాగంలోని శ్రీలక్ష్మీదేవి తానే సీతామాతనని చేప్తూ అలానే వచ్చి ప్రక్కన నిలబడిందేమోననిపిస్తుంది. అలాగే నాగాభరణములు,

(ఆదిశేషుడైన) లక్ష్మణ స్వామి రూపంలో వామ భాగంలో వచ్చి నిలుచొని శ్రీ సీతారామలక్ష్మణులుగా ఇక్కడ దర్శనమిస్తున్నారనిపిస్తుంది.

శ్రీ సీతామాత అలా దక్షిణ భాగం వైపు ఉండటం వల్ల కూడా, కోదండం ధరించి ఉన్నా శ్రీస్వామివారు పరమ ప్రశాంతంగా, చిద్విలాసంగా, చిరునవ్వుతో ఉంటూ, పరిసరాల్ని కూడా ఎంతో ప్రశాంతంగా ఉండేలా చేసారేమోనని అంటారు కొందరు. శ్రీ రాముడు బాణం సంధిస్తే దేవతలే భయపడుతారు. అట్లాంటిది, అమ్మవారు దక్షిణ భాగంలో ఉండటం వల్ల పరమశాంత మూర్తి అయి, ప్రశాంతను ఏర్పరిచి ఉన్నారు.

ఇక వామ భాగంలోని శ్రీలక్ష్మణస్వామి విగ్రహం కూడా కొంత రాముల వారి ప్రక్కకు తిరిగినట్లుండి, స్వామి వారి భుజములను కొంత దాటి, భంగిమ స్వామిని పోలివుంది. అయినా, అన్న ఆజ్ఞ కోసం ఎదురు చూస్తున్నట్లున్న నేరుగా చూస్తున్నట్లుంటుంది. లక్ష్మణ స్వామి వారి కిరీటం కొంత సీతమ్మవారి కిరీటం వలనే ఉన్నది. స్వామి వారి విగ్రహం వలనే ఈయన కూడా ధనస్సును అదే భంగిమలో పట్టుకొనట్లుఉండి ధనస్సు భజమువరకు మాత్రమే చెక్కబడి, కుడి చేతిలో బాణము ధరించిన భంగిమలో వున్నది. కాని రాములవారి వలె కాళ్ళవద్ద, నడుము వద్ద ఒంపులు లేక నేరుగనే నిలుచున్న భంగిమలో వివిధ ఆభరణ భూషితుడై ముఖ కవళికలలో చాలా వరకు స్వామిని పోలి ఒకింత స్వామి వంక తిరిగి ఆయన ఆజ్ఞ కోసం ఎదురుచూస్తున్నట్లు, మిగుల వినయంతో దర్శనమిస్తున్నారు ఈ స్వామి. మరి లక్ష్మణ స్వామికి కూడా ధనస్సు, బాణములు చెక్కబడలేదే!---- అన్నను అనుసరించే సోదరుడుగా జగమెరిగిన ఈయనను, స్వామి చెంత ధనస్సును ధరించకుండా వినయంతో కన్పించేలా ఉండటం సబబని ఇలా చేసివుంటారనిపిస్తూంది. ఇక ఈయన గుణములను గురించి సీత మాత హనుమంతునితో వివరిస్తూ (సుందరకాండ)లో ``అంజనేయా! పెద్దలకు సేవచేయువాడు, సమర్థుడు, మితభాషి అయిన లక్ష్మణుడు ఎల్లరకూ ఇష్టుడే కాక, నాకంటెనూ కూడా శ్రీరామునికి అత్యంత ప్రీతిపాత్రుడు,`` అని అనడం

గమనార్హం. ఈయనకు అన్నగారి మీద వున్న ప్రేమ ఎంతటిదంటే, తానే కౌసల్యదేవితో స్వయంగా ఇలాఅన్నారు. (అయోధ్యకాండ) "అమ్మా! శ్రీరాముడు అగ్నిలోకానీ. అరణ్యంలోకానీ ప్రవేశింపనున్నచో అంతకు మునుపే నేనచ్చటికి ప్రవేశించుదును అని ఎరుగుము". అందుకే, ఈయన స్వామికి అంతటి ప్రీతిపాత్రుడైనాడు. అట్టి రామానుజునికి నమస్కరిస్తాం. శ్రీసీతారామ లక్ష్మణులకు బంగారు, వెండి, కవచముల ఆభరణములు ఉన్నవి. విశేష రోజులలో వెండి ఆభరణాలు అలంకరిస్తారు. అలంకరణ ఈ ఆలయ ప్రత్యేకత అని వేరే చెప్పనవ సరము లేదు. శనివారం నాడు స్వామితో బాటుగా శ్రీలక్ష్మణ స్వామి వారికి కూడా అభిషేకం జరుగుతుంది. ఒక్కసారి శ్రీ సీతారామలక్ష్మణలకు నమస్కరించి, ఇంకా గర్భ గుడిలో ఏమున్నాయో చూస్తాం.

తిరుమలలో "అర్చనానంతర దర్శనం"లో శయన మందిరం నుంచి, స్వామిని దర్శించేటట్లుగానే, ఇక్కడ కూడా శయన మందిరం నుంచి మూల విగ్రహమూర్తులను దర్శించుకొన్నాం. మూలవర్ల మధ్య శ్రీ సీతారాముల మధ్య శ్రీ భక్తాంజనేయస్వామి ఉత్సవ విగ్రహం ఉంది. ఇంకా సీతారామలక్ష్మణుల ఉత్సవ విగ్రహాలు ఉన్నాయి. ఆశ్చర్యం ఏమంటే ఈ ఉత్సవ విగ్రహాలకు, మూల విగ్రహాలకు అత్యంత పోలిక కలిగి ఉండటం. మూలవర్లు ఏ భంగిమలో, ఎలాంటి రూపురేఖలతో ఉన్నారో ఉత్సవర్లు కూడా అలాగే ఉన్నారు. ఇంత పోలిక ఏ ఇతర ఆలయాల్లో కనిపించదు. శ్రీ కోదండరామస్వామి ఉత్సవర్ల హృదయ స్థానంలో లక్ష్మీదేవి ఉన్నచోట త్రికోణపు గుర్తు ఉండటం గమనార్హం. వీటికి కూడా బంగారు తొడుగులు ఉన్నాయి.

ఇంకో విశేషం ఏమిటంటే తిరుమలలో వలె ఇక్కడ కూడా "పంచబేర మూర్తులు" ఉన్నారు. శ్రీ వైఖానస ఆగమములో పంచబేర ఆరాధన ప్రత్యేకంగా చెప్పబడి ఉంది. వీటిని మూలవర్లు, కౌతుక మూర్తులు. ఉత్సవమూర్తులు. స్నపన మూర్తులు. బలి మూర్తులుగా. చెప్తారు. ఇవి నిత్య పూజలో ఉన్నవి. ఇందులో ఉత్సవ మూర్తులు ఈ

ఆలయములో మూలమూర్తులను పోలి వుంటే. బేరమూర్తులలో ఒకటి తిరుమల శ్రీవారి ఆలయములోని శ్రీరామచంద్రమూర్తి భంగిమ (దీనిని మోహనరాగ భంగిమ అంటారు.)లో వుంది. ప్రత్యేక రోజులలోనే ఈ బేరమూర్తుల దర్శనం వీలౌతుంది.

ప్రతి పునర్వసుకు ఉత్సవర్లకు అభిషేకం ఉంటుంది. అదే శనివారం పునర్వసు కలిసివుంటే మూలవర్లకూ, ఉత్సవర్లకు అభిషేకాలు జరుగుతుంది.

గర్భగుడిలో ఇంకా శ్రీ తాండవకృష్ణుని ఉత్సవ విగ్రహం ఉంది. శయన మందిరంలో ఏకాంత సేవప్పుడు పాన్పుపై పరుండబెట్టి విగ్రహం ఇదే! తిరుమలలో కూడా ఇదే మాదిరి విగ్రహం ఉంది. ఇంకా స్వామి వారి పాదాల చెంత సాలగ్రామాలు స్వామితో బాటు నిత్యం పూజ లందుకొంటున్నాయి. ఒక అఖండం మనకు కనపడకుండా ఒక మూలల గర్భగుడిలోనే ఎప్పుడు వెలుగుతుంటూదట. స్వామివారి శయన మండపంలోనే ఒక వెండి మంచం ఉంది. బలిష్టమైన కంచు గొలుసులు ఒక దూలమునకు చెరి రెండు వైపులుగా కొక్కాలతో అమర్చబడి ఉన్నాయి. వెండి మంచాన్ని గొలుసులతో ఉయ్యాల వలె వేలాడదీసే విధంగా ఉంది. ఏకాంతసేవ (లేదా) పాన్పు సేవలో వెండి మంచమును ఉయ్యాల వలె అలా అమర్చి పట్టు పరుపుపై ఈ కృష్ణమూర్తి విగ్రహన్ని పరుండబెట్టి ఏకాంత సేవ జరుపుతారు. ఇది కూడా చూడవలసిన సేవ. ఒక్కసారి చేతులెత్తి, మనసారా శ్రీ సీతారామ లక్ష్మణులకు నమస్కరించి, అడుగులు వెనక్కి వేస్తూ మెట్లు దిగి ముఖ మండపం దాటి నిదానంగా గరుడాళ్వార్ పైనున్న అద్దం నుంచి కూడా స్వామిని దర్శిస్తూ, నేరుగా నున్న శ్రీ భక్తాంజనేయ స్వామి వారిని దర్శిద్దాం - ఆసలు ఆంజనేయ స్వామి వారి కోసమేమో శ్రీ కోదండరామ స్వామి ఆలయంలో గర్భగుడి మెట్లెక్కి వెళ్లవలసినట్లుంది. అంటే ఆంజనేయస్వామి ఆలయము ఉన్న ఎత్తులో సరిగా ఉండేట్లు ఇలా నిర్మించారని ఇక్కడి అర్చకులు అంటారు.




శ్రీవారి ముఖ మండప నమూనా చిత్రపటము.

▨ ఈ స్తంభముపై శ్రీ విమాన వేంకటేశ్వర స్వామివారి సాదృశ్య రూపము చెక్కబడి వున్నది.

□ ముఖ మండపములోని 18 స్తంభముల అమరిక.



**తిరుపతి శ్రీకోదండరామస్వామివారు, సీతమ్మవారు,**
**లక్ష్మణస్వామివారు**
**(అభిషేక సమయంలోని భంగిమల చిత్ర కల్పన)**

చిత్రకారుడు : శ్రీ ఎస్.ఎస్. భవానిశంకర్

60

# శ్రీ భక్తాంజనేయ స్వామి ఆలయం

తిరుమలలో స్వామి వారి ఆలయం ఎదురుగా బేడి ఆంజనేయస్వామి ఆలయము వెలసివున్నదని అందరికీ తెలిసిన విషయమే! స్వామి వారి ఆలయం నుండి మెట్లెక్కి ఆలయానికి ఎదురుగా నున్న బేడి ఆంజనేయస్వామి వారిని దర్శించుకోవలసి వున్నట్లు గానే, ఇక్కడ కూడా స్వామి వారి ఆలయంలో నుంచి మెట్లెక్కి బయటికి వచ్చి, శ్రీ భక్తాంజనేయ స్వామి వారిని దర్శించుకోవాలి.

శ్రీ కోదండరామస్వామి గోపురము నుంచి ఆంజనేయస్వామి వెలసివున్న ప్రదేశము (లేదా) వీధిని "రాములవారి సన్నిధి" వీధిగా పిలుస్తారు. (తిరుమలలో కూడా స్వామి గోపురం నుంచి బేడి ఆంజనేయస్వామి వరకు ఉన్న స్థలాన్ని స్వామి సన్నిధి వీధిగా పిలుస్తారు.

ఈ సన్నిధి వీధిలో, రాములవారి సన్నిధి నుంచి (గర్భగుడి నుంచి) సుమారు 600 అడుగుల దూరంలో శ్రీ భక్తాంజనేయస్వామి ఆలయం వెలసివుంది.

ఈ వీధి మధ్యలో అంత్యంత ఆకర్షణీయంగా ఒక రాతి ధ్వజస్తంభము ఉంది. ఆహా! ఏమి ఈ శిల్పుల నైపుణ్యము. ఒక అరుగు కలిగి, ఒకే రాయి నుంచి తయారు చేయబడి ఉన్న ఈ ధ్వజస్తంభము ఈ వీధికే ఒక కళ. ఈ వీధి, పరిసరాల్ని పరమ పవిత్రంగా చేసే ఈ ధ్వజస్తంభం సుమారు 25 అడుగుల ఎత్తు కలిగి ఉంది. ఈ స్తంభము ఉన్న అరుగు ఒకప్పుడు నిచ్చెన వేసి ఎక్కేంత పెద్దదిగా ఉండేదట. కాలక్రమంలో రోడ్లు ఏర్పడి కేవలము 30 సెం.మీ. ఎత్తు మాత్రమే కనపడుతుంది. ఈ అరుగు నాలుగు రాళ్ళ అమరిక.

ఈ ధ్వజస్తంభముపై భాగము చతురస్త్రకారంతో ఉండి పై నాలుగు మూలల్లో నాలుగు గంటలు ఏర్పరచబడి ఉంది. ఒకప్పుడు ఈ గంటలపై గంధర్వుంతుల ఆకృతిలోని దేవతలు నలుగురు నాలుగు ప్రక్కలా వుండేవి. కాలక్రమంలో అవి ఎలానోపోయాయి. ఈ స్తంభము మొదట కొంత

భాగము చతురస్రాకారంగాను, మరి కొంత భాగం గుండ్రటి స్తూపాకారపు స్తంభములో 8 భాగాలు తర్వాత 16 భాగాలుగా విభజించబడి, కొద్దిగ్గా రోమన్ కాలం నాటి శిల్పంలాగా కనిపిస్తుంది. రమణీయమైన ఈ శిల్పాన్ని వర్ణించనలవికాదు. పై చతురస్రం దిగువ భాగంలో ఏర్పరచబడిన పద్మపు రేకులు, వాటిలోని రంగులు రాయిలో నుంచి తీయబడి, శాశ్వతంగా ఉన్నాయి (చూడు పటము). స్తంభం మధ్యలో పాతకాలపు ఇనుపకడ్డీ వర్తులాకారంలో అమర్చబడి వుంది. బహుశా! ఆకాలంలో పైకెక్కడానికో, ఏదో ఉత్సావాలకో వాడే వారెమో! దీనికి ఒక్క ముక్కకూడా త్రుప్పు పట్టకుండా వుండటం మరోవిశేషం. ఈ స్తంభముపై దశావతారాలు, నాట్యగత్తెలు, ఇంకా అనేక శిల్పాలను, గోళాకృతి నేర్పరచిన గొలుసులలో వున్న చిత్రాలను చూడవచ్చు. ఈ స్తంభంపై దిగువన, అందరికీ చేరువగా, చతురస్రాకార స్తంభ భాగాన రాములవారి గుడికి ఎదురుగా, గరుత్మంతుని పై నున్న శంఖచక్రదారి అయిన విష్ణుమూర్తి, ఆంజనేయస్వామి ఆలయం ఎదురుగా చతుర్భుజములతో మురళీకృష్ణుడు, అతని గానం తన్మయత్వంతో వింటున్న గోవులు, భక్తితో అంజలి ఘటిస్తున్న ఒక భక్తుడు చూడవచ్చు. దక్షిణం వైపు గజేంద్రుని అభయమిస్తున్న శ్రీమహావిష్ణువు, ఉత్తరం వైపు మండపంలో కొలువై వున్న శ్రీ వేంకటేశ్వరస్వామిని చూడొచ్చు. ఏక శిలలో ఉండే అత్యంత రమణీయమైన శిల్పం ఇది. పై భాగంలో గొడుగుల ఉండటం మూలాన శిల్పకళ అలానే ఉంది. కాలక్రమంలో ఏర్పడిన గాలి, వాన ఇతర ప్రకృతిరాపిళ్ళ కారణముగా శిల్పకళ కొంత తగ్గి ఉండొచ్చు. ఎన్నో రకాల ఒంపు సొంపులతో ఉన్న ఈ ధ్వజస్తంభంపై తి.తి.దేవస్థానం వారు ఒక విద్యుద్దీపాన్ని అలంకరించి, మరింత శోభను కలుగజేసివున్నారు.

ఒక్కసారి ఈ ధ్వజస్తంభానికి నమస్కరించి శ్రీ భక్తాంజనేయ స్వామి ఆలయానికి వెళ్దాం. స్వామి వారిని రాములవారి ఆలయం నుంచే దర్శించుకుంటూ వచ్చే వీలుగా ఈ ఆలయం నిర్మాణమై ఉండటం విశేషం. స్వామి సన్నిధి వీధిలోనే ఉన్న శ్రీ భక్తాంజనేయ స్వామివారి

ఆలయం. రెండు వైపులా రెండు అరుగులు వుంది. ద్వారబంధం. కమ్మీల తలుపులతో, కిటికీలు కూడా రాళ్ళ మధ్య పెద్ద ఇనుప చట్రాలవలె అమర్చి ఉంది. ప్రదక్షిణ చేసేందుకు వీలుగా రెండు వైపుల దక్షిణ. ఉత్తరాలలో ద్వారబంధములు ఉన్నాయి. స్వామికి నమస్కరించి ముందుగా ప్రదక్షిణకి వెళ్లాద్దాం.

ఈ ప్రదక్షిణనూ దక్షిణ ద్వారం గుండా చేద్దాం. ఈ ద్వారంలో నుంచి బయటకు ఒకప్పుడు కట్టమీదికి (రామచంద్ర తీర్థంకి) దారి ఉండేది. గోడకట్టి, కట్టదారిని వేరుగా ఏర్పరచి ప్రదక్షిణను ఏర్పాటు చేసారు. ఈ ద్వారముల ప్రక్కన బయట ప్రదక్షిణంలో అరుగులు కలిగి, గోడపై వరాహము, ఖడ్గము చిహ్నము ఉన్నాయి. కొంత మిట్టగా ఉన్న ఈ ప్రదక్షిణం నుంచి స్వామి గర్భగుడి వెనుక కదులుదాం. స్వామి గోపుర విమానం చూసి, నమస్కరిస్తాం. గోపురమును ఈ మధ్యనే పునరుద్ధరించారు. ఈ గోపురముపై కూడా నాలుగు సింహాలు ఉన్నాయి. భక్తాంజనేయ స్వామి వారి విగ్రహాలు కొద్దిగా కాళ్ళు మోకాళ్ళ వద్ద వంచినట్లు నిలబడి ఉన్న భంగిమలో ఉన్నట్లు అంజలి ఘటిస్తున్నట్లునది. నాలుగు వైపులా నాలుగు సింహాలు, భక్తాంజనేయ స్వామి శిల్పాలున్నాయి. (బేడి అంజనేయస్వామి ఆలయంపై కూడా ఇలానే సింహాలు ఉన్నాయి) విమానమునకు ఒక్కసారి నమస్కరించి ఉత్తర ద్వారం నుండి లోనికెళ్ళి శ్రీ భక్తాంజనేయస్వామి వారిని దర్శిద్దాం. ఈ ఆలయం కేవలం ఒక పెద్ద మండపం గర్భగుడి కలిగి ఉంది. ముందర నున్న మండపం రెండు భాగాలుగా, తాత్కాలికంగా అడ్డు తొలగించగలిగే విధంగా కమ్మీలతో కూడిన అమరిక ఉంది. మొత్తం పది స్తంభములతో ఈ ఆలయము నిర్మించబడి వున్నది. వీటిలో ప్రధానంగా కనపడే నాలుగు స్తంభములు, వీటిపై శ్రీరాములవారు. వీరాంజనేయ భంగిమలో శ్రీ భక్తాంజనేయ స్వామి. వెన్నె తింటున్న కృష్ణుడు, తాబేలు. గరుత్మంతుడు శిల్పములను, ముఖ్యంగా విఘ్నేశ్వరుని పోలి తొండము పైకెత్తి నడుస్తున్న భంగిమలో ఒక శిల్పము. పామును చేతిలో వుంచుకొన్న వానరము అత్యంత



ధ్వజారోహణం



చిన్న శేష వాహనం



బ్రహ్మోత్సవాలలో జరిగే శ్రీవారి స్నపన తిరుమంజనం



హంస వాహనం



హనుమత్సమేత శ్రీరాముడు

ఆకర్షణీయంగా మలచబడ్డాయి. ఆలయములో దక్షిణ గోడ లోతట్టుగా చెట్టు నీడలో దోగాడుతూ వెన్న తింటున్న కృష్ణుడు స్పష్టంగా కనిపిస్తుంది. ఇక స్వామిని దర్శిస్తాం.

రాములవారికి పడమట వైపు వుండటం మూలానే, తూర్పు వైపుకు తిరిగి శ్రీ కోదండరామస్వామిని అత్యంత భక్తితో అంజలి ఘటిస్తున్న భంగిమలో ఉన్నారు. అత్యంత అద్భుతమైన మకరతోరణంలో ఈ స్వామి ప్రతిష్ఠించబడిఉన్నారు. బలిష్టమైన దేహంతో, గంభీరమైన భక్తిభావముతో వున్న స్వామి వాలము తలపై నుంచి వంగి కనపడుతుంది. వెనుకకు దువ్వినట్లుగా వున్న కిరీటం వలె కనపడుతున్న శిఖలతో భుజములపై వరకు కేశములు కలిగి పెద్ద కర్ణములు, కర్ణాభరణములతో అంజలి ఘటిస్తూ దర్శనమిస్తున్నారు. స్వామి వారికి తిరునామం, మధ్యన సింధూరపు తిలకం దిద్దివున్నారు. ప్రశాంతమైన వదనంలో గంభీర భక్తి భావం ఉట్టిపడుతూంది ఈ స్వామిలో. భుజకీర్తులు, ముంజేతి కంకణములు, విశాలమైన వక్షస్థలము, నున్నటి ఉదరము, బలిష్టమైన అంకములు కలిగివుండి, దోవతి మాత్రమే ధరించినట్లున్నారు. వీరగంభీరమై ఉన్న ఈ స్వామి విగ్రహంలో స్పష్టంగా స్వామి నేరుగా రాముల వారిని చూస్తున్నట్లుంది. స్వామి వారు పాదములు రెండు దగ్గరగా నుంచుకొని నిటారుగా నిలుచుకొని భక్తితో రామనామ స్మరణ చేస్తున్నట్లుంది. పాదములకు కడియములతో గజ్జలవంటి అమరిక కలిగిఉంది. భక్తితో అంజలి ఘట్టిస్తున్న స్వామికి ఒకింత వారగా నిలబడి నమస్కరిస్తాం. ఎంచేతంటే, ఈ స్వామి నుంచి నేరుగా ధ్వజస్తంభం, ఆ స్తంభానికి సరిగా నేరుగా రాములవారి ధ్వజస్తంభం, ఆ ధ్వజస్తంభానికి నేరుగా శ్రీ కోదండరాములవారు ఒకే సరళరేఖలో ఉండేలా మహాద్భుతం గా నిర్మించబడింది. అందుకే వారి మధ్య మనం ఉండి స్వామి భక్తికి భంగం కలిగించకుండా మన భక్తిని ప్రకటిద్దాం.

ఈ స్వామి వారికి ఆదివారము పూట పాలు, పెరుగు, తేనె, వెన్నె,

చందనపుపొడి, సుగంధ ద్రవ్యములతో అభిషేకము చేయబడుతుంది. ఆ తర్వాత పంచామృతం భక్తులకు పంచబడి తరువాత స్వామిని తమలపాకులతో బహు సుందరముగా అలంకరించి ఆ తరువాత ఆకు పూజ చేస్తారు. తిరుమలలో కూడా బేడి ఆంజనేయస్వామికి ఈ విధంగానే అభిషేకం జరుగుతుంది. స్వామి వారి ఉత్సవమూర్తి రాములవారి ఆలయంలోనే సీతారామ మూల విగ్రహాల మధ్య ఉంచబడి వుంది.

ఒకప్పుడు ఈ ఆలయంలో బయట నుంచి ఎలా అరిస్తే అలా ప్రతిధ్వని వినిపించేది. కాని ఇప్పుడు దానికి సంబంధించిన ఏదో రాయి పోయిన మూలాన అలా ప్రతిధ్వని రావటం లేదు. ప్రతి శనివారం స్వామివారి ఉత్సవ విగ్రహాలు ఊరేగించేటప్పుడు శ్రీరాములవారి శేష హారతిని స్వామికి ఇస్తారు.

ప్రతిరోజూ స్వామికి నివేదించిన ప్రసాదాలను, శ్రీ కోదండ రామస్వామి వారి ఆలయం నుంచి మేళతాళాలతో శ్రీ ఆంజనేయస్వామికి కూడా సమర్పించి తర్వాత శ్రీవారి ఆలయంలోని భక్తులకు పంచటం ఇక్కడి ఆచారం. తిరుమలలో కూడా శ్రీ వేంకటేశ్వరస్వామివారికి నివేదించిన నైవేద్యాన్ని బేడి ఆంజనేయస్వామి వారికి నివేదిస్తారు.

**"మనోజవం మారుతతుల్య వేగం,**
**జితేంద్రియం బుద్ధిమతాంవరిష్ఠం,**
**వాతాత్మజం, వానరయూథముఖ్యం,**
**శ్రీరామదూతం శిరసానమామి".**

అని స్వామికి మ్రొక్కి, సాష్టాంగా నమస్కారము చేసి, ఒక్కసారి ఈ ప్రదేశంలో వెలసి వున్న శ్రీ సీతారామలక్ష్మణ స్వాముల వైపు తిరిగి గోపురానికి నమస్కరించి, ఇంకేమైన విశేషాలున్నాయేమో తెలుసుకుందాం!



# ఆలయ పరిసరాలు - ఇతర విశేషాలు

స్వామి వెలసి వున్న ఈ నాలుగు వీధుల్లో మరో విశేషం ఉంది. స్వామి వారికి తూర్పు వైపున మంత్రాలయ రాఘవేంద్రస్వామి వారి మఠం, దక్షిణం వైపు శ్రీ విఖ్నశాచారి వారి ఆలయము, ఉత్తరం వైపున శ్రీ శృంగేరి శంకరాఛార్యుల వారి మఠం నెలకొని ఉన్నాయి. అంటే ద్వైత, అద్వైత, విశిష్టా ద్వైత ప్రబోధకులు ముగ్గురు స్వామి చెంతనే ఉండటం విశేషం. అది కూడా ప్రధాన స్థాపకులు కావటం మరీ విశేషం. ఈ మఠాల్లో ఆయా మఠాధిపతుల విగ్రహాలు కూడా వుండి, నిత్య పూజలందుకో బడుచున్నాయి. శంకర జయంతి రోజు ఆది శంకుల ఉత్సవం, రాఘవేంద్రస్వామి జయంతి రోజున ఆయన ఉత్సవమే కాక, ప్రత్యేకంగా విఖనసాచార్యుల వారి ఉత్సవాలు ప్రతి సంవత్సరం బహు చక్కగా జరుగుతాయి. ఈ విఖనసాచార్యుల వారే "వైఖానస ఆగమశాస్త్ర" కర్త. తన తపస్సుతో విష్ణుమూర్తి సాక్షాత్కారం చేసుకొని, ఆయన వల్ల తిరుమలలో పుట్టలోనున్న శ్రీవారిని తెలుసుకొని మొట్టమొదటసారిగా ఈయననే పూజించెను కనుక ఆ పద్ధతిలోనే తిరుమలలో ఈయన పేర వైఖానస ఆగమ పద్ధతిగా పూజలు నేటికిని జరుగుతున్నవి అని కూడా ఒక కథ ప్రచారంలో ఉంది.

ఇంకా, గోవిందరాజస్వామి వారి ఆలయంలో నున్న ఆండాళ్ళమ్మ ఉత్సవం జరిగేప్పుడు ప్రతిరోజు అమ్మవారు శ్రీ కోదండరామ స్వామి ఆలయానికి వచ్చి ప్రొద్దున, సాయంత్రం స్వామి ఆలయములో పెద్ద ప్రదక్షిణ చేసి వెళ్ళటం విశేషం. ప్రతి సం॥ జరిగే ఈ ఉత్సవములకు, ధనుర్మాసములో అమ్మవారికి జరిగే పూజలకు శ్రీరామాలయానికి ఏదో సంబంధం ఉంది. కనుక వీటి గురించి వర్ణిస్తున్నాను.

శ్రీ ఆండాల్ అమ్మవారి ఆలయము స్థానిక శ్రీగోవిందరాజస్వామి ఆలయములోని పార్థసారథి ఆలయము వద్ద ఉన్నది.

**నీరాట్టఉత్సవము :**

మకర సంక్రమణమునకు పూర్వదినమగు భోగి పండుగకు ఏడు

రోజుల ముందుగా తిరుపతిలో ఈ ఉత్సవము ప్రారంభమగును. దీనిని "నీరాట్ట ఉత్సవము" అని పిలుస్తారు.

ఈ ఉత్సవములు జరుగుటకు కారణమేమంటే, "శ్రీగోదాదేవి" మరోపేరు "ఆండాళ్". ఈమె పాండ్య దేశంలో విల్లిపుత్తూరు గ్రామము నందు విష్ణుచిత్తుడను వైష్ణవ భక్తునికి తులసీకాననమునందు భూమి నుండి జన్మించి, ఆయన ప్రేమపుత్రికగా అవతరించినది. భాగవతంలో శ్రీకృష్ణుని పతిగా పొందగోరి వ్రేపల్లెలోని గోపికలు "కాత్యాయనీ" వ్రతమాచరించినట్లు ఈమె శ్రీ రంగనాథుని పతిగా పొందగోరి మార్గ శీర్షమాసంలో (ధనుర్మాసంలో) నోమునోచినది. ఈమె దినమునకొక్క పాశురముగా ముప్పది దినములు అనుసంధింపదగిన ముప్పది పాశురములు రచించెను. దీనినే "తిరుప్పావై" పాశురములు అంటారు. తనకు శ్రీ రంగనాధునితో వివాహమయినట్లు కలగని "వారణమాయిరమ్" " రచించెను. ఈమె చేసిన ఈ వ్రత జ్ఞాపకముగనే ఈ ఉత్సవములు ఇక్కడ జరుపబడుచున్నాయి. సామాన్యంగా ప్రతి సం॥ జనవరి 6వ తారీఖున ఈ ఉత్సవములు అరంభమగును. ప్రతి వైష్ణవాలయములో ధనుర్మాస సంధర్భముగా సుప్రభాతం, ముందుగా "తిరుప్పావై ప్రబంద" పఠనంతో ఆరంభమవుతుంది.

ధనుర్మాసంలో ప్రతి ఉదయం శ్రీ కోదండరామాలయం నుంచి వెండి బింధెలో తీర్థం శ్రీ గోవిందరాజస్వామి ఆలయములోని శ్రీ ఆండాళ్ళమ్మకి సన్నాయి మంగళవాద్యములతో ఏనుగులపై అభిషేకము కొరకు తీసికొని వెళ్ళబడుతూంది. ఇక శ్రీ గోవిందరాజస్వామి ఆలయంలోని "ఆండాళ్ళమ్మ ఉత్సవములో" ప్రతి దినము శ్రీ గోదాదేవిని ధనుర్మాస పూజానంతరము పల్లకీలో నధిష్ఠింపచేసి, తిరువీధులలో ఉత్సవముగా శ్రీ కోదండరామాలయము వద్దనున్న స్థానిక "శ్రీరామచంద్ర తీర్థం" (శ్రీరామచంద్ర గుంట కట్ట అని అంటూంటారు) వద్దగల "నీరాట్టమంటపం" వద్దకు వేంచేపుజేయుదురు. ఇచ్చట శ్రీరాములవారి ఆలయం నుంచి గోరు వెచ్చటి ,నీటిని అమ్మవారి అభిషేక నిమిత్తం తీసుకొని వచ్చి అభిషేకించెదరు. దీనినే "నీరాట్టం" అందురు. నీరాట్టం అయిన పిమ్మట నివేదనం, శాత్తుమొర, ఆస్థానము జరుగును. ఆ తర్వాత

అమ్మవారు ప్రతి రోజు ఉదయంపూట, సాయంత్రంపూట పుష్పాలంకార భూషితమై తిరుచ్చినధిష్ఠించి శ్రీరాములవారి ఆలయములోని పెద్ద ప్రదక్షిణ మార్గం ద్వారా వెళ్ళి ప్రదక్షిణ చేసి ధ్వజ స్తంభము వద్ద హారతులందుకొని, నాలుగు మాడావీధులో ఉత్సవముగా హారతులతో ఊరేగి, తిరిగి తిరువీధుల గుండా కోవెలకు వెళ్ళుదురు. ఇటుల ఏడు దినములు ఉదయం, సాయంత్రం విశేషంగా జరిగే ఈ ఉత్సవములో అమ్మవారు ప్రతి రోజు శ్రీరాములవారి సన్నిధి వీధి, పెద్ద ప్రదక్షిణం, మహాప్రదక్షిణం చేయును. ఈ ఉత్సవములప్పుడు చదివే దివ్య ప్రబంధములో "రామచంద్రతీర్థే, పుష్కరిణితటే" అను మంత్ర శబ్దములు వల్లించబడును. దీని గురించి సమాచారం అంతగా అందుబాటులో లేదు.

ఇక ఈ ఉత్సవం 8వ రోజున అనగా "మకర సంక్రాతి" పూర్వదినమగు భోగిపండుగ దినమున శ్రీ ఆండాళ్ అమ్మవారు శ్రీ కృష్ణ స్వామితో సహా, <u>భోగి తేరునధిష్టించి</u> గోవిందరాజస్వామి తిరువీధులలో ఉత్సవము జరిగి తిరిగి సన్నిధికి వేంచేయును. ఇది ఆచారము. ఈ ఉత్సవము తిరుపతిలో బహు సందడిగా జరుగును. కనుమ పండుగ రోజు ఆండాళ్ కళ్యాణోత్సవము జరుగును.

ఈమెనే కొందరు స్థానికులు "బీబీ నాంచారమ్మగా" కూడా వర్ణిస్తారు. శ్రీ బీబీ నాంచారమ్మ శ్రీ వేంకటేశ్వరుని వివాహమాడుట కోసమై తపమాచరించెనన్నది అందరికీ తెలిసిందే.

మరి శ్రీ గోవిందరాజస్వామి ఆలయంలో పార్థసారథి ఆలయము చెంతనున్న ఈ ఉత్సవ విగ్రహం ఇంతదూరంలో వున్న శ్రీరామాలయానికి రావటంలో అంతర్యం ఏమిటో...? శ్రీ వేంకటేశ్వరస్వామి తిరుమలలోనున్నారు, శ్రీనివాసమంగపురంలో కూడా ఉన్నారు. కనుక వీటి దూరంతో పోలిస్తే అత్యంత దగ్గరగా ఉన్న శ్రీరాములవారి ఆలయం వద్దకే ఈమె వస్తున్నట్లుంది. అలాకాకుంటే బహుశా! ఈ "శ్రీవేంకటాద్రి రాముని"దర్శనం ఈమెకి కూడా శ్రీ వేంకటేశ్వరుని దర్శనంతో సమానమేనేమో!.

దీనిని బట్టి ఆండాళ్ అమ్మకి ఈ స్వామి కొలువై ఉన్న ఈ ప్రదేశానికి ఏదో అవినాభావ సంబంధం ఉందనిపిస్తుంది. అందుకే ఈ ఆలయంలో

కూడా ప్రతిరోజు "తిరుప్పావై" పారాయణ ఉదయం పూట భక్తులు అందరికీ (4 వీధుల్లో) వినపడేలా ఏర్పాటు చేస్తే మంచిదనిపిస్తుంది. పైగా ఈ తిరుప్పావై పఠనము దేవతలను ఆహ్వానింపజేసి, లోక కళ్యాణం జరిగి లోక శ్రేయస్సుని కలుగజేయునని శాస్త్రవచనం.

ప్రతి యేటా తిరుమలలో జరిగే "ఆణివర ఆస్థానం" పిమ్మట లెక్కించిన డబ్బు, తిరుచానూరు పంచమికి అమ్మవారికి వెళ్ళే ఆభరణాలు, బ్రహ్మోత్సవాలప్పుడు శ్రీవారికి వెళ్ళే గొడుగులు, కపిలతీర్థము నుంచి మహాశివరాత్రి నాడు ఉత్సవముగా వేంచేసే నంది వాహనుడైన శివపార్వతులు, వినాయకచవితి నాడు వేంచేసే మూషిక వాహనుడైన విఘ్నేశ్వరుడూ, మేళతాళాలతో శ్రీరాముల వారికి ప్రదక్షిణం చేసి వెళ్ళటం మరో విశేషం!

ఇంకా ఈ చుట్టుప్రక్కల కాళమ్మగుడి, ఈ మధ్యనే ఏర్పడిన శ్రీషిర్డి సాయినాథుని గుడి ఉన్నాయి. అత్యంత చేరువలోనే తిరుమల గాలిగోపురం వారి శ్రీరామాలయం, శ్రీ ఆంజనేయ ఆలయము, శివాలయం కూడా ఉన్నాయి. స్థానిక రామచంద్ర తీర్థం వద్ద జంబుకేశ్వరాలయం, పట్నూలు వీధిలో రేణుకాపరమేశ్వరి మరియు భక్తాంజనేయ స్వామి ఆలయములు, మిట్ట వీధిలోని ఉత్తర్లాది మఠంవారి శ్రీ వీరాంజనేయ స్వామి ఆలయము (ఇందు శ్రీరామనవమికి ప్రత్యేకంగా జరిగే ఉత్సవాలు పేర్కొనదగినవి), క్రొత్త వీధిలో లోని శ్రీ కళ్యాణ వేంకటేశ్వరస్వామి మరియు శ్రీ వాసవి కన్యక పరమేశ్వరి ఆలయములు వెలిసి వున్నవి. విజయదశిమికి ఈ కన్యక పరమేశ్వరి అమ్మవారిని "నీరాట్ట మండపం"లో అలంకరింపజేసి ఉత్సవముగా రాములవారి గుడి వరకు ఊరేగించుదురు.

తాళ్లపాక అన్నమయ్య వంశంవారు (బహుశా! 4వ తరంవాళ్ళు అంటారు), ఈ స్వామి ప్రక్కవీధిలోనే ఉండినారు. ఎక్కువగా శ్రీ వేంకటేశ్వరస్వామి వారి ప్రధాన అర్చకులకు సంబంధించిన నివాసములు ఉండటం మరో విశేషం.

ఇక్కడి నుంచి అత్యంత దగ్గరలో శ్రీ అన్నమాచార్య కళామందిరం. శ్రీ త్యాగరాజ స్వామి ఆలయ మండపం ఉన్నాయి. శ్రీ అన్నమయ్య జయంతి ఉత్సవాలప్పుడు, శ్రీ త్యాగరాజ స్వామి ఉత్సవాలప్పుడు జరిగే ప్రారంభోత్సవములకు శ్రీ కోదండరాములవారే ఉత్సవంగా వేంచేపుచేయుదురు. ఈ కళామందిరాలే ఆలయాలుగా ఉండటమే కాక ఈ మందిరాలలో అన్నమయ్య, త్యాగరాజ స్వామి విగ్రహాలు నిత్య పూజలందుకొంటున్నాయి. ఎన్నో ఆధ్యాత్మిక, హరికథ, సంగీత, నృత్య, నాటక, కళా కార్యక్రమాలు ఇక్కడ నిత్యం జరుగుతుంటాయి.

స్థానిక శ్రీగోవిందరాజస్వామి ఆలయ బ్రహ్మోత్సవాలప్పుడు జరిగే గరుడసేవకు వెళ్ళే శ్రీవారి పాదములు ఈ స్వామికి మహా ప్రదక్షణంగా వెళ్ళడమే కాక, మోహినీ రూపంలో వాహనంపై వేంచేసే శ్రీగోవిందరాజ స్వామి శ్రీకోదండరామస్వామి ఆలయానికి వేంచేయడం విశేషమే!

స్థానిక గోవిందరాజస్వామి ఆలయములో తిరుమలలో వలె 22 రోజులు అధ్యయనోత్సవము (తిథి, నక్షత్రం ఆధారముగా) జరుగును. చివరి రోజు పెద్ద శాత్తుమొర సందర్భముగా నమ్మాళ్వార్, గోవింద రాజస్వామి వారు చిన్నబజారు వీధి వరకు వేంచేయుదురు. అచ్చట నమ్మాళ్వార్కి గోవిందరాజస్వామి వారు తిరుమల వైపుకు అలిపిరి మార్గమును చూపుతూ, ఇది వైకుంఠమునకు మార్గమని ఆయనకి తెలియజేసినట్లు చెప్తూ, గోవిందరాజస్వామి వారిని తిరిగి ఆలయమునకు వేంచేపు చేయుదురు. ఈ ప్రదేశము రాములవారి ఆలయమునకు చాలా దగ్గరలోనే ఉండటం. వైకుంఠమార్గంగా చెప్పబడే మార్గములోనే ఈ ఆలయము వెలసి వుండటం విశేషమే! తిరుపతిలో మణవాళ మహాముని మరియు వేదాంత దేశికర్ల శాత్తుమొరల సందర్భముగా కొండ నుంచి గోవిందరాజస్వామి వారికి వెళ్ళే అప్పపడి, దోశపడి ఇతరములు శ్రీ రాములవారికి విమాన ప్రదక్షిణం చేసి వెళ్లటం ఒక ఆచారం. ఇలా ఎన్నో రహస్యాలతో ఇక్కడ వెలసిన ఈ స్వామి అనుగ్రహాన్ని కోరుతూ నమస్కరిద్దాం!

ఇక స్వామివారి వాహనమండపం చూస్తే బలిష్టమైన 10 టేకు స్తంభాలతో సుమారు 25 నుంచి 30 అడుగుల పొడవుతో పై భాగమంతా వరుసగా పేర్చి ఉన్న కర్రలతో ఏర్పరచిన కప్పుతో ముందర భాగంలో ఏనుగుల శిల్పాలు రెండు వైపులా కలిగి వుంది. ఈ మండపాన్ని ఆనుకొని వెనుక వైపున రథమండపం, స్వామి వారి రథము వున్నవి. ఈ మండపం పైకి వెళ్ళే గోడపై చుట్టు ప్రక్కలా రామాయణ గాథలు అత్యద్భుతంగా చెక్కి ఉన్నారు (చూడుపటము). స్వామి వారి ఆస్థాన మండపములో చెక్కబడి వున్న బోధనలో వున్న మూర్తుల శిల్పాలు, ఈ రామాయణ ఘట్టము నందు హనుమంతులవారికి అంగుళీయకంను అందజేస్తున్న దృశ్య మందలి శ్రీరామచంద్రమూర్తి శిల్పం ఒకే విధమైన రూపు రేఖలతో ఉండటం మూలాన, ఆస్థాన మండపంమందలి రాజవేషదారులైన బోధనా మూర్తులు శ్రీరామచంద్రునిదే అనుకోవచ్చు. ఇక్కడ నుంచి శ్రీస్వామివారి బ్రహ్మోత్సవం అప్పుడు, సీతారామ, లక్ష్మణ ఉత్సవ విగ్రహాలను అలంకరించి, స్వామి వారి రథంలో కూర్చుండబెట్టి, రథోత్సము జరుపుతారు. ఈ రథము సుమారు 30 అడుగుల ఎత్తు, 10 అడుగుల వెడల్పు కలిగి, పైభాగము బోర్లించిన శంఖపుఆకారము కలదై వున్నది.

ఇక ఒకప్పుడు స్థానిక రామచంద్ర గుంట కొంతకాలం వరకు పుష్కరిణిగా వుండి, స్వామివారి తెప్పోత్సవాలు జరుగుతూండేవట! కానీ, కాలక్రమంలో అనివార్య కారణాల వల్ల ఆపేసారు. అలానే, స్థానిక భక్తాంజనేయ స్వామి ఆలయం ప్రక్కన ఉన్న ప్రస్తుత "జూనియర్ కాలేజ్ హాస్టల్" ఒకప్పుడు స్వామి వారి పుష్పతోట. ఇప్పటికీ అక్కడ ఒక పురాతన మండపం మధ్యలో వుంది. కాలక్రమంలో వచ్చిన మార్పుల వల్ల ఈ తోట కొంతకాలము, గోవిందరాజస్వామి కాలేజ్ హాస్టల్‌గా వుండి ప్రస్తుతము శ్రీ వేంకటేశ్వర జూనియర్ కళాశాల హాస్టల్‌గా వుంది. హాతీరాం బావాజీ మఠం ఒకటి ఈ ఉత్తరమాడవీధిలో వుంది. ఎన్నో కుటుంబాలకు ప్రస్తుతం వసతినిస్తూంది. ఈ మఠం వద్ద నుంచి ఒకప్పుడు తిరుమలకు వెళ్ళే బస్సులుఞ. ఈ పుష్పతోట నుంచి బయలుదేరి అలిపిరి మార్గం గుండా తిరుమలకు

వెళ్ళేవట.

ఇక స్వామి వారి నిత్య సేవలు, పూజా కార్యక్రమాలు, బ్రహ్మోత్సవాలు, ఇతర విశేష రోజుల్లో అలంకరణ పూజా విశేషాలు, తెలుసుకొనే ముందు శ్రీరాముని కళ్యాణ గుణముల నిరూపణను, శ్రీ ఆంజనేయ స్వామివారి భక్తితత్త్వాన్ని తెలుసుకొందాం. ఈ క్షేత్రంలో వెలసిన స్వామికి తలనీలాలివ్వడం, ముడుపులు కట్టడం వంటి భక్తుల మొక్కుబడుల అచరణలో లేనప్పటికీ భక్తుల కోరికలను తీర్చే కరుణామూర్తి ఈయన. అందుకే అందరూ ఈయనను "వరప్రసాది" అంటారు. అర్చన చేయించటం (సహస్ర నామార్చనలు), తళిగలు కట్టడం (నైవేద్య ప్రసాదాల నివేదన), ఉభయంగా ఉత్సవములకు సంకల్పము తో సొమ్ము కట్టడమో, అభిషేకాది పూజలకు సంకల్పము చేయటమో, శ్రీరామనవమి తర్వాత జరిగే కళ్యాణోత్సవాలలో పాల్గొనటమో, హుండీలో కానుకలు వేస్తామనో ఇలా పలు విధాలుగా మొక్కుకోవచ్చు.



# శ్రీరాముని కళ్యాణ గుణములు - ఆనందతత్త్వము

కళ్యాణమనగా మంగళకరమని, శుభమని అర్థము. శ్రీరాముడు మానవ రూపంగా అవతరించిన శ్రీ మహావిష్ణువే. మానవ జాతి అభ్యున్నతి కి శ్రేయస్కరములైన సకల ధర్మములు శ్రీరామావతారంలో స్వామి విశేషంగా నిరూపించి, ఉత్తమ మానవ జీవితానికి ఒక ఉదాహరణగా నిలిచారు.

"బాలకాండ" నందు వాల్మీకి మహర్షి అడిగిన ప్రశ్నకు నారద మహర్షుల వారు సమాధానంగా శ్రీరాముల వారిని ఈ కళ్యాణ గుణముల తో వర్ణించినారు.

ఇందులో నారదమహర్షిని "తపస్స్వాధ్యాయన" నిరుతునిగా, వాగ్వివాదులలో శ్రేష్ఠునిగాను, ఇతిహాస పురాణములను క్షుణంగా ఎఱిగిన మహర్షి గానూ, అట్లే శ్రీ వాల్మీకి మహర్షిని ముని పుంగవుని (మనన శీలము గలగి, వేదములు, శాస్త్రములు చూపుచున్న మార్గముల అనుసరించి జీవుని యొక్క, జగత్తు యొక్క, ఈశ్వరుని యొక్క యథార్థ స్వరూపమును గురించి నిరంతరము ఆలోచించుచుండువారు) గానూ పేర్కొనబడిరి. వాల్మీకి మిక్కిలి ఆతృతతో, మాటిమాటికి ఈ విధముగా నారదులవారిని ప్రశ్నించెను. "<u>ఈ లోకము నందు ఇప్పుడు</u> గుణవంతుడెవడు? వీర్యవంతుడెవడు? ధర్మజ్ఞుడు, కృతజ్ఞుడు, సత్యవాక్యుడు, దృఢవ్రతుడును అయినవాడెవడు?, చరిత్ర కలవాడెవడు? సర్వభూతముల యందు హితుడైన వాడెవడు? సకల శాస్త్రముల నెరిగిన వాడెవడు? సకల కార్యములను చక్కగా నిర్వహించ గలవాడెవడు? ఇతడొకడే ప్రియదర్శనుడని చెప్పదగినవాడెవడు? ఆత్మవంతుడు, క్రోధమును జయించినవాడు, కాంతిమంతుడు, అసూయ లేని వాడెవడు? రణరంగమున ఎవరికి రోషము కలిగినచో దేవతలు కూడా భయపడుదురో అట్టివాడెవడు?" ఈ విషయమున నాకు చాలా కుతూహలముకలుగుచున్నది. <u>ఇట్టినరుని</u> తెలుపటకు నీవే సమర్థుడవు".

ఇందులో ముఖ్యముగా మూడు అంశములు ఉన్నవి. 1. వాల్మీకి "ఇప్పుడు" అని అనటంలో ఆకాలంలోనే (వారి సమకాలికులు) అనియు 2. నరుడు అని అడగటంలో ఏ విష్ణువో. శివుడోకాదు. కేవలం మానవుడు అనియు 3. ఈ లోకంలో అనటంలో వైకుంఠము, కైలాసముకాదు ఈ భూమి మీదనే అనియు, గమనింపదగినవి.

(నిజానికి ఆకాలంలో ఎందురు మహా పురుషులు లేరు! విశ్వామిత్రుడు, పరశురాముడు మొదలగువారుండగా) నారదులవారు పై ప్రశ్నకు సమాధానంగా, "ఓ మహర్షీ! నీవు పెక్కు గుణములను పేర్కొని అవి అంతము ఒకే వ్యక్తిలో కలిగి ఉండునట్లు కోరితివి. అట్లు ఉండుట దుర్లభము, అయిననూ నేను ఆలోచించి తెలిసికొని చెప్పెదను". అని ఇట్లనెను. "నీవడిగిన గుణములన్నియు కలవాడు, ఇక్ష్వాకు వంశమున జన్మించిన రాముడేయని జనులు చెప్పుకొనుచున్నారు. అతడు నియతాత్ముడు, మహావీరుడు, ద్యుతిమంతుడు, ధృతిమంతుడు" అని ఇట్లు మొదలు పెట్టి ఇంకనూ పెక్కు గుణములను ఈ విధంగా పేర్కొనెను.

బాలకాండము 1 - 8వ శ్లోకము నుండి 19 వ శ్లోకము వరకు నారదమహర్షి శ్రీ రాముని సకల గుణాభిరామునిగా ఈ విధంగా అభివర్ణించినారు. అందుకే స్వామిని "అనంత గుణగంభీరుని"గా మనం అర్చనలో కీర్తిస్తాం. విశేషించి ఇందులో వాల్మీకి మహర్షి ప్రశ్నించిన ప్రతి ప్రశ్నకు సమాధానముగా తగిన గుణమును నారదులవారు వర్ణించి చెప్పటం మనం గమనించవచ్చు. నారదుల వారు స్వామి కళ్యాణ గుణములను ఈ విధంగా తెలియపరిచారు.

"ఇక్ష్వాకు వంశమున శ్రీ రాముడు అను పేరుతో ప్రజలందరిచే ప్రశంసించబడుతున్న మహనీయుడు జన్మించెను. అతడు ధీరుడు, గొప్పశక్తి సంపన్నుడు, ప్రకాశవంతుడు, సంతుష్టుడు, ఇంద్రియములను వశపరచుకొనినవాడు. తాను శాస్త్రములననుసరించి ఏ విషయమునైన నిశ్చయించును. మర్యాద పురుషోత్తముడు, సరసముగా మాటాలాడును.

అ ధర్మపరులను నశింపచేయును. విశాలమైన మూపులు, బలిష్టములైన బాహువులు, శంఖాకృతి వంటి కంఠము, విశిష్టములైన కపోలములు (చెక్కిలి పై భాగము) కలవాడు. ఉన్నతమును, విశాలమైన వక్షస్థలమును గలిగి పెద్దవిల్లు మనగలిగిన పైకి కనిపించని మూపుసంధులు (Collar Bones) గలవాడు. శత్రువులను (అంతః మరియు బాహ్య) అణచువాడు. ఆజానుబాహుడు, చక్కని శిరస్సు కలవాడు, అందమైన నొసలు, గంభీరమైన గమనము కలవాడు. సమమైన ఒడ్డుపొడుగు గలిగి, హెచ్చు తగ్గులు లేక తీర్చిదిద్దిన అవయవ సౌందర్యముతో నిగనిగలాడు దేహకాంతితో తేజస్సుకలిగి, విశాలమైన నేత్రములతో మనోహరమైన, సమగ్రమైన సాముద్రికశుభలక్షణములు గలవాడు. సామాన్యములును, విశేషములును అయిన ధర్మముల నెఱిగినవాడు, ప్రతిజ్ఞాపాలకుడు, సకలప్రాణులకు మేలు చేయుట యందు సదా ప్రీతి కలిగినవాడే కాక, దేవాసుర నరవానరులచే కీర్తింపబడువాడు, సకల విషయముల నెఱిగిన పవిత్రుడు, ఆశ్రితులకు అందుబాటులో నున్నవాడు, ఆశ్రిత శరణాగత రక్షణ నియమముగా గలవాడు. ఈతను బ్రహ్మదేవునితో సమానుడు, (శ్రీ మహావిష్ణువు వలె) లక్ష్మీయుక్తుడు, అఖండైశ్వర్య సంపన్నుడు, సమస్త ప్రపంచములను పోషించువాడు, ధర్మద్వేషులను సంహరించి స్వధర్మ మును రక్షించువాడు, వేదోక్త ధర్మములను చక్కగా కాపాడువాడు, క్షత్రియునిగా తనకు శాస్త్రము చేత విధింపబడిన ధర్మములను చక్కగా పాటించువాడు, తనకు ఆశ్రితులు, బంధువులు మొదలగువారి చేత ధర్మమును అనుష్ఠింపచేయువాడు. నాలుగు వేదములను ఆరు వేదాంగ ముల తత్వమెరంగిన బ్రహ్మ జ్ఞాని. ధనుర్వేదమేకాక ఇతర సకల శాస్త్రము లలో (గాంధర్వవేదము. ఆయుర్వేదము నందు కూడా) చక్కని విజ్ఞానము కలిగి. శాస్త్ర రహస్యములు చక్కగా తెలిసినవాడు. (అనగా సకలశాస్త్ర ములు వాని అర్థములు. పరమార్థములు చక్కగా ఎఱిగినవాడు). తనకు తెలిసిన విషయములందు ఏ మాత్రము ఏమారుపాటు లేక. మంచి సమయ స్ఫూర్తి. వివేకము. ప్రతిభ కలవాడు. ఎట్టి పరిస్థితుల యందును

నిశ్చియము చేసి "ధర్మమును" వీడక ధర్మము నందే వర్తించును. సకల జనప్రియుడు, సౌలభ్యశీలి, దైన్య రహితుడు. నదీ నదములచే సాగర మువలె, ఈ రాముడు ఎల్లప్పుడు సజ్జన సేవ్యుడు, పూజనీయుడు. ధార్మికత్వముచే అందరి యందు సముడు. ఎల్లప్పుడు మనోహరముగానే నుండు వాడు. కౌసల్యాదేవి తనయుడై ఆమెకు ఆనందమును వృద్ధి నందించుచూ, సముద్రమువలె గంభీరమైన స్వభావముతో, హిమవంతుని వలె స్థిరమైన ధైర్యము గలిగినవాడు. పరాక్రమమున ఈతడు విష్ణుదేవునితో సమానుడు. నిండు చంద్రుని వలె ఎల్లరకు చూచినంతనే అహ్లాదమును, ఆనందమును కలుగజేయువాడు. కోపమునందు, (అధర్మపరుల విషయంలో) ప్రళయకాలాగ్ని సమానుడు. క్షమించు విషయంలో (శరణాగతులను) భూదేవితో సమానమైన ఓర్పు కలవాడు. ధన విషయం (లేదా) త్యాగ విషయంలో కుబేరుని వంటివాడు, సత్య వాక్య పాలనమున సాక్ష్యాత్తు ధర్మ దేవతయే ఈతడు. మహారాజైన దశరధుడు తన పుత్రులలో పెద్దవాడును, పరాక్రమవంతుడునూ, తనకు ఇష్టుడును, ప్రజలకు శుభ ములు చేయుట యందు సదా ఆసక్తి కలవాడును అయిన సకల గుణాభి రామునికి ప్రజలకు క్షేమము కలిగించు కోరిక కలవాడై యౌవరాజ్య పట్టాభిషేకము చేయదలచెను". అని తెలిపెను.

ఇక ఈ కళ్యాణ గుణముల నిరూపణ ఎలా జరిగిందో చూతము.

సంగ్రహముగా చర్చించుకొన్న ఈ కళ్యాణ గుణములను 16 విధములుగా పేర్కొనవచ్చును. వీటిని 1.గుణవంతుడు 2. వీర్యవంతుడు 3.ధర్మజ్ఞుడు 4.కృతజ్ఞత 5.సత్యవాక్యపరిపాలకుడు 6.దృఢవ్రతుడు 7.చరిత్రకలగినవాడు 8.సర్వభూతహితుడు 9.విద్వాంసుడు 10.సమర్ధుడు 11.ఏకప్రియదర్శనుడు 12.ఆత్మవంతుడు 13.జితక్రోధుడు 14.ధ్యుతి మంతుడు 15.అనసూయుడు 16.రోషము వచ్చినచో దేవతలకు కూడా భయము కలిగించగలవాడుగా ఎంచుకొనవచ్చును. ఇక వీటి నిరూపణ ఎలా జరిగిందో పరిశీలింతము.

**1. గుణవంతుడు:-** ఇతరులచే మాటి మాటికి గుణింపబడి, స్మరింపబడి, సౌశీల్యము, అనురాగము, వాత్సల్యము గలిగిన వానిగా ఉండటమే "గుణవంతుల" లక్షణము. (సామాన్యముగా ఉన్నత పదవులందు ఉండువారు, తక్కువ స్థితిలో ఉన్నవారిని ఆదరముతో చూచుట అంత సులభముకాదు శ్రీకృష్ణుడు, కుచేలుని ఆదరింపగలిగెను. కానీ ద్రుపదుడు ద్రోణుని ఆదరింపలేక పోయెను). శ్రీరాముడు చక్రవర్తి పుత్రుడైనప్పటికీ, వన వాసములకు బయలు దేరునప్పుడు గంగాతీరమున నిషాధులకు అధిపతియై ఉన్న బోయరాజు "గుహుని" తన మిత్రునిగా, ప్రియునిగా భావించుట మరియు స్త్రీయైన "శబరి" చే పూజను గ్రహించుట ఇందుకు తార్కాణము.

**2. వీరత్వము:** శ్రీరాముడు అరణ్యవాస సమయంలో ఖరదూషణ త్రిశిరులను ముగ్గురు నాయకులతో కూడిన 14,000 మంది రాక్షసులను ఒకటిన్నర ముహూర్తములో (72 ని॥లలో) సంహరించెను. ఇది ఆయన వీరత్వమునకు నిదర్శనము.

**3.ధర్మజ్ఞుడు :** శాస్త్రవిహితములైన అలౌకిక సాధనములనే "ధర్మము" అందురు సాధారణములు, విశేషణములు అయిన ధర్మముల నెఱిగిన వాడు "ధర్మజ్ఞుడు" అనబడును. చిత్రకూటమున శ్రీరాముని, తిరిగి అయోధ్యకు రమ్మని పరిపరి విధముల భరతుడు, వశిష్టాదులు సైతము చెప్పిననూ ఆయన తిరిగి రాజ్యమునకు రాలేదు. తండ్రికి ఇచ్చిన మాటయే సమంజసమని, ధర్మమని గుర్తించెను.

**4.కృతజ్ఞత** తనకు ఇతరులు చేసిన ఉపకారము ఎంత చిన్నదైననూ, గొప్పగా భావించి జ్ఞప్తి యందుంచుకొనుటయే కృతజ్ఞత. జటాయువును చూచి మిగుల శోకించి అతనికి ఉత్తమ లోక ప్రాప్తి కలుగునట్లు ప్రేత కృత్యములను గావించుట, రావణ సంహారానంతరము ప్రత్యక్షమైన దేవతల ద్వారా యుద్ధములో మరణించిన వానరవీరులను తిరిగి బ్రతికించుమని కోరుట వారి యందు అతనికి గల కృతజ్ఞతను చూపుటయే.

**5. సత్య వాక్య పాలనము:** ఇవి రెండు విధములు. ఒకటి భూతార్ధకథనము. రెండు ప్రతిజ్ఞాపాలనము అని. సామాన్యముగా మానవులు తమకు జరిగిన అవమానకర విషయములను బహిర్గత పరుచుకొనరు. సుగ్రీవునితో సఖ్యము చేయునపుడు ఎటువంటి దాపరికము లేక మాయ లేడి వలన మోసపోవుట తమ అజాగ్రత్త వల్ల సీతాపహరణము జరుగుట ఆయన చెప్పెను. ఇది భూతార్ధకథనమునకు ఉదాహరణ. వాలి తన భార్యను అపహరించి తన్ను చంపగోరు తున్నాడని సుగీవుడు చెప్పగా ఆ వాలిని సంహరింతునని ప్రతిజ్ఞచేసి, ఒకే బాణముతో అటులనే వధించుట ప్రతిజ్ఞా పాలనమునకు ఒక నిదర్శనము.

**6.దృఢవ్రతుడు:** స్థిరమైన సంకల్పము కలిగివుండుటయే ఉత్తమ పురుష లక్షణము. ఆటంకములు ఎన్ని వచ్చినను, సంకల్పమును కొనసాగించుటను దృఢవ్రతత్వము అందురు. ఎందరు వారించి, అడ్డుపడిననూ వెనుకకు మరలక రాముడు వనవాసమునకు చనుట ఇందుకు నిదర్శనము.

**7. చరిత్రకలగినవాడు:** చరిత్రమనగా ఆచారము. తల్లి, తండ్రి, ఆచార్యుడు మొదలగువారు చెప్పినట్లు చేయుచు వారిని సేవించుటయే ఆచారము దశరధుడు కైకకు వరమిచ్చెనని నిర్దేశించుటవలన ఆమెకు ప్రియమును గావించుట కొరకు, తండ్రిమాట నిలుపుటకై, యువరాజుగా తాను పట్టాభిషిక్తుడగుటకు అర్హత కలిగి ఉన్ననూ, రాముడు అడవులకు వెళ్ళుట చరిత్ర కలిగివుండటమే.

**8.సర్వభూతహితుడు:** మిత్రులయందు, తటస్థులయందేకాక, శత్రువుల యందు కూడా సమమైన హితము లేదా మేలు చేయగలవారే సర్వ భూతహితులు. కబంధునికి దహన సంస్కారములు చేయుట, అతనికి దివ్యత్వము కలిగించుట శ్రీరాముని సర్వభూతహితమునకు తార్కాణము.

**9.విద్వాంసుడు:** విద్వాంసుడనగా ఆత్మ తత్త్వమెరిగిన వాడు. శ్రీరాముడు ఆత్మతత్త్వ మెరిగిన వాడగుటచే ఏదియు కోరకుండా (అకామ హతుడై), ప్రాప్తించిన రాజ్యమును సులభముగా వదలివేయగలిగినాడు. ఇంతేగాక

వేద, వేదాంగ, ధనుర్వేద శాస్త్రములను కూడా క్షుణంగా అభ్యసించిన వాడు. "సర్వమునశ్వరమని" శ్రీరాముడు అయోధ్యకాండలో 105 - 16వ శ్లోకము నుండి 105 -31 వరకు చేసిన తాత్వికచింతననే ఇందుకు నిదర్శనములు.

**10.సమర్థుడు:** రాముడు సర్వకార్యములను చక్కగా నెఱపగలవాడు. చిన్నతనముననే తండ్రి ఆజ్ఞ మేరకు విశ్వామిత్ర మహర్షి వెంటచని అసుర సంహారము చేసి యాగరక్షణ కార్యమును నిర్వర్తించుట, వారధి కట్టుటకై సముద్రుని శాంతింపచేయుట ఇందుకు నిదర్శనములు.

**11.ఏకప్రియందర్శనుడు:** నారద మహర్షి శ్రీరాముని సౌందర్య లక్షణములనన్నిటినీ చెప్పి, లక్ష్మీవంతుడు, శుభలక్షణుడు అను విశేషముల చేత శీల సౌందర్యమును కూడా సూచించెను. అందుకే "సోమవత్ప్రియదర్శనః" అని చెప్పినాడు. భూతదయగలిగిన మహా పురుషుల చూపులతో ప్రేమ తరంగములు ప్రసరించుచుండును. ఆంజనేయస్వామి వారు కూడా స్వామి శుభలక్షణములను సాముద్రిక శాస్త్ర పరంగా సుందరకాండలో వర్ణించినారు. కనుక రాముడే ఏక ప్రియదర్శుడనుటలో సందేహము లేదు.

**12.ఆత్మవంతుడు:** ఆత్మవంతుడనగా ఆత్మ విశ్వాసము (లేదా) ఆత్మస్థైర్యము కలిగివుండుట అని అర్థము. దండకారణ్యమున ఋషులు రాక్షసులవలన తమకు కలుగుచున్న బాధలు చెప్పుకొనిరి. రాముడు వారెంత మందియున్నారో, వారెంత బలము కలవారో మొదలగు సందేహములు లేశ మాత్రము కూడా లేకుండా వారినందరిని సంహరించె దనని ప్రతిజ్ఞచేసి అటులనే సంహరించెను. ఇది అతని ఆత్మ విశ్వాసము నకు తార్కాణము.

**13.జితక్రోధుడు:** క్రోధమును జయించుటయే జిత క్రోధము అనబడును. అనగా కోపమును వశములో వుంచుకొనుట. తల్లి, తండ్రి, ఆచార్యు లయెడ ఏ సందర్భమునందును కోపమురాకుండుట జిత క్రోధత్వమునకు ముఖ్య లక్షణము. అరణ్యావాసమునకు తను వెళ్ళవలసినప్పుడు అందరూ

కైకమ్మను దూషించిరి. శ్రీరాముడు ఆమెపై లేశమాత్రమైననూ కోపగించక ప్రియము కలిగించుటకే ప్రయత్నించెను. కైకమ్మతో రాముడిట్లనెను "తల్లీ! రాజునకు అభీష్టమేదియో తెలుపుము. దానిని తప్పక ఆచరింతునని ప్రతిజ్ఞ చేయుచున్నాను. రాముడెన్నడునూ రెండు తీరుల మాటలాడడు".

**14.ధ్యుతిమంతుడు:** ధ్యుతిమంతుడనగా మంచి వర్చస్సు (కాంతిమంతం) కలవాడని అర్థము. దుర్జనులకు వెఱపు, సుజనులకు అభయమును కలిగించునట్టి తేజమే వర్చస్సు. రాముని పరాక్రమమును విని తెలిసికొన రావణుడు భయపడి "ఈతను సాక్షాత్తు విష్ణుదేవుడే, అప్రమత్తులై ల. ంను రక్షించుడు" అని రాక్షస వీరులకు యుద్ధకాండలో తెలిపెను. విభీషణుడు రామ శరణార్థియై సురక్షితముగా ఉండగల్గెను.

**15.అనసూయుడు:** అనసూయుడనగా, అసూయ లేనివాడని అర్థము. ఇతరుల గుణములందు ఎట్టి ఆరోపణలు చేయకుండుట దోషము లెంచకుండుటయే అనసూయత్వము. ఎన్నియో లోపములున్న వాలిని గూర్చి గానీ, రావణుని గూర్చిగానీ రాముడెప్పుడు నిందింపకుండుట ఇందుకు నిదర్శనము.

**16. రోషము కలిగినచో దేవతలు కూడా భయపడుట:** రాముడుడొక్కడే ఖరదూషత్రిశిరులను 14,000 మంది రాక్షసులను 72 ని॥షాలలో సంహరించెనని విన్న రావణుడు భయపడి మారీచ ప్రయోగముచే సీత నపహరించెను. ఎట్టిరావణుని చూచి దేవతలు భయపడిరో అట్టి రావణుడు రాముని గురించి విని భయపడెను కనుకనే, నేరుగా రాముని ఎదుర్కొనలేదు.

ఇట్లు ఈ పై గుణములను వాల్మీకి రామాయణములోని మరిన్ని విశేష ఉదాహరణలతోనూ నిరూపించవచ్చును. ఇది వేదసమ్మితత్త్వం.

# శ్రీరాముని ఆనందతత్త్వము:

అకామహతుడైన (కోరికలు లేక) శ్రోత్రియునకు (శ్రుతులను ఆచరించువానికి) ''ఆత్మసాక్షాత్కార రూపమైన బ్రహ్మానందము'' లభించునని శ్రుతి చెప్పుచున్నది. బ్రహ్మానందమెట్టిదియో తైత్తిరియ మునందు ''ఆనందవల్లి'' యందు వర్ణించబడినది. దీనిలో మొట్ట మొదటిది మానుషానందము.

అంతకు నూరు రెట్లుగా మానుష గంధర్వానందము.

అంతకు నూరు రెట్లుగా దేవ గంధర్వుల ఆనందము.

అంతకు నూరు రెట్లుగా ఆజాన దేవతల ఆనందము (స్వర్గము నందే పుట్టినవారు).

అంతకు నూరు రెట్లుగా కర్మదేవతల ఆనందము (యజ్ఞ యాగాది కర్మల నొనర్చి స్వర్గమునకు పోవువారు).

అంతకు నూరు రెట్లుగా హవిర్భుజులైన దేవతలు (వీరు 33 మంది శ్రేష్ఠమైన దేవతలు. 8 మంది వసువులు, 11 మంది రుద్రులు, 12 మంది ఆదిత్యులు, ఇంద్రుడు, ప్రజాపతి).

వీరికి నూరు రెట్లు ఇంద్రుని ఆనందము.

దీనికి నూరు రెట్లు బృహస్పతి యొక్క ఆనందము.

అంతకు నూరు రెట్లు ప్రజాపతి ఆనందము.

అంతకు నూరు రెట్లు హిరణ్యగర్భుని ఆనందము:.

తుదకు ఈ ''హిరణ్యగర్భుని ఆనందము'' కూడా అకామహతుడైన శ్రోతియుని ఆనందము నందు లేశ మాత్రమే యని చెప్పబడినది. మానుషానందము అనిన కళ్యాణ గుణగణములు కలవాడైన బలిష్ఠమైన యువకునకు చక్రవర్తిగా ఈ భూమియంతము ఒక్కసారిగా లభించిన కలుగు ఆనందము.

పైన తెలుపబడిన ప్రతి ఆనందములలో ప్రతి చోట ఈ ఆనందము అకామహతుడైన శ్రోత్రియునకు అని వ్రాసి ఉన్నది.

శ్రీరాముడు సకల కళ్యాణ నిధియై ఎన్నో కష్టముకోర్చి, తత్త్వజ్ఞాన పరుడై, వాలి, రావణాధి బలవంతులను సంహరించి నిత్యయౌవనుడై 11,000 సం॥లు రాజ్య పాలన చేసి మాహదానందము నొందెను. తాను రాజ్యము కొఱకు ఏనాడూ కాంక్ష కలిగి ఉండక అకామత్వముతో నుండినాడు. సర్వదేవతలలో శ్రేష్ఠుడైన హిరణ్యగర్భుడును, బ్రహ్మ దేవుడును శ్రీరాముని రావణ సంహారానంతరము స్తుతించి పూజించిర నుట స్పష్టము. దీని వలన శ్రీరామునకు కలిగిన సంప్రహర్షము హిరణ్య గర్భుని ఆనందమునకు మించినదై వుండవలెను.

శ్రీరాముడు సీత కొరకు, జటాయువు కొరకు ఎంతగా విలపించి నట్లనిపించిననూ, అవి కేవలము తాత్కాలికము మరియు ఇవి ధర్మ, దాక్షిణ్యముల చేత మాత్రమే అని తెలిసికొనవలెను. ఇది మహా పురుషులకు సహజగుణము. దీనివలన వీరి జ్ఞానమునకు గానీ, గొప్ప తనమునకు గానీ ఎటువంటి భంగము కలుగదు. పదునాలుగేళ్ళ వన వాసమునకు వెళ్ళునప్పుడు భార్యను వెంటగొనిపోవలెనని ఆయన తలంపలేదు. ఆమెయే అతనిని ఎంతో బలవంతపెట్టి బయలుదేరినది. ఊర్మిళా స్మరణయే లేకుండా లక్ష్మణుడుండగా శ్రీరాములవారు ఉండ లేరా?

ఇలా శ్రీరాములవారి ఆనందతత్త్వము అనిర్వచనీయము.

"<u>శ్రీరామ రాజ్యం</u>":

శ్రీరాముడు అరణ్యావాసానికి వెళ్ళినప్పటి నుంచి తిరిగి వచ్చు వరకు దుఃఖ సముద్రంలో మునిగి చిక్కి శల్యమైన ప్రజలు శ్రీరామ సందర్శనముతో తిరిగి ఆనందోత్సాహముతో పుష్టిని పొంది, సుఖించిరి. ప్రజలందరూ ధర్మాచరణతత్పరులై మనోవ్యధగానీ, శారీరకమైన వ్యాధి కాని లేక కరువు కాటకములు భయము లేక సుఖించిరి. జనులెవ్వరూ తమ కుమారులు మరణించగా చూడలేదు. అంటే పూర్ణాయుస్సు కలిగి వుండిరి. స్త్రీలెల్లరు వైధవ్యము లేక పతివ్రతలైయుండిరి. అగ్ని వలన,

గాలి, ఇత్యాది వాటి వలన కలుగు భయము లేకుండిరి. అనగా ప్రకృతి వైపరీత్యములు లేకుండిరి. పురములు, దేశములు ధనధాన్యములతో పుష్కరములుగా నుండినవి. కృతయుగములో వలె ప్రజలు నిత్య సంతుష్టులై యుండిరి. ఆకలి వలనగానీ, చోరుల వలన గానీ భయము లేకుండిరి. శ్రీరాముడు వందలకొలది అశ్వమేధయాగములను చేసి, అందు భూరి సువర్ణ దక్షిణలొసగి, పదివేలకోట్లు గోవులను మరియు అసంఖ్యాకమగు ధనమును బ్రాహ్మణులకొసగి గొప్ప కీర్తినొందెను. ప్రతి రాజవంశీయునకు రాజ్యములను ఇచ్చి రాజవంశములను ఉద్ధరించి, చాతుర్వర్ణములవారు వారి వారి ధర్మములను అనుసరించు చున్నట్లునూ పదునొకండువేలయేండ్లు రాజ్యము చేసి, శ్రీరాముడు వైకుంఠమున కేగెను."



# హనుమంతుని భక్తి

శ్రీరాముడు మొట్టమొదటిగా కిష్కిందకాండలో లక్ష్మణునితో హనుమంతుని గూర్చి (సుగ్రీవమైత్రికి వచ్చినప్పుడు) ఈవిధంగా ప్రస్తావించారు.

(వాల్మీకి రామాయణం శ్లో 3 - 28 నుంచి 3 - 35 వరకు)

"లక్ష్మణా! నాలుగు వేదములు, క్షుణంగా అభ్యసించిన వానికే ఇట్లు మాట్లాడుట వీలగును. ఈతను (ఆంజనేయులవారు) వ్యాకరణ శాస్త్రమును పలుసార్లు చదివిన కారణంగానే భాషించునప్పుడు ఒక అపశబ్దమైననూ లేకుండగా, ముఖమందునూ, కన్నులందు గానీ, కనుబొమ లందుగానీ, లలాటమున గానీ వేరొక అవయవములందుగానీ ఎట్టి దోషమునూ కానరాదు. ఈతని వాక్కు అతి విస్తరము లేక, పద, వర్ణాది సందేహములు లేక, మిగుల నిదానము గాక అట్లయ్యు వేగవంతముగాక మంద్రమై, మధ్యమమై, (అట్లు పెద్ద స్వరముకాక చిన్న స్వరముకాక) ఉన్నది. ఈతని వాక్య ఉచ్చారణము మనోజ్ఞమై యున్నది. అద్భుతమైన ఈ వాక్కు వధింపబూనిన వాని చిత్తమునైననూ రంజింపచేసి మార్చి వేయగలదు. ఈ వాక్కు వక్షః కంఠ శిరస్సు లనెడి మూడు స్థానములచే వ్యక్తీకరింపబడుచున్నది. ఇట్టివారు లేకుండా ఏ ప్రభువుకూ కార్య సిద్ధికలుగదు. పైగా ఇట్టివారు దూతలుగా నున్న ప్రభువులకు అన్ని కార్యములు వీరి వాక్య వ్యవహారము వలననే సిద్ధించగలదు సాక్షాత్తూ శ్రీరాములవారే ఇలా ప్రశంసించారు.

ఇది ఎంత గొప్ప పొగడ్త. ఆ తరువాత సీతాన్వేషణ సమయం వరకు రాములవారు హనుమంతుని గూర్చి గానీ, హనుమంతునితో గానీ మాట్లాడినట్లు కన్పడదు. ఆ తరువాత కొన్ని నెలలకు సీతాన్వేషణ సమయంలో సుగ్రీవుడు, జాంబవంతుడూ హనుమంతుని "ధీమంతుడవు, ధీరుడవు, దేశకాలజ్ఞానివి, సీతను చూసిరాగలవాడవు నీవే" అని పొగుడ్తున్నప్పుడు శ్రీరాములవారు తన అంగుళీయకాన్ని హనుమంతుని కి ఇస్తూ "ఈ అనవాలు చూపిస్తే, జానకి నీ మాటలు నమ్ముతుంది. నీ

వల్లనే ఈ కార్యం ఫలిస్తుందని సుగ్రీవుడు చెప్పగా విన్నాను. స్థిర సంకల్పం, వీరత్వం వున్న నీ వల్లనే ఈ కార్యం ఫలించగలదు. సీతను చూసి సుఖంగా తిరిగి రా " అని అన్నారు.

ఈ మధ్య కాలంలో తన ప్రస్తావన స్వామి చేయకపోయినప్పటికీ హనుమంతుడు ఏనాడు స్వామి తనను పిలువలేదని, ఎన్నడూ మాట్లాడలేదనీ బాధపడలేదు. కేవలం "సేవాధర్మ" పరాయణుడై స్వామి మాటల్నే తనకు ఆశీర్వాదంగా భావిస్తూ, మౌనంగా కర్తవ్య నిర్వాహకుడైనాడు. ఇతర వానవీరులలో "ద్వేషభావం" కలిగే ఆస్కారం లేకుండా రాములవారు ఇలా చాలా కాలం తర్వాత మాత్రమే తనతో మాట్లాడారని అర్థంచేసికొనిన స్వామిభక్తి ఆయనది.

సీతాన్వేషణ సమయంలో అమ్మవారిని కనుగొనలేకపోయిన చింతలో అశోకవనం వద్ద ఆంజనేయస్వామి వారు మిగుల చింతక్రాంతులై ఒక్కసారి ధ్యాననిమగ్నుడై రాములవారిని ఈ విధంగా ప్రార్థించారు.

"నమోస్తు రామాయ సలక్ష్మణాయ
దేవ్యైచ తస్యై జనకాత్మాజాయై ॥
నమోస్తు రుద్రేంద్ర యమానిలేభ్యో
నమోస్తు చంద్రార్క మరుద్గణేభ్యః॥"

పై శ్లోకాన్ని గమనిస్తే స్వామివారు రామభక్త దురంధరులైయ్యూ, ఇంద్ర, రుద్ర, యమ, చంద్ర, అగ్ని, వాయు ఇత్యాది ఇతర దేవతలను కూడా తన అభీష్ట దేవుని ప్రార్ధన అయిన శ్రీరాములవారుతో సమానంగా అర్చించటంలో ఇష్ట-దేవతరాధనతో పాటు ఇతర దేవతారాధన కూడా భక్తుడికి ఉండవలెనని తెలియజేయటమే.

సీతాన్వేషణ పిదప సీతను చూచివచ్చి, లంకను కాల్చివచ్చి, అక్కడి యుద్ధంలో తాను చంపిన రాక్షసుల వివరాలు, మిగతా వానర వీరులతో (సుగ్రీవుడు, అంగదుడు, జాంబవంతుడు ఇత్యాది వారితో) వివరంగా గొప్పగా చెప్పిన హనుమంతుడు, మీలో ఎవరు సీతను దర్శించినారు? అన్న రామచంద్రుని ప్రశ్నకు సమాధానంగా తన కార్యశూరత్వంలో

రాక్షసులను ఏ విధంగా చంపినది, ఇతరత్రా చెప్పక కేవలం సీతమ్మవారి పరిస్థితిని మాత్రమే వర్ణించి, ముద్రికను స్వామికి ఇచ్చినారు. అంటే తమకంటే గొప్పవారి వద్ద, అధికారుల వద్ద, తన ఘనకార్యాల గురించి చెప్పరాదని అతని సందేశం. ఇది కూడా వినయంతో కూడిన భక్తికి ఉదాహరణ. హనుమంతుని మాటలు విన్న స్వామి అతనికి ఆప్యాయంగా కౌగిలించుకొన్నాడు. ఎంతటి భాగ్యం! భక్తునికి ఇంతకన్నా ఏమికావాలి?

యుద్ధకాండమందు విభీషణుడు శ్రీరాముని శరణు వేడుటకు వచ్చినప్పుడు సుగ్రీవుడు సైతం అతనిని అనుమానించెను. కానీ హనుమంతుడు ఇట్లనెను. "శ్రీరామా! ఈ విభీషణుడు రావణ సంహారార్థమై నీవు చేయు ప్రయత్నమును యెఱిగి, (అతని దురాచారములకు వెఱసి) వాలివధయూ, సుగ్రీవుని రాజ్యాభిషేకము విని, రాజ్యమును కోరుచున్న వాడై, బుద్ధి పూర్వకముగా నీ ముందుకు శరణు కోరి వచ్చి ఉన్నాడని" యెఱింగించుట ద్వారా సాటి భక్తులను కనుగొని, ఎటుల గౌరవించవలెనో, తెలియపరచుచున్నారు. తులసీదాసు వారు శ్రీరామదర్శనార్థమై ముందుగా శ్రీ హనుమంతులవారిని సేవించారన్నది లోకమెరిగిన విషయమే! అంటే శ్రీరాములవారు హనుమంత స్వామి ద్వారా చాలా సులభముగా ప్రసన్నమవుతారన్న మాట! మరి హనుమంతులవారు ప్రసన్నం కావలంటే ఏమిచేయవలె?---- రామనామం జపించాలి. అందుకే -----.

"యత్ర యత్ర రఘునాథకీర్తనం
తత్ర తత్ర కృత మస్తకాంజలీం!
భాష్పవారి పరిపూర్ణ లోచనం,
మారుతిం నమత రాక్షసాంతకం॥"--- అని అన్నారు.

రామభక్తి పరాయణుడైన స్వామి ముందు ఆయన భక్తిని పూర్తిగా చర్చించలేము, కాని ఆయనను భక్తితో ఇలా "శ్రీరామచంద్ర హనుమా!" అని కొనియాడుదాం.

# "శ్రీరామ చంద్రహనుమా"

మంగళమారుతి నామా హనుమా!
అరిభంజన వీరహనుమా!
కరుణాసాగర కామితార్థ
శ్రీరామ చంద్ర హనుమా!
జయ రామ చంద్ర హనుమా! ॥ మంగళ ॥
భవభయ భంజన హనుమా!
శివమయ రూప హనుమా!
సంకటహరణా రామ రసామృత
పానవీర హనుమా! ॥ మంగళ ॥
శ్రీవాయుపుత్ర హనుమా!
నిజబాహు బలాన్విత హనుమా!
సుజన జనావన భక్త పోషక
రామచంద్ర హనుమా!
జయ రామచంద్ర హనుమా! ॥ మంగళ ॥
పాపవిమోచన హనుమా!
ఘన శాపవిమోచన ధామా!
తామసగుణ గణ భంజన నామా!
రామచంద్ర హనుమా!
జయ రామచంద్ర హనుమా! ॥ మంగళ ॥
అంజని ప్రియసుత హనుమా!
ఆశ్రిత వత్సల హనుమా!
మోహన రూప మోక్షదాయక
రామచంద్ర హనుమా!
జయ రామచంద్ర హనుమా! ॥ మంగళ ॥

పై గీతమును
భక్తితో సమర్పించినవారు
తిరుమంద్యం వీరేశ్వరయ్య
టీచర్, ఎస్.టి.వి. నగర్, తిరుపతి.

# శ్రీ వేంకటేశ్వర దివ్యతత్త్వ వైభవము

సర్వాంతర్యామియగు పరమేశ్వరుని లీలలు అనంతములు. ఆ పరమాత్ముఁడు ద్వంద్వాతీతుఁడయ్యును, సగుణ నిర్గుణ రూపముల భక్తజనులకు, జ్ఞాని పుంగవులకు పూజనీయుఁడును ధ్యేయుఁడు నగుచున్నాఁడు. ఈ సగుణ నిర్గుణోపాసనముల మేలుకీళ్లను గూర్చిన చర్చగాని, చింతగాని అనవసరము. భక్తులకును, జ్ఞానులకును తుది గమ్యము సాయుజ్యమే గావున వారవలంబించు మార్గములను గూర్చిన తారతమ్య పరీక్ష- రుచ్యములగు రెండు మధుర పదార్థముల శ్రేష్ఠత్వ నిర్ణయమునకై కేవల వాదోపవాదములతో ప్రొద్దుపుచ్చుకొనుట వంటిది. కొందఱొక పదార్థమున కాశించిన, మఱికొందఱు మఱియొక పదార్థము నభిలషింతురు; వారి అభిరుచిభేదమే వారి యెన్నిక కాధారమైనట్లు భావించి, ఆ విషయమున వాదమునకు దిగక యూరుకుండుట లెస్స. ఇందు కుదాహరణముగ నొక లౌకిక విషయమును బేర్కొనవచ్చును. ముఖ్యమూల పదార్థములగు సెనగ పిండి, నెయ్యి, పంచదార మున్నగునవి సమానమైనను, పొందగోరువారి కాంక్షను బట్టి యొకటి లడ్డు రూపముగను, మఱియొకటి మైసూరుపాకుగను నేర్పడుచున్నవి. ఇటులే భక్తుల మనోభిలాషను, చిత్త సంస్కార సంకల్పములను అనుసరించి విరాడ్రూపుఁడు అగు ఆ విశ్వమూర్తి ఆయా అర్చావతారమున సాక్షాత్కరించి, వారి వేడికోలులననుగ్రహించి, ఆనందడోలికల నూగించుచున్నాఁడు.

ఇట్టి విరాడ్మూర్తియే తిరుమల యను శేషాచలముపై వేంచేసియున్న వేంకటేశ్వరస్వామియని ఆధ్యాత్మిక విదుల పలువురి ఆత్మవిశ్వాసము.

శివుఁడో, కేశవుఁడో ముగురు మూర్తుల మూలశక్తియో మఱేదియో ఇదమిత్థమని నిశ్చయింపరాని అచింత్యాద్భుత నిగూఢ తత్త్వముతో భాసించు శ్రీవేంకటేశ్వర దివ్యతత్త్వమునకు వినమ్ర భక్తి భావముతో సహ ప్రాథిక సాష్టాంగ నమస్కారములు సమర్పించుటగాక, అల్పాత్యల్ప కీటక

సదృశుఁడు గావింపఁదగిన కార్యమేమి గలదు.

కాని యోగిపుంగవులు, ఆధ్యాత్మిక సంపన్నులు, తమ చిరకాల సాధనానుభవముల మూలముగ నుగ్గడించిన శ్రీవేంకటేశ్వర తత్త్వము నొకపరిచిత్త వీధిని స్మరించుట పరమ పుణ్యప్రదమను ప్రపూజ్యభావముతో ఈ కార్యమునకు దొరకొనుచున్న నాచాపల్యమును మన్నింప సహృదయు ల నభ్యర్థించుచున్నాను.

శ్రీ వేంకటేశ్వరస్వామికి ఆవాసమైనయిప్పటి తిరుమలకే వేంకటా చలము అను నామము పురాణములందు ప్రసిద్ధమైయున్నది. ఆది శేష వాయుదేవులకు బలశాలిత్వ విషయమున నొకప్పుడు స్పర్థ (పోటీ) కలిగెనట! మేరుపర్వత పుత్రుఁడగు వేంకట నామక శైలమును ఆదిశేషుఁ డు చుట్టి పెనవైచుకొనియుండెననియు, మహాబలుఁడగు వాయుదేవుఁ డు తననామము అర్థవంతమగునటుల ఆసర్పాచలముల రెంటిని పై కెగురగొట్టి, యిందు పడవైచెననియు, నాటినుండి యిది శేషగిరి, వేంకటా చల నామముల ప్రసిద్ధమయ్యెనని తెలియుచున్నది.

భృగు మహర్షి పాదతాడన పరిభవమునకు కినిసి, ఇందిరా రమణి విచారముతో తన నాథుఁడుగు విష్ణుమూర్తి హృదయ పద్మమును వీఁడి భూలోకమున కరుదెంచెను.

లక్ష్మీవిరహకారణమున విరక్తుఁడైన విష్ణుమూర్తి యీ వేంకటా చలమునకు చనుదెంచి, తపోవృత్తితో నొప్పుచుండెను: వల్మీక గతుఁ డైయున్న ఆజగత్ప్రభుని వక్త్రమున గోరూపమైన బ్రహ్మదేవుఁడు అనుదినము నిజక్షీరము కురియించి, ధన్యుఁడగుచుండెను: గొల్లని దౌష్ట్యమునకు గుఱికానున్న గోవును రక్షించు ప్రయత్నమున హరి గొడ్డలి వ్రేటును చవిచూడవలసిన వాఁడయ్యె. ఈ అత్యాచారమూలముగ ఆ దివ్యపురుషుని పొలకువ ఆకాశరాజునకు అవగతమయ్యెను. క్రమముగా తన పెంపుడు తల్లియగు వకుళమాలిక ప్రయాసమూలముగను, స్వయ ముగ ఎఱుకసాని రూపమున. ఆకాశరాజు అంతఃపురమున కొనసాగించిన సోదె ఫలితముగను. శ్రీమన్నారాయణమూర్తి పద్మావతీ రాజపుత్రి తోడి

వివాహవైభవము చూఱగొనెను. "శ్రీవేంకటేశ్వరమహాత్మ్య" పురాణ అంతర్గతమగు పద్మావతీ పరిణయోత్సవ గాథ యిది.

ఈ వేంకటేశనామమందలి వేంకటశబ్ద అంతరార్థము పై పురాణమున రెండు విధములుగా వివరింపబడినది. అందు శాశ్వత ఆనందమను నదొకటి. వేంకట శబ్దమునకు పాపహర (దహన) మనునది అర్థాంతరము. ఈ పురాణోక్తములగు నంతరార్థముల ననుసరించి స్వామి శాశ్వతానంద ప్రదాతయనియు, పాప విచ్ఛేదియైన పుణ్యసంధాతయనియు తేటతెల్లమగుచున్నది.

పుణ్యభూమియని వాసికెక్కిన మన భారతదేశమున పవిత్రనదీ తీరములు, ప్రశాంత పర్వతారణ్య సీమలు దివ్యదేవతావాసములై భక్తులపాలిటి ముక్తిక్షేత్రములై వెలయుచున్నవి. ఈగిరి, స్వామికి నిలయమై యెన్ని వేలయేండ్లు గడచినవో యెవ్వరి యూహకు అందరా కున్నది. ఋషీమూలము, నదీమూలము అవిజ్ఞాతములని ఆర్యుల అభియుక్తి. కావుననే తదితరములగు కొలది దేవతా మూర్తుల వలెనే యీ వేంకటేశ విరాడ్మూర్తియు స్వయంభవ స్వరూపమేయని ఆస్తిక మహాజనుల పరమ విశ్వాసము.

శుక్రవార అభిషేకకాలమందలి స్వామి స్వరూపమును దర్శింప ఆ మూర్తి శివకేశవ సమాహారమూర్తి యని ప్రస్ఫుటమగును.

స్వామి దివ్యపాదద్వయము గోచరింపక, భూ నిక్షిప్తమైయుండుటచే అతఁడు శివస్వరూపుఁడనిపించును.

కాని పాదసన్నిధి నొప్పు అమృత తరంగిణియని వాసిగాంచిన విరజా నదీ ప్రవాహ ప్రామాణ్యముచే స్వామి వైకుంఠవాసిత్వము రూఢియగును.

నాగాభరణాలంకృతమగు స్వామి స్వరూపము శివత్వమును సూచింప, వక్షస్థలమందలి శ్రీవత్సలాంఛనము విష్ణుత్వమును నిరూపించును.

మౌళియందలి జటాసందోహము శైవస్వరూపమును చూపుచుండ, కిరీటము మహావిష్ణుత్వమును స్థిరపఱచును.

ఇట్టి హరిహరాత్మకమైన స్వామి దివ్యస్వరూపమును దర్శించు భక్తసమూహము తమతమ భేదభావములను మఱచి, ఆనందతన్మయులై తరించుటలో విప్రతిపత్తిలేదు.

ఈ వేంకటాచలమునకే శ్రీశైలమను నామాంతరము గలదు. అనగా నిది శ్రీచక్రస్వరూపిణియైన బాలాత్రిపురసుందరీ నిలయమని ఔత్తరాహుల విశ్వాసము. దేవ్యారాధకులగు వంగాది యుత్తరదేశస్థులు "బాలాజీ" అను నామముతో నీమూర్తినర్చింపనేతెంచుచుందురు.

స్త్రీజనోచితమగు శుక్రవారపు పసుపుతీర్థస్నానమును, దేవీశరన్నవ రాత్రములందు నిర్వహింపఁబడు (ముఖ్య) బ్రహ్మోత్సవ క్రమమును, తిరుప్పావడయను బలికుంభ అన్న సమర్పణమును, దేవాలయ ప్రాకార కుడ్య ఉపరిభాగములందు సుప్రతిష్ఠితములై యున్న సింహప్రతిమలును, బాలాదేవీమూర్తి మత్త్వమునకు ప్రధానతార్కాణ ములు కానోపును.

"ఆనందనిలయ" మను స్థారకస్వర్ణమయ గోపురవిమానపు నీడ నిలిచి, విశ్వమయుఁడై, విశ్వప్రభుఁడై, విరాజిల్లు శ్రీ వేంకటేశ్వరస్వామిని అఖిలాండ కోటి బ్రహ్మాండనాయకుఁడని భక్తులు వినుతించుటలో ఆవంతయు అత్యుక్తిలేదు.

శ్రీవేంకటేశ్వరునకు సప్తగిరీశుఁడును నామము ప్రసిద్ధమైయున్నది. మూలాధారాది షట్చక్రముల కతీతమైన సహస్రార (సహస్రదళపద్మము) నిష్ఠితుఁడైన పరమాత్ముఁడీ దివ్యమూర్తియను సాంకేతిక యోగ రహస్య మిందిమిడియున్నది.

శివ, శక్తి, కేశవ స్వరూపములేగాక తదతీతములగు పెక్కు ప్రశస్త అర్చాంశలతో భాసిల్లు శ్రీవేంకటేశ్వరస్వామి తురీయమూర్తియే ఏనామము న, ఏ రూపమున ఆరాధింపఁబడినను భక్తకోటికి చతుర్విధ పురుషార్థము లను అనుగ్రహించుచు, కలియుగవైకుంఠమున నిత్యకల్యాణము పచ్చతోరణములతో దివ్య మంగళ స్వరూపముతో నొప్పునెల్లర యిలవేల్పు గు ఆ దేవదేవుని ప్రణామ సహస్రములతో పూర్వభక్తకవికృత ఆత్మసమర్పణ

వచనరూప సంకీర్తనలతో వినుతించుచున్నాను.

"శ్రీవేంకటగిరి దేవా!
నాదేహంబు నీవుండెడి
నిత్యనావాసంబు!
నాజ్ఞాన విజ్ఞానంబులు
నీయుభయపార్శ్వంబుల దీపంబులు!
నాముకుఁ జెఱమల
యూర్పులు నీయిరుదెసలంబట్టెడి యాల వట్టంబులు!
నామనోరాగంబు నీకుఁ జెంద్రకావి వలువ!
నీకు మ్రొక్కు నెత్తిన
నాచేతులు రెండును మకరతోరణంబులు!
నా భక్తియే నీకు సింహాసనంబు

*          *          *

నీవు దేవుండవు - నేనర్చకుండను
ఈ రీతినిత్యోత్సవంబు నాయందు
నవధరింపవే శ్రీ వేంకటేశ్వరా!

"తాళ్లపాక పెదతిరుమలాచార్యుఁడు"
(శ్రీ వేంకటేశ్వర వచనములు)



# సన్నిధి వీథిలోని రాతి ధ్వజస్తంభము నందలి శిల్పములు



చతుర్భుజుడైన శ్రీ కృష్ణుడు



శ్రీవారి గరుడసేవ



గజేంద్రమోక్ష ఘట్టం



శ్రీవేంకటేశ్వరస్వామి వారు



పుత్ర కామేష్ఠి యాగం - అగ్ని దేవుడు ఇచ్చిన పాయసం కౌసల్య, సుమిత్ర, కైకేయిలు



అహల్యా శాపవిమోచనం



సీతారామకళ్యాణం



ఏడు తాటి చెట్లను శ్రీరాముడు ఒకే బాణముతో చేధించుట.



వాలి వధ - శ్రీరాముడు హనుమంతునికి అంగుళీయకము ఇచ్చుట.



సుందరకాండ ఘట్టములు

శ్రీరాముని పట్టాభిషేక దృశ్యము



వాహన మండపము వెనుక, రథమండపము గోడ దిగువ వున్న రామాయణ ఘట్టముల శిల్పచిత్రములు

# శ్రీవారి నిత్యోత్సవ, వారోత్సవ, నక్షత్రోత్సవ, అయనోత్సవ, సంవత్సరోత్సవ ఇతర విశేష ఉత్సవములు

## 1. శ్రీవారి బ్రహ్మోత్సవములు :-

శ్రీ వైఖానస ఆగమ శాస్త్ర ప్రకారము నిర్వహించబడుచున్న శ్రీకోదండరాములవారి బ్రహ్మోత్సవములు "పంగుణి బ్రహ్మోత్సవములు" గా పిలువబడుతున్నాయి. ఉత్సవముల క్రమం ఈ దిగువ కనపరచిన వరుసలో ఉంటాయి.

ముందుగా కోయిల్ అళ్వార్ తిరుమజనం, అంకురార్పణ, సేనాధిపతి ఉత్సవం, వేదప్రబంధ అధ్యయనం జరుగుతాయి.

మొట్ట మొదటి రోజు "ధ్వజారోహణం" మొదలుకొని 9వ రోజు "ధ్వజ అవరోహణం" వరకు నవాహ్నికముగా జరుగును. ఇవి పాల్గుణ మాసం (తమిళ్ పంగుణి) మృగశిర అవరోహణం (చక్రసాన్నం) లో జరుగును. బ్రహ్మోత్సవములు తిరుమలలో వలె జరుగును. ఆంగ్ల సంవత్సరాది ప్రకారము ఈ బ్రహ్మోత్సవములు సామాన్యంగా మార్చి లేదా ఏప్రిల్ నెలల్లో జరుగును.

## కోయిల్ ఆళ్వార్ తిరుమంజనం :-

బ్రహ్మోత్సవములకు ముందుగా శ్రీ కోదండరామస్వామి వారి సన్నిధిని శుద్ధి చేసి, పరిమళ ద్రవ్యాలతో, సన్నిధినంతా కూడా సుగంధభరితం చేస్తారు. ఆ పరిమళ ద్రవ్యాలలో కర్పూరం, పసుపు, కుంకుమ, సాంబ్రాణి, తెల్లనామం (నామంకోపులు), చందనం, కిచ్చిలిగడ్డ, పచ్చాకు మిశ్రమం చేసి కలిపి గర్భగుడి గోడలకు పూస్తారు. దీని తర్వాత అర్చకులకు బహుమానం జరుగుతుంది. ఈ బహుమానంలో స్వామివారికి కప్పినటువంటి వస్త్రములు (తెల్లటి 4 మూర పంచలు) బహుకరించ బడతాయి. (ఈ వస్త్రములు స్వామివారి సన్నిధిలో శుభ్రము చేస్తున్నప్పుడు బూజు, దుమ్ము, ధూళి ఇతరత్ర ఏవీ స్వామి విగ్రహాలకు అంటకుండా కప్పబడి వుంటాయి).

## అంకురార్పణం :-

అంకురార్పణ రోజు ఉదయం సుప్రభాతం, తోమాలసేవ, సహస్రనామార్చన, మొదటి గంట నివేదన అయిన తరువాత ఉత్సవ మూర్తులకు (శ్రీసీతారామలక్ష్మణులకు), పరివారదేవతలైన శ్రీ ఆంజనేయ స్వామి, విష్వక్సేనులు, గరుత్మంతులవారు, ద్వారపాలకులకు 'ఏకాంత తిరుమంజనం జరగును. పిమ్మట రెండవ గంట నివేదన జరుపబడి, శ్రీ కోదండరామస్వామి, శ్రీ సీతామహాలక్ష్మి, శ్రీలక్ష్మణస్వాములకు బ్రహ్మోత్సవము సందర్భముగా విశేష సమర్పణ (అలంకారము) జరుగును. రాత్రి తోమాల సేవ, గంట అయిన తరువాత వేదప్రబంధ అధ్యయ నోత్సవము జరుగును. సేవాకాలము, శాత్తుమొర జరుగును. తరువాత యాగశాల మండపములో అంకురార్పణ కార్యక్రమములు జరుప బడును. ఈ అంకురార్పణలో 'మృత్సంగ్రహణము' తో (పుట్ట నెలకొన్న చోట మట్టి పవిత్రముగా నుండును. అందుచే అమట్టిని మృత్సంగ్రహణముగా ఎంచుదురు, కనుక విష్వక్సేనులతో కూడా ఉత్సవముగా పోయి, పుట్ట మట్టిని తెచ్చుదురు). మేదినీ (భూమాత) పూజచేసి, అంకురార్పణ చేయుదురు.

## మొదటిరోజ ఉత్సవం : -

### ధ్వజారోహణం :-

సుప్రభాతం, తోమాలసేవ, సహస్రనామార్చన మొదటి గంట నివేదన అయిన తరువాత ఉత్సవ మూర్తులను అలంకార మంటపములో తిరుచ్చి మీద ఉంచి, సర్వాంగసుందరముగా అలంకరించెదరు. తరువాత గరుడపటమునకు పుణ్యావాచనము, వాస్తుహోమం జరుగును. పిమ్మట "భేరీతాడనం" (డోలు వాయించటం) జరుగును. అష్టదిక్పాలకులను ఆహ్వానిస్తూ, గరుత్మంతుడు, చక్రత్తాళ్వార్ ముందుగాపోగా, శ్రీ సీతాలక్ష్మణ సమేతంగా శ్రీ కోదండరామస్వాములవారు అంగరంగ వైభవంగా ఛత్ర

చామర, గజరాజులు ముందు నడుస్తుండగా,జియ్యంగార్లు, ప్రబంధ పఠనం చేస్తుండగా స్వామివారి వెనుకవైపు వేదపారాయణం జరుగు తుండగా, ఆలయ నాలుగు మాడా వీధులలోను అష్టదిక్పాలకులను ఆహ్వానించి, వారికి సాత్త్విక బలిని సమర్పించెదరు. తిరిగి స్వామి వారిని సన్నిధికి గుడి ప్రాంగణమునకు తీసికొని వచ్చి, ధ్వజస్తంభమునకు కుడి వైపున వున్న ఊంజల మండపమునకు వేంచేపు చేసిన పిమ్మట "ధ్వజరోహణ ఉత్సవం" జరుగుతుంది.

పిమ్మట "ధ్వజస్తంభము" నందు ఉన్నటువంటి గరుత్మంతుల వారికి లఘు తిరుమంజనం లౌకికంగా జరుగును. తరువాత గరుత్మంతుల వారికి చందనము, అక్షతాది పట్టువస్త్రములు సమర్పించెదరు. ధ్వజ స్తంభము పై నుంచి ధ్వజ పటమునకు (గరుడ పటమునకు) ఆవాహనాధి అర్చనలు చేసిన తర్వాత "ముద్గాన్నము" (పొంగలి) నివేదన చేసి తర్వాత హారతి చేసి అర్చకస్వాములు (కంకణ భట్టాచార్యులు) ధ్వజారోహణ గావించెదరు. మరలా హారతి చేసి, ముద్గాన్నమును భక్తులకు పంచెదరు. ధ్వజరోహణలో స్వామికి నివేదన చేసిన పొంగలిని సంతానము లేని స్త్రీలు స్వీకరించిన సత్పుత్రులు కల్గెదరని శాస్త్ర నిర్ణయం.

ధ్వజరోహణము ప్రసాదం వినియోగం అయిన వెంటనే ఊంజల మండపమునున్న స్వామి వారికి నివేదన జరిగి, అస్థానము జరిగిన తరువాత, అంలకార మండపములో వేంచేసి బంగారు ఆభరణములు అన్నియు తొలగించిన పిమ్మట ఆస్థాన మండపమునందు స్నపన తిరుమంజనం జరుగును.

## బ్రహ్మోత్సవములందు సామాన్య కార్యములు - పద్ధతులు : -

బ్రహ్మోత్సవములలో ప్రతిరోజు ఉదయం, సాయంత్రము నివేదన, గంట, బలి అయిన పిమ్మట, ఉత్సవర్లను బహు సర్వాంగసుందరంగా అలంకరించి ఊంజలసేవకు వేంచేపు జేయుదురు. ఇలా ప్రతినిత్యము 8 రోజులపాటు "ఊంజలసేవ" ఉత్సవము మహాద్భుతముగా జరుగును.

ఈ "ఊంజలసేవ" లో వేదపారాయణము, తర్వాత అన్నమాచార్య కీర్తనలు, పిమ్మట మంగళవాద్యముల వరుస క్రమంలో జరుగుతుండగా, స్వామిని అర్చకస్వాములు అత్యంత సుందరంగా, విద్యుద్దీపకాంతులతో, పందిళ్ళతో అలంకరించిన ప్రాంగణములో నున్న ఊంజల మండపము నందు భక్తజనులందరూ తిలకించే విధంగా, బహు జాగ్రత్తగా, వింజామరలతో వీస్తూ, ఉయ్యాలను నెమ్మదిగా ఊపుతారు. ఈ సేవ కన్నుల పండుగే కాక, వీనులవిందుగా ఉంటుంది.

ఈ ఊంజలసేవ అయిన పిమ్మట స్వామి వారు మేళతాళములతో వాహన మంటాపానికి వేంచేపు చేయుదురు. వాహన మంటపములో తెరకట్టి అర్చక స్వాములు, వాహనముపై ఉత్సవర్లను, ఆయా ఉత్సవ ములకు అనుగుణంగా, సర్వాంగ సుందరంగా అలంకరించెదరు. అలంకరణ ఈ ఆలయ ప్రత్యేకతగా చాటవచ్చు. సాధారణంగానే ఏ సేవ అయినా కూడా అలంకరణలు అత్యద్భుతంగా వుంటుందిక్కడ. ఇది ఇక్కడి విశేషము. సహజంగానే సుందరుడు శ్రీరాములవారు మరి ఈ అర్చకస్వాముల అలంకరణతో మరింత మనోహరంగా స్వామివారు దర్శనమిస్తారు.

అలంకరణ అయిన పిమ్మట పెద్దజియ్యంగారు, ఏకాంగి, ఆచార పురుషులు, అధ్యాపకులు, దేవస్థానం ఉన్నతాధికారులు, ఆలయాధి కారులు, వచ్చిన భక్తజన సమూహం మధ్యన, ఒక ప్రక్క భజనగోష్ఠి, కోలాటములు, సన్నాయి మేళతాళములు వేద పండితులు ఉండగా, కోలహలం మధ్యన వాహన మండప తెరను పైకి తీసి, స్వామి వారికి కర్పూర హారతి జరిగిన వెంటనే శటారీ మర్యాదలు జరిగిన పిమ్మట, బయలుదేరును. ఈ ఉత్సవములు అత్యంత శోభాయమానముగా తిరుమలలో వలె అదే క్రమములో జరుగును.

ప్రతి ఉత్సవము సన్నిధి వీధి నుంచి బయలు దేరి, సన్నిధిలోని రాతి ధ్వజస్తంభమునకు ప్రదక్షిణ చేసే విధంగా ఒక వైపు నుంచి వెళ్ళి, ఆంజనేయస్వామి వద్ద నిలచి, స్వామికి నివేదించిన శేష హారతిని), శ్రీ

అంజనేయస్వామి వారికి ఇచ్చిన పిమ్మట, స్వామి గుడి వద్ద ఉత్తరమాడా వీధికి వెళ్ళేముందుగా ప్రబంధ పారాయణము ఆరంభమగును. తర్వాత స్వామి ఉత్తర, తూర్పు, దక్షిణ మాడావీధుల ద్వారా ఊరేగి తిరిగి సన్నిధి వీధుల గుండా, భక్తులను ఆశీర్వదిస్తూ కదలి తిరిగి వాహన మంటప మునకు వేంచేసిన పిమ్మట మంటపము నందు మరలా హారతి, శఠారీ మర్యాదలు, అయిన పిమ్మట అలంకరణ తొలగించి, స్వామిని తిరిగి ఆలయంలోకి తీసికొని వెళ్ళేప్పుడు ధ్వజస్తంభం వద్ద చేరు వరకు ఈ పారాయణము (కొంతసేపు వరకు) కొనసాగును. స్వామి లోపలికి వేంచేసిన తర్వాత, ఏకాంతసేవలో క్షీరాన్నము నివేదన చేయుదురు.

స్వామి వారి ఉత్సవములలో ప్రతిరోజు ఉత్సవం చివరి హారతిని స్వామి వారి ధ్వజస్తంభం, వీధిలోని రాతి ధ్వజస్తంభము మధ్య భాగంలో ఇస్తారు. ఈ సమయములో ముఖ్యంగా ఉత్సవాలలో చివరి నివేదన జరుగుతుంది. అటు తర్వాత భక్తుల వద్ద నుంచి హారతులు స్వీకరించరు. దీనిని "కుంభ హారతి" గా పిలుస్తారు. ఈ సమయములో కుంభ హారతి ముందు మేళం, సన్నాయి వాళ్ళు ఒక నిర్దిష్టమైన సంగీతంతో ఈ ఉత్సవ మూర్తులకి ప్రదక్షిణం చేస్తారు. (శనివారం, ఇతర ప్రత్యేక ఉత్సవాలలో కూడా ఇదే చివరి హారతి నివేదన లేకుండా ఇలానే జరుగుతుంది). ఇది సురటి రాగములో త్యాగరాజ స్వామి కృతి.

**మొదటి రోజు**

రాత్రి "పెద్దశేషవాహనం"పై శ్రీ సీతారామలక్ష్మణులు ముగ్గురూ వేంచేయుదురు.

**రెండవ రోజు**

ఉదయం "చిన్న శేషవాహనం", రాత్రి "హంస వాహనం" పై శ్రీ కోదండరాములవారు మాత్రమే వేంచేయుదురు.

**మూడవ రోజు**

ఉదయం "సింహ వాహనం" పై శ్రీ కోదండరామస్వామి వారు,

రాత్రి "ముత్య పందిరి" వాహనంలో శ్రీ సీతారామ లక్ష్మణులు వేంచేయుదురు.

<u>నాలుగవ రోజు</u>

ఉదయం **"కల్పవృక్షం"** వాహనం పై శ్రీ సీతారామ లక్ష్మణులు, రాత్రి **"సర్వభూపాల"** వాహనం పై శ్రీ సీతా రామ లక్ష్మణులు ముగ్గురూ వేంచేయుదురు.

<u>ఐదవ రోజు</u>

ఉదయం స్వామి పల్లకీ వాహనంలో ఊరేగుదురు. రాత్రి "గరుడసేవ" జరుగును.

విశేషమైన జన సందోహం మధ్య స్వామివారి గరుడ ఉత్సవము కన్నుల పండుగగా జరుగును. సుమారు 2 లేదా 3 సం॥ల క్రితము వరకు తిరుమల నుంచి గరుడ సేవకు శ్రీవారి పాదములు వచ్చేవి. ఈ మధ్యనే స్వామికి వేరుగా గరుడసేవ పాదములు చేయించిన కారణముగా అలా జరుగుట్లేదు. ఈ "గరుడసేవ" భక్తులు చూసి తరించాల్సిందే! అంతా తిరుమలలో స్వామి వలనే ఉంటారు స్వామి ఈ వాహన సేవలో.

<u>ఆరవ రోజు</u>

ఉదయం **"శ్రీహనుమద్వాహనం"** పై శ్రీ కోదండరాముల వారు ఉత్సవం వేంచేయుదురు. 2 సం॥ల క్రితం వరకు తిరుమల శ్రీవారి హనుమద్వాహనమునకు శ్రీ కోదండరాముల వారి ఆలయం నుంచే ధనుర్బాణములు వెళ్ళేవి. కాని ఈ మధ్యనే వేరుగా చేయించిన కారణముగా అలా వెళ్ళటం లేదట.

శ్రీ కోదండ రామ స్వామి వారి ఉత్సవర్లకు అలంకరించే ఈ ధనస్సు పూర్తిగా అపరంజి - ఈ సువర్ణ ధనస్సును భక్త శిఖామణి శ్రీ హథీరాం బావాజీవారు స్వయంగా చేయించి స్వామికి సమర్పించి, దీనికి తోడుగా ప్రతి శనివారం ఉత్సవములో స్వామికి ప్రత్యేకంగా పోలీ నివేదన ఏర్పాటు చేసినారట. ఇప్పటికీ ఈ నివేదన జరుగుతూంది!

## ఆరవరోజు

సాయంత్రం వసంతోత్సవము జరిగిన పిమ్మట రాత్రి "గజ వాహనం" జరుగును.

## ఏడవ రోజు

ఉదయం "**సూర్యప్రభ**", రాత్రి "**చంద్రప్రభ**" వాహనములలో శ్రీ కోదండరాములవారు మాత్రమే వేంచేయుదురు.

## ఎనిమిధవ రోజు

ఉదయం "**రథోత్సవం**" లో శ్రీ సీతారామలక్ష్మణులు ముగ్గురూ వేంచేయుదురు. ఈ రథోత్సవములో రథమునందు సింహములు, అశ్వములు, అష్టదిక్పాలకులు, అరటి మానులు, మామిడి తోరణములతో, రంగు గుడ్డలతో బహు సుందరముగా ముందురోజే అలంకరించి, ఉత్సవము ముందు రోజు సాయంత్రమే రథముపై బంగారు ఛత్రము నుంచి మంత్ర శబ్ధములతో ప్రత్యేకంగా ప్రతిష్టించెదరు. అలంకరణ పూర్తిగా తిరుమల శ్రీవారి రథోత్సవ అలంకరణ వలనే ఉండును. ఉదయమే స్వామి వారిని ఈ రథము నందు వేంచేపుచెయించి నివేధనలు, హారతులు ఇచ్చెదురు. ఈ ఉత్సవము నందు నాల్గుగు మాడ వీధులలో ఈ రథమును స్వయముగా భక్త జనులే లాగి స్వామి వారి కృపకు పాత్రులగుదురు. ఈ ఉత్సవ సమయములో ఈ వీధులు ఒక తిరునాళ్ళ వలె వుండి ఎకడెక్కడి నుంచో ప్రతి యేట బొమ్మలు, ఇతర ఆట వస్తువులు అమ్మేవారు రావటం వల్ల మరింత సందడిగా ఉంటుంది. ఈ ఉత్సవములో ఉప్పు మిరియాల మిశ్రమమును రథముపై చల్లితే కోరిన కోరికలు నెరవేరి జీవితం సఫలం అవుతుందంటారు. హారతులు రథము యథాస్థానం చేరిన తర్వాతనే స్వీకరిస్తారు. రాత్రి అశ్వవాహనం పై శ్రీ కోదండరాములవారు వేంచేయుదురు.

## తొమ్మిదవ రోజు

పల్లకీలో ఆళ్వార్ తీర్థములో స్వామి వారి **"చక్రస్నానము"** అయిన తరువాత రాత్రి తిరుచ్చి ఉత్సవములో ధ్వజావరోహణము నందు ఆ వాహన చేసిన దేవతల విసర్జన చేస్తూ స్వామి వారి **"ధ్వజ అవరోహణము"** జరుగును.

బ్రహ్మోత్సవములు అయిన మరుసటి రోజు స్వామి వారికి ఉపశమన ద్వాదశి ఆరాధనలో **"స్నపన తిరుమంజనం"** అయిన తర్వాత 12 సార్లు స్వామి వారికి (ఒక్కొక్క సారిగ) ధూప, దీప, నైవేద్యములు ఆరాధన చేయుదురు.

## రెండవ వసంతోత్సవము:

బ్రహ్మోత్సవములలో చేసే వసంతోత్సవం బ్రహ్మోత్సవములలో వైఖానస శాస్త్రం ప్రకారం చేసే వసంతోత్సవం. (అప్పుడే తిరుమలలో స్వర్ణరథంలో స్వామిని త్రిప్పుతారు). ఈ రెండోవసంతోత్సవం "సుగీలఉత్సవము" గా పిలువబడుతుంది. వసంత ఋతువులో వసంతోత్సవము ఆరంభ సందర్భముగా జరిగే వసంతోత్సవం రెండవది. స్వామికి నివేదనగా సుగీలు సమర్పిస్తారు. ఈ వసంతోత్సవము రోజు శ్రీ వైఖానస ఆగమము ప్రకారము స్నపన తిరుమంజనం, పుణ్యాహవాచనము చేసి పాద్య అర్ఘ్యఅచమనము ఇచ్చి స్వామి వారికి ధూప, దీప హారతులిచ్చి వరుసగా పాలు, పెరుగు, తేనె, చందనము, పసుపు, ఎర్రనెలికాయలు (కొబ్బరి బొండాలు), పూలతో చక్కగా అభిషేకము చేయుదురు. స్నపన తిరుమంజనం అయిన తరువాత తెల్లటి మల్లు వస్త్రములు సమర్పించి సర్వాభరణములు అలంకరించి, చందనము ముద్దలు వక్షస్థలమున అలరి పెట్టి "సుగియపడి ఆస్థానము" జరుగును. ఈ ఆస్థానము ముందుగా స్వామివారు సీతాలక్ష్మణ సమేతంగా చల్లని సాయంత్రంలో ఉత్సవమునకు వేంచేయుదురు.

## తోట ఉత్సవం :

బ్రహ్మోత్సవములో అవరోహణ అయిన మూడవ రోజు స్వామివారికి తోట ఉత్సవము జరుగును. తిరుమల తిరుపతి దేవస్థానము వారు ఈ ఉత్సవమును జరిపించెదరు. (సుమారు 50 సం॥ల క్రితం అత్యంత అద్భుతంగా, కన్నులకు అమితానందంగా ఉండే విధంగా ఈ ఉత్సవం జరిగేదట. ఎలా జరిగేదంటే స్థానిక పాత హుజూరాఫీసు నందు ఎడమచేతి ప్రక్కన దిగుడు బావి ఒకటి కలదు, ఆ మెట్లబావిలో ఆ మెట్లపైన పలకలు వేసి, అక్కడ సింహాసము ఏర్పరచి శ్రీ సీతాలక్ష్మణ సమేత శ్రీ కోదండరామ స్వామిని, వేంచేపు చేసి వైఖానస ఆగమము ప్రకారము స్నపన తిరుమంజనం జరుగును. ఆ దిగుడు బావి వద్ద నుంచి చుట్టు మెట్లపైన ఇరుప్రక్కల గోడలకి బయట వరకూ మరువం, దవణం, మల్లెపూలు, వట్టివేరు చాపలు సుగంధ పుష్పములతో కట్టి వాటికి అలంకరణ చేసెదరు. ఉదయం అభిషేకం వద్ద నుంచి, సాయంత్రం ఉత్సవము అయ్యే వరకు ఈ అలంకరణ అట్లే ఉండును. స్వామి వారిని సాయంత్రం వేళ బయట ఉన్న మండపంలో వేంచేపు చేసి మంచి కనకాంబరము, మల్లె, సంపంగి, చేమంతి, మరువం, ధవళం మొదలైన సువాసన భరితమైన పుష్పములతో ఉత్సవమూర్తులను అలంకరణ చేసి, ఆస్థానము జరుగును. ఈ ఆస్థానమునకు పులిహోర, దధ్యోదనం, బెల్లం దోశలు, మకాలాబాత్ అనబడే పల్చటి దధ్యోదనం, దోశలు, నివేదన చేసెడివారు. ఆస్థానమైన తర్వాత స్వామివారు శ్రీ గోవిందరాజస్వామి వారి ప్రదక్షిణం చేసికొని శ్రీ కోదండరామస్వామి వారి స్వామి సన్నిధికి వేంచేయుదురు. ఇప్పుడు ఆవైభవం కనుపడుటలేదు).

అయితే ఈ ఉత్సవం అదే ప్రకారం ఆస్థానం జరిగి, శ్రీ గోవింద రాజస్వామి ప్రదక్షిణం చేసికొని తిరిగి వచ్చేస్తారు.

## రేపాకుల సుబ్బమ్మ తోట ఉత్సవం:

అన్ని ఉత్సవములు అయిన తరువాత ఆఖరి రోజున బ్రహ్మోత్సవ సందర్భముగా ఈ ఉత్సవము జరుగును. బ్రహ్మోత్సవం అయిన తరువాత మరే ఉత్సవము జరుగదు. ఈ **రేపాకుల సుబ్బమ్మ** అనే ఆమె సుమారుగా 80 లేదా 90 సం॥ల క్రితము శ్రీ కోదండరామస్వామి వారికి ఆర్.ఎస్. గార్డెన్స్‌గా ప్రస్తుతం పిలువబడే తోట వద్ద నుంచి (ప్రస్తుతం టి.టి.డి. ప్రెస్) బాలమందిర్ వరకు తన ఆస్తిని స్వామివారికి ధూప, దీప, నైవేద్యాలు జరిగేటట్లుగా వ్రాసిఇచ్చి, అందుకు జ్ఞాపకార్థముగా బ్రహ్మోత్సవము ఆఖరి రోజున స్వామి ఊరేగింపులో తన గృహము నందు ఒక మండపము నందు ఉండునట్లు ఏర్పాటు చేసినది. ఈ ఉత్సవము నాడు ఉదయం శ్రీ కోదండరామస్వామి వారికి సుప్రభాతం, తోమాలసేవ, సహస్రనామార్చన మొదటి నివేదన మొదటి గంట మరియు రెండవ నివేదన రెండవ గంట జరిగిన తరువాత స్వామి వారిని బంగారు తిరుచ్చిలో వేంచేపు చేసి ఉత్సవముగా బయలు దేరి ఆంజనేయస్వామి గుడి వద్ద హారతులందుకొని సరోజిని దేవి వీధి గుండా మెటర్నిటి హాస్పటల్ రోడ్డు ద్వారా వెళ్ళి, అక్కడ ఉన్న ఆర్.ఎస్. గార్డన్స్ లోపల మండపము నందు వేంచేపు చేయుదురు. అక్కడే ఉన్నటువంటి సింహాసనము పైన స్వామివారిని దింపి తిరుచ్చి నుంచి సడలింపు చేయుదురు. తర్వాత సమృద్ధిగా పాలు మొదలైన వాటితో శ్రీ సీతారామ లక్ష్మణులకు స్నపన తిరుమంజనం చాలా చక్కగా జరుగును. అయిన తరువాత దధ్యోదనం, పానకం, వడపప్పులతో స్వామి వారికి నివేదన జరుగును. తరువాత ఆస్థానము చేసి స్వామి వారిని ఏకాంతముగా ఉంచుదురు. సాయంత్రము సర్వాలంకరణము చేసి, అక్కడే ఉన్నటువంటి ఊంజల పీఠలో స్వామివారిని వేంచేపు చేసెదరు. రాత్రి బంగారు తిరుచ్చిలో వేంచేపుచేసి, చక్కటి పుష్పములతో అలంకరించి, తరువాత దోసవడి నివేదన చేసి, ఆ మండపమునకు మూడు ప్రదక్షిణలు చేసిన తరువాత మరల హాస్పిటల్

రోడ్డు ద్వారా బయలుదేరి, అన్నమాచార్య కళామండపము మీదుగా రాములవారి దక్షిణమాడా వీధి ద్వారా సన్నిధికి వేంచేపు చేయుదురు. వేంచేసిన తర్వాత రాత్రి తోమాలసేవ, రాత్రి గంట, ఏకాంతసేవ జరుగును.

ఈ ఉత్సవము సందర్భముగా అభిషేక సేవలకుగాను స్వామి వారికి రేపాకుల సుబ్బమ్మ గారు చిన్న వెండి చెంబును సమర్పించివున్నారు. అది నేటికిని ఉన్నది.

## 2. ఉగాది ఆస్థానం :

తెలుగువారి క్రొత్త సంవత్సర ఆరంభం, "రామ" నామ పారాయణం తోనే మొదలవుతుంది. ఎందుకంటే అదే సకల జీవులకి జన్మరక్షక మంత్రము. అందుకే ఆంధ్రుల ఆరాధ్య దైవం శ్రీరాముడని వేరుగా చెప్పనక్కరలేదు. ఈ "ఉగాది ఉత్సవం" ఈ ఆలయంలో ఈ దిగువ వర్ణించిన క్రమంలోనే జరుగుతుంది.

ముందుగా ఉదయము స్వామివారికి (ఉత్సవర్లకు) స్నపనం జరుగును. తెలుగు "ఉగాది" మరుసటి రోజు స్వామి వారిని సర్వాంగ సుందరంగా అలకరించి, ఆస్థాన మండపములో బంగారు తిరుచ్చిలో అర్చక స్వాములు వేంచేపు చేసి, అలంకరించిన పిదప జియ్యంగార్లు, దేవస్థానం అధికార్లు వెంటరాగా స్వామివారికి నూతన వస్త్రములు విమాన ప్రదక్షిణమార్గములో (పెద్ద ప్రదక్షణం) తీసికొని వెళ్ళి, మొదటగా మూలస్థానం రాములవారికి, క్రొత్త వస్త్రములు అర్చక స్వాముల ద్వారా సమర్పించెదరు. అర్చక స్వాములు ఆ వస్త్రములను స్వామివారికి అప్పుడే అలంకరింపజేసెదరు. హారతి అయిన తర్వాత మరలా ఉత్సవమూర్తుల వద్దకు వెళ్ళి ఉత్సవ సీతారామ లక్ష్మణులకు నూతన వస్త్రములు సమర్పించి స్వస్తి సూక్తంతో స్వామివారికి, అమ్మవారికి, లక్ష్మణ స్వామి వారికి అక్షతారోహణ చేసెదరు. స్వామి వారికి సమర్పించిన అక్షతలను శ్రీ విష్వక్సేనుల వారికి కూడా సమర్పించెదరు. తరువాత విష్వక్సేనుల వారికి, అర్చకులకు, శటారీ మర్యాద జరుగును. వరుసగా జియ్యంగారు, ఏకాంగి దేవస్థానం అధికారులకు మర్యాదలతో ఆస్థానము జరుగును.

## 3. శ్రీరామ నవమి మహోత్సవములు : -

"శ్రీరామ నవమి" సందర్భముగా స్వామివారి ఉత్సవములు ఈ విధంగా జరుగుతున్నాయి. ముందుగా శ్రీకోదండరామ స్వామి వారికి ప్రాతఃకాలంలో సుప్రభాతం, మొదటి గంట, మొదటి నివేదన అయిన తరువాత పెద్ద జియ్యంగారు, చిన్న జియ్యంగారు, ఏకాంగి స్వాములు "తైల పటం" (శీకాయ, మంచి నువ్వుల నూనె), ఛత్రము, చామరములు సన్నిధి దివిటీ, దేవస్థానం అధికారులు వెంటరాగా విమాన ప్రదక్షణం చేసికొని, అర్చక స్వాములకు అందజేయుదురు. అర్చకస్వాములు ఆతైల కాపును శ్రీరామ, సీతా, లక్ష్మణ దేవులకు వరుసగా సమర్పించెదరు. ఈ సమయంలో వేద ప్రబంధపారాయణము జరుగును. తైలకాపు అయిన తరువాత శ్రీ స్వామివారికి హారతి జరుగును. తరువాత పాలు, పెరుగు, తేనె, ఎర్రనెలికాయలు (కొబ్బరిబొండాలు) నీళ్ళు, చందనము, పసుపు, వరుసగా జియ్యంగారు అందజేయగా, అర్చక స్వాములు మూలవర్లకు అభిషేకము చేయుదురు. ఇక్కడ వారంతో సంబంధంలేదు. స్వామివారికి సామాన్యంగా శనివారం రోజులలోనే అభిషేకం జరుగుతుంది. శ్రీరామ నవమి ఏవారంలో వచ్చినా ఇలా అభిషేకం జరుగుతుంది. ప్రత్యేకంగా స్వామివారికి తైలపటం సమర్పించటం ఈ రోజు భక్తులు చూడవచ్చు. శనివారం అభిషేక సమయంలో అలా చూడడం వీలుపడదు. ముందు గానే తైలం సమర్పించబడి ఉంటుంది.

ఇక్కడి విశేషమేమంటే పెద్దజియ్యంగారు, చిన్నజియ్యంగార్లు సామాన్యంగా తిరుమల శ్రీవారి ఆలయ అభిషేకము దర్శించుదురు. కాని ఈ సందర్భముగా విశేషించి శ్రీ కోదండరామస్వామి వారి అభిషేకము నకు ప్రత్యేకించి విచ్చేయుదురు. మరి ఏ ఇతర ఆలయ అభిషేకములకు వెళ్ళరట! అంటే జియ్యంగార్లు అభిషేకానికి హాజరయ్యే ఆలయాలు తిరుమల శ్రీవారి ఆలయము మరియు ఈ శ్రీకోదండరామాలయం.

అభిషేక సమయంలో వేదపారాయణము, పురుష సూక్తము ఇత్యాది

పంచసూక్తాలు. దశశాంతులు, ఉపనిషత్తులు ప్రబంధములను అర్చకులు. వేదపండితులు పారాయణ చేయుదురు. ఈ సేవను అందరూ చూసి తరించవలసిందే!

తరువాత స్వామివారికి తోమాల సేవ జరుగును. పిదప స్వామివారిని వజ్ర వైఢ్యూర్యములతో అలంకరించెదరు. పిమ్మట తోమాల సేవ, సహస్ర నామార్చన, రెండవ గంట జరుగును. వెంటనే జియ్యంగార్లకు తీర్థ ప్రసాదములు ఇచ్చిన పిదప సర్వదర్శనమునకు అందరిని అనుమతిం చెదరు. తర్వాత ఉత్సవమూర్తులకుస్నపనతిరుమంజనం జరుగును. శ్రీ సీతారామలక్ష్మణుల వారి ఉత్సవమూర్తులను సర్వాంగ సుందరంగా అలంకరించి బంగారు సింహాసనంపై వేంచేపు చేయుదురు.

మరలా ఉగాది ఉత్సవములో వలె స్వామి వారికి నూతన వస్త్రములు సమర్పించిన పిదప. అర్చక స్వాముల వద్ద నుంచి, శ్రీరాముల వారి పాదముల వద్ద ఉంచబడిన "శ్రీరామజనన ప్రవచన గ్రంధము" పురాణ అధ్యాపకులు తీసికొని పర్వేటము (శ్రీవారి పాదములపై ఉంచిన వస్త్రమును) తలకు కట్టుకొని శ్రీరామ జనన ప్రవచనము (బాలకాండ) పఠించెదరు. దీనినే శ్రీబాలరామాయణము అని, లేదా "సంక్షిప్త రామాయణము" అని కూడా వ్యవహరిస్తారు. ఇందు ఏడు కాండముల శ్రీమద్రామాయణము ఉపదేశింపబడినది. భక్తులందరూ ఈ సేవ చూచి, తరించి శ్రీ సీతారామ అనుగ్రహములకు పాత్రులు కాగలరుగాక!

ఈ బాలకాండలోనే 98 - 99వ శ్లోకములు ఇలా చెపుతుంది.

శ్లో ॥ ఇదం పవిత్రం పాపఘ్నం పుణ్యం వేదైశ్చ సమ్మితమ్ ।
యః పఠేద్రామ చరితం సర్వపాపైః ప్రముచ్యతే ॥

**తాత్పర్యము :** సకల వేదములతో సమానమైన ఈ సంక్షేప రామకథ చిత్తశుద్ధిని కలిగించును. పాపములను నాశనము చేయును. పుణ్యమును కలిగించును. అట్టి ఈ రామకథను ఎవరు వేదమువలె నియమముగా నిత్యము పారాయణము చేయుదురో వారు సకల పాపముల నుండి విముక్తులగుదురు.

శ్లో ॥ ఏతదాఖ్యాన మాయుష్యం ఫఠన్ రామాయణం నరః !
సపుత్ర పౌత్ర స్సగణః ప్రేత్య స్వర్గే మహీయతే ॥

**తాత్పర్యము :** ఆయుస్సును పెంపొందింప జేయునదియు, కథా రూపము నునున్నదియు నగు ఈ బాలకాండను నియతముగా ఎవ్వడు పారాయణ చేయునో అతడు పుత్ర పౌత్ర బంధు మిత్ర సపరివారముగా స్వర్గమునందు పూజింపబడును.

ఈ బాలకాండ సాక్షాత్తు శ్రీనారద మహర్షి శ్రీ వాల్మీకి మహర్షికి ఉపదేశించిన సంక్షిప్త రామాయణము. ఇంత విశిష్ఠత కలిగిన ఈ బాలకాండ పఠనమైన పిమ్మట స్వామి వారికి ఆస్థానము జరుగును. అనంతరము సర్వ దర్శనముతో భక్తులకు స్వామికి నివేదించిన పానకము, వడపప్పు ప్రసాదముగా పంచుదురు.

శ్రీరామనవమి సాయంకాలము జియ్యంగార్లు తోమాల పటము తీసుకొని (పుష్పహారములు) విమాన ప్రదక్షిణముగా వచ్చి, అర్చక స్వాములవారికి అందజేయుదురు. అర్చకస్వాములు ఆపుష్పహారములను జియ్యంగార్లు ప్రబంధము పఠించుచుండగా మూలవర్ల స్వాములకు అలంకరింపజేసెదరు. తరువాత రాత్రి గంట, నివేదన అనంతరం సేవాకాలము, శాత్తుమొర జరుగును. తీర్ధ ప్రసాదాదులను ఇచ్చిన పిమ్మట దర్శనమునకు వదులుదురు. రాత్రి శ్రీ కోదండరామస్వామి మాత్రము ఊంజల సేవకు వెళ్ళుదురు. ఈ ఊంజలసేవలో వరుసగా వేదపారాయణం, అన్నమాచార్య సంకీర్తనలు, నాదస్వరం జరుగును. సేవానంతరము స్వామి వారిని వాహన మంటపమునకు తీసికొని వచ్చి స్వామి భక్తుడైన శ్రీ హనుమద్వాహనం మీద స్వామివారు కూర్చున్నట్లుగా సర్వాంగసుందరముగా అర్చక స్వాములు అలంకరింపజేసెదరు. (ఈ అలంకరణ, స్వామి వారి గరుడసేవాలంకరణను పోలి ఉంటుంది) తరువాత శ్రీ చక్రవర్తి కుమారుడైనటువంటి శ్రీ కోదండరాములవారు శ్రీరామ నవమి రోజున నాలుగు మాడా వీధులందు భక్తులకు, ఆశీర్వాదాలు, ఆనందన్ని కలుగజేస్తూ ఊరేగుదురు. ఈ స్వామి వారి

ఉత్సవవాహన సేవ పిదప సన్నిధిలోకి వేంచేపు చేసిన పిమ్మట ఏకాంతసేవ జరుగును.

మరుసటిరోజు స్వామివారి కళ్యాణోత్సవము తదుపరి మరుసటి రోజు స్వామి వారికి పట్టాభిషేకము జరుగును. కళ్యాణోత్సము ఆర్జిత సేవగా వుంది. భక్తులు రుసుము చెల్లించి, కళ్యాణోత్సవములో పాల్గొని స్వామివారి కృపకు పాత్రులుకాగలరు.

## కళ్యాణోత్సవము :

శ్రీ పి.వి.ఆర్.కె. ప్రసాద్‌గారు టి.టి.డి - ఇ.ఓ. గా ఉన్నప్పుడు వారు శ్రీకోదండరామ స్వామి ఆలయంలో శ్రీరామ నవమి నాడు అభిషేకము నకు వచ్చి, శ్రీ సీతారామ కళ్యాణము, పట్టాభిషేకము ఎన్ని గంటలకు జరుగునని అర్చక స్వాములను అడిగినారు. అప్పటిదాకా కళ్యాణము, పట్టాభిషేకము లేవు (శ్రీరామ నవమి తప్ప). ఆయన ఆశ్చర్యపోయి, అవి చేయుటకు, అఘమేఘాల మీద ఉత్తర్వులు ఇప్పించినారు. సాయంత్రము కళ్యాణము, పట్టాభిషేకము జరిగినవి.

ఆ మరుసటి సంవత్సరము నుండి దీనిని శ్రీరామ నవమి, సీతా కళ్యాణం, శ్రీరామ పట్టాభిషేకంగా మూడు రోజులు జరుగునట్లుగా ఏర్పాటు చేసినారు.

శ్రీ సీతా కళ్యాణము రోజున ఉదయం సుప్రభాతం, తోమాలసేవ, సహస్రనామార్చన మొదటి గంట అయిన తరువాత ఉత్సవ మూర్తులు శ్రీ సీతారామ లక్ష్మణులకు స్నపన తిరుమంజనం జరుగును. తరువాత రెండవ గంట జరిగి సేవ తళిగ (Fund) నివేదన జరుగును. కళ్యాణోత్సవ సందర్భముగా శ్రీ సీతారామ లక్ష్మణులను సర్వాంగ సుందరముగా (నూతన వస్త్రములతో) చక్కటి అలంకారము చేసెదరు. రామలక్ష్మణులను మాత్రము కళ్యాణ మండపమునకు వేంచేపు చేయుదురు. శ్రీ సీతా మహాలక్ష్మి మాత్రము గర్భాలయములోనే ఉండును. సాయంత్రం తి.తి.దే. పరిపాలన భవనము నందు గజ, అశ్వ, వృషభ, భజన కోలాట

మేళతాళములతో అత్యంత అంగ రంగ వైభవముగా స్వామి వారికి 'ముత్యాల హారములు. ముత్యములు తలంబ్రాలు' హారతు లందుకొంటూ తీర్థకట్ట వీధి ద్వారా గోవిందరాజస్వామి వారి ప్రదక్షిణం చేసికొని, పెద్దబజారు వీధి ద్వారా, శ్రీకోదండరామస్వామి ప్రదక్షిణము చేసికొని స్వామి సన్నిధి ద్వారా ఆలయ పెద్ద ప్రదక్షిణం చేసుకొని, చిన్న ప్రదక్షిణం చేసుకొని స్వామి వారి గర్భాలయము నందు అర్చకులకు అందజేయుదురు. అర్చక స్వాములు వాటిని మూలవర్ల ముందుంచి హారతి అయిన తర్వాత సీతమ్మవారితో సహా ముత్యాలు, హారములు అన్నియు స్వామి వారి చిన్న ప్రదక్షిణము చేసుకొని కళ్యాణ మండపంకు (ఊంజల మండపమునకు) మేళ తాళములతో వేంచేయుదురు.

తరువాత శ్రీవైఖానస ఆగమశాస్త్ర ప్రకారం పుణ్యావాచనం, అగ్ని ప్రతిష్ఠ జరిగిన పిమ్మట శ్రీ సీతారాములకు 'కంకణధారణ' చేయుదురు. పిమ్మట మహా సంకల్పము, ప్రవర, మాంగల్యధారణ, యజ్ఞోపవీతధారణ జరిగిన అనంతరం దేవస్థానం వారు స్వామివారికి నూతన పట్టు వస్త్రములను ఇ.ఓ. ద్వారా అర్చక స్వాములకు ఇచ్చి, స్వామి వారికి బహుకరించెదరు. పిమ్మట ముత్యాలు తలంబ్రాలుగా పోసెదురు. నివేదన జరిగి స్వామి వారికి హారతి అయిన తర్వాత అందరికీ ఆ ముత్యములు, మంత్రాక్షతలు, ప్రసాద వినియోగము జరుగును. అనంతరం స్వామి వారు నాలుగు మాడా వీధులలో వైభవముగా కళ్యాణఉత్సవముగా ఊరేగుదురు. తరువాత రాత్రి నివేదన, గంట, ఏకాంతసేవ జరుగును. మరుసటి రోజు పట్టాభిషేక మహోత్సవము జరుగును.

## శ్రీరామ పట్టాభిషేకము :-

సుప్రభాతం, తోమాలసేవ, సహస్రనామార్చన, మొదటి గంట అయిన తర్వాత శ్రీ సీతారామ లక్ష్మణులను, శ్రీ అంజనేయస్వామి వారిని తిరుచ్చిలో ఊంజల మండపములో వేంచేపు చేయించి, అయిన తర్వాత, నాలుగు కలశములలో స్థానిక నరసింహతీర్థం (మంచి నీళ్ళగుంట) నుంచి

నీళ్ళు తెచ్చి, ఛత్రం, ఛామరం, ఏనుగులు, మేళతాళములు వేదపండితుల సమేతముగా పరిచారకులు పట్టాభిషేక నిమిత్తము తెచ్చెదురు. పిదప అగ్ని ప్రతిష్ఠ జరిగి పట్టాభిషేకము సందర్భముగా "చతుర్ధశ కలశ స్నపన తిరుమంజనం" శ్రీ కోదండరామస్వామి వారికి జరుగును. అనగా 14 కలశములను 14 విస్తరాకులలో వరుసగా బియ్యము, వడ్లు, నవధాన్యములు ఉంచి నూతన వస్త్రములు కట్టి వీటిలో వరుసగా పాలు, నెయ్యి, తేనె, కుశలు (దర్భలు), అక్షింతలు, తెల్లఆవాలు, చందనములను, ఏడు కలశములలో ఉంచి, వీటికి ఉపపాత్రలుగా మరియొక ఏడు కలశములలో శుద్ధోదకమును ఉంచెదరు. వీటితో స్వామివారికి "హోమ పూర్వక స్నపన తిరుమంజనం" జరుగును.

శాస్త్రప్రకారము దేశానికి రాజుగా పట్టాభిషేకము చేసికొను వారు కొన్ని నియమములు పాటించవలెను. అందులో ముఖ్యముగా ఉపవాసము వుండటము, నేలపై శయనము ఇటువంటివి, పేద ప్రజల కష్టములను తెలిసికొనుట కొఱకు, నియమం ప్రకారము పాటించాల్సిన అంశములు.

స్వామి వారికి వైఖానస ఆగమశాస్త్ర ప్రకారము పట్టాభిషేకము జరుగును. ఈ శాస్త్ర ప్రకారము కూడా పట్టాభిషిక్తులు అగువారు ఉపవాస దీక్ష వహించవలెను. అందువలన రెండవ నివేదనగా స్వామి వారికి వడపప్పు, పానకం సమర్పించెదరు. తరువాత అగ్ని ప్రతిష్ఠ, పుణ్యావాచనం, అంకురార్పణం, మొదలగు వైదిక కార్యక్రమములు అయిన తర్వాత స్వామివారికి పట్టము కట్టుదురు. ఈ సందర్భముగా రామాయణము నందు సీతాన్వేషణ సమయములో తనకు సహాయము చేసిన వారికి శ్రీరాములవారు బహుమానములు ఇచ్చినట్లు ఇతిహాసము. అదేవిధముగా ఇక్కడ కూడా పట్టాభిషేకానంతరము శ్రీ సీతమ్మ వారి ద్వారా శ్రీ లక్ష్మణ స్వామి వారికి, ఆంజనేయస్వామి వారికి బహుమానములు సమర్పించెదురు.

ఈ కార్యక్రమము అయిన తరువాత నివేదన జరుగును. పిమ్మట స్వామి వారు నాలుగు మాడా వీధులలో బయలుదేరుదురు. ఈ ఉత్సవము నందు ఒక విశేషము కలదు. సంవత్సరమంతయు శ్రీరాముల వారి సన్నిధిలోనే యుండు శ్రీ భక్తాంజనేయస్వామి వారు "శ్రీరామ పట్టాభిషేకం" సందర్భముగా సంవత్సర ములో ఈ ఒక్కరోజు మాత్రము, సన్నిధి నుండి వెలుపలికి వచ్చి, శ్రీ సీతారామ లక్ష్మణుల ఉత్సవ మూర్తులకు ఎదురుగా మరొక ప్రత్యేకమైన తిరుచ్చిలో శ్రీ సీతారామ లక్ష్మణులతో ఉత్సవముగా ఊరేగుదురు. ఉత్స వానంతరము స్వామివారికి రాత్రిగంట, నివేదన, ఏకాంతసేవ జరుగును. దీనితో శ్రీవారి శ్రీరామనవమి ఉత్సవములు ముగియును.

## 4. శ్రీ హనుమజ్జయంతి ఉత్సవము :

వైశాఖ మాసంలో శ్రీ హనుమజ్జయంతి జరుగును. ఉత్సవర్లు శ్రీ భక్తాంజనేయ స్వామి ఆలయానికి వెళ్ళిన పిదప స్నపన తిరుమంజనం జరుగును. సాయంకాలము శ్రీ హనుమంతులవారి వాహనముపై శ్రీ కోదండరాములవారు వేంచేపు చేసి, భక్తులను నాలుగు మాడావీధుల ఊరేగింపులో ఆశీర్వదించెదరు. ఈ దేవాలయము విశేషమేమంటే "శ్రీ హనుమద్వావాహన సేవ" సంవత్సరములో 3 సార్లు జరుగును. అవి వరుసగా 1.శ్రీవారి బ్రహ్మోత్సవములలో 6వ రోజు ఉదయము 2.శ్రీరామ నవమి సాయంత్రం 3.శ్రీ హనుమజ్జయంతి రోజున సాయంత్రం భక్తులు వాహన సేవలకు సొమ్ము చెల్లించి సంకల్పము చేయవచ్చు.

## 5. ఆణివర ఆస్థానము :

దక్షిణాయనం, కటక సంక్రమణ సందర్భముగా ఈ ఉత్సవము జరుగును. ఇది అయనోత్సవము. ఈ దినము స్వామి వారికి స్నపన తిరుమంజనం జరిగిన తర్వాత అర్చక స్వాములు, శ్రీ లక్ష్మణ స్వామి సమేత, శ్రీసీతామాత, శ్రీ కోదండరామస్వామిలను సర్వాంగ సుందరముగా

అలంకరింపజేసి బంగారు తిరుచ్చిలో వేంచేపు జేయుదురు. విష్వక్సేనుల వారు కూడా వేంచేయుదురు.

మిగతా కార్యక్రమములు ఉగాది ఉత్సవము వలె జరుగును. నూతన వస్త్రములు, అక్షతారోహణ అయిన తర్వాత పెద్ద జియ్యంగారు, చిన్న జియ్యంగారు ముద్రలు (సీలు) అర్చక స్వాముల ద్వారా స్వామి వారి పాదముల వద్ద నుంచి పిదప దానిని వరుసక్రమముగా అందజే యుదురు.

## 6. దీపావళి ఆస్థానము :

దీపావళి ఆస్థానము ఆశ్వయుజమాసం సాయంత్రం జరుగును, సాయంత్రం నివేదన గంట అయిన తరువాత శ్రీ గోవిందరాజస్వామి వారి సన్నిధి నుండి, ఛత్ర, ఛామర, మేళ తాళములతో నూతన వస్త్రములు, దీపపు హారతి, నివేదన (దోసెపడి)లను ఏకాంగి, దేవస్థానం అధికారులు వెంటరాగా, తీసికొని వచ్చి, అర్చక స్వాములకు అందజేయుదురు. అర్చకస్వాములు నూతన పట్టు వస్త్రములను, సమర్పణ చేసి రెండుమార్లు దీపపు హారతిని స్వామివారికి ఇచ్చి, మళ్ళీ కర్పూర హారతి ఇచ్చిన పిదప నివేదన జరుగును. తరువాత ఆస్థానం జరుగును.

కార్తీక పున్నమిలో కూడా ఇలానే జరుగుతుంది. అయితే ఆ రోజు దేవాలయమంతా కూడా దీపపు వెలుగులతో ప్రకాశిస్తుంది.

## 7. కృష్ణాష్టమి, శ్రావణమాసం:

తిరుమలలో వలె శ్రీ కోదండరామస్వామి ఆలయంలో కూడా ఇదివరకు వర్ణించినట్లు, శ్రీకృష్ణస్వామి ఉత్సవర్లు ఉన్నారు. వీరికి సాయంత్రం స్నపన తిరుమంజనం జరిగి అలంకారం అయిన పిమ్మట ఆస్థానం జరుగును.

ఈనాటి మహోత్సవంలో శ్రీ బాలకృష్ణుని అలంకరణ విశేషంగా వుండి, భక్తులకు అద్భుతానందాన్ని కలిగిస్తుందనడం అతిశయోక్తి కాదు.

రాత్రి జరిగే పాన్పుసేవను భక్తులందరూ అతిచేరువ నుంచి స్వామిని దర్శించే భాగ్యం ఈ ఒక్కరోజే ఉంటుంది.

మరుసటి రోజు ఉట్ల ఉత్సవం సందర్భముగా స్వామి నాలుగు మాడా వీధులలో ఉత్సవముగా ఊరేగుదురు. ఒకప్పుడు ఈ ఉట్ల ఉత్సవము బాగా జరిగేది. కొంతకాలము కేవలము స్వామి ఉత్సవం మాత్రమే జరుగుతుండినది. దీనిని మరలా ఈ మధ్యనే జరుపుచున్నారు. ఇది ముదావాహము.

## 8. ధనుర్మాస ఉత్సవములు :-

మార్గశిర మాసంలో ముప్పది రోజులు ఈ ఉత్సవము జరుగును. స్వామి వారికి ప్రాతఃకాలంలో ఆరాధన జరుగును (సుమారు ఉదయం 4.00 గం॥లకు) సేవాకాలం, శాత్తుమొర జరిగిన పిదప భక్తులను దర్శనమునకు వదులుదురు.

ఈ మాసంలో రాత్రి సర్వ దర్శనము సుమారు 8.00 గం॥లకే ముగియును. ఏకాంత సేవ తొందరగా జరుగును. సామాన్యముగా ఈ మాసంలో స్వామి వారి తిరునామం "పచ్చకర్పూరము" మిశ్రమముతో తిరుమల శ్రీవారికి వలె అలంకరించబడుతుంది. ఇతర విశేష ఉత్సవ రోజులలో కూడా ఇలాంటి అలంకరణే ఉంటుంది. ఈ అలంకరణలో దూరం నుంచి స్వామిని చూసినవారికి వేంకటేశ్వరస్వామి వారిని చూసిన అనుభూతి తప్పక కలుగుతుంది.

## 9. తెప్పోత్సవము:-

మాఘమాసంలో శ్రీ కోదండరామస్వామి వారికి మాఘశుద్ధ, ఏకాదశి రోజున శ్రీ గోవిందరాజస్వామి వారి పుష్కరిణిలో తెప్పోత్సవము జరుగును. (సుమారు 100 సం॥ల క్రితము శ్రీ కోదండరామస్వామి వారికి అలిమేల్ మంగాపురం - తిరుచానూరు అమ్మవారి పద్మసరోవరంలో తెప్పోత్సవము జరిగినట్లు ఆధారములు ఉన్నవి). చాలాకాలం తర్వాత శ్రీ కోదండ

రామస్వామివారి, రామచంద్రగుంటని తిరిగి పుష్కరిణిగా పునరుద్ధరణ చేయాలన్న తి.తి.దే. వారి నిర్ణయం ఎంతో ముదావహం!

ఇక్కడ గమినించాల్సిన అంశం ఏమిటంటే తిరుమల శ్రీవారి పుష్కరిణి 6 కోణములు (తెప్పోత్సవములు శ్రీరాములవారితోనే ఆరంభమవుతాయి), తిరుచానూరు పద్మ సరోవరం 4 కోణములు, గోవిందరాజస్వామి వారి కోనేరు 8 కోణములు (ఇచ్చట కూడా కోదండరామస్వామి వారితోనే తెప్పోత్సవములు ఆరంభమవుతాయి) కలిగివున్నవి. ప్రతి కోణములో (మూలలో) హారతి నివ్వటం గమనించ గలరు.

## 10. పునర్వసు ఉత్సవం : -

ప్రతి పునర్వసు దినమున ఉత్సవ మూర్తులకు, అభిషేకం (ఆస్థాన మండపంలో) నిర్వహించబడును. తరువాత నాలుగు మాడా వీధులలో జరిగే స్వామి ఊరేగింపు ద్వారా స్వామి భక్తులకు తన ఆశీర్వాదులను అందజేస్తారు.

## 11. అమావాస్య పూలంగి సేవ :

ప్రతి అమావాస్యకి శ్రీ సీతారామలక్ష్మణుల మూలవర్లకు మరియు శ్రీభక్తాంజనేయస్వామి వారికి పూలతో విశేషంగా అలంకరణ జరుగుతుంది.

## 12. వారోత్సవములు, నిత్యోత్సవములు :-

***శనివారోత్సవము:-*** ఉదయం మూలవర్లకు తిరుమలలో వలె అభిషేకం జరుగును. భక్తులు తగిన రుసుము చెల్లించి సంకల్పము చేయవచ్చు. పాలుగానీ, పెరుగు గానీ, తేనెగాని స్వామికి ఇతర అభిషేక వస్తువులు సమర్పించవచ్చు. ఈ అభిషేకములో పాల్గొని తప్పక దివ్యానుభూతిని పొందవచ్చు. అభిషేక క్రమం ఇలా ఉంటుంది.

మేళ తాళాలు, మంగళవాద్యము, వేదపారాయణలతో సంకల్పం

చేయువారు. వెండి పాలగిన్నెలను పట్టుకొని ధ్వజస్తంభం, బలిపీఠంలతో కలిపేవిధంగా పెద్ద ప్రదక్షిణం చేసి. తర్వాత స్వామి వారి ఆలయంలో చిన్న ప్రదక్షిణం చేసి. తర్వాత శయన మందిరంలో కూర్చొని స్వామి వారి అభిషేకాన్ని తిలకించవచ్చు. స్వామి వారి, అమ్మవార్ల అత్యంత మనోహర సుందర స్వరూపములను చూచే అవకాశం ఈ అభిషేక సమయములో మాత్రమే వీలవుతుంది. భక్తులు స్వామివారి నిజరూపాన్ని సందర్శించి పులకితులు కాకమానరు. సాయంకాలము ఉత్సవమూర్తులను అలంకరించి తిరుచ్చిపై నాలుగు మాడవీధులలో మహా ప్రదక్షిణ మార్గంలో ఊరేగించి తద్వారా స్వామి ఆశీస్సులను భక్తులకు అందజేయుదురు. పిమ్మట ఊంజల మండపంలో వరుసగా వేద పారాయణం, అన్నమయ్య సంకీర్తనలు, మంగళవాద్యములతో స్వామి వారికి ఊంజలసేవ జరుగును. భక్తులు తగిన రుసుము (ప్రస్తుతము రూ 116/-లు) చెల్లించి, ఈ సేవకు సంకల్పము చేయవచ్చు. తర్వాత రాత్రి గంట. నివేదన పిమ్మట సర్వదర్శనము, ఏకాంత సేవ జరుగును. శనివారము ఉత్సవము నాడు ఈ ఆలయములో భక్తులు ఎక్కువగా ఉంటారు.

వైఖానస ఆగమంలో షట్కాల పూజ విశేషంగా చెస్తారు. ప్రత్యేకంగా శ్రీ వేంకటేశ్వరస్వామి సన్నిధిలో ఈ షట్కాల పూజ జరుగును. (షట్కాల పూజ - ప్రాతఃకాలం, సంగమకాలం, మధ్యాహ్నకాలం, సాయంకాలం, అర్ధరాత్రికాలం, ఉషఃకాలంగా నిర్ణయించబడివుంది. కాలప్రమాణం సుమారు 2 గం॥ల 20 ని॥షాలు.) తి.తి.దేవస్థానముతో సంబంధం వున్న ఆలయాల్లో ఈ అర్చన కార్యక్రమం జరుగుతుంది.

ఆదివారం నాడు శ్రీ భక్తాంజనేయస్వామి వారికి పాలు, పెరుగు, తేనె. ఎలనీర్ (లేత కొబ్బరి నీళ్ళు). చందనములతో మేళతాళములు, వేదపారాయణముల మధ్య అభిషేకము జరిగిన పిమ్మట స్వామి వారిని తమలపాకులతో సుందరముగా అలంకరించుదురు. అనంతరము నివేదన అయిన పిమ్మట అర్చనలు చేయుదురు.

<u>నిత్య పూజలు</u>

ఈ ఆలయంలో సుప్రభాతం, తోమాలసేవ, సహస్రనామార్చన, మొదటి గంట, మధ్యాహ్నం రెండవ గంట, రాత్రితోమాల సేవ, రాత్రి రెండవ గంట, ఏకాంత సేవ నిత్యంజరిగే కార్యక్రమములు. ప్రతినిత్యము ఉషోదయ, సంధ్య వేళలలో, పడికావలి గోపురము వద్ద స్వామి తోమాల సేవ ముందు మంగళవాద్యములు వాయించుదురు. ఇది ఇక్కడి ఆచారము. ఏకాంత సేవలో కూడా సన్నాయి వాద్యంతో స్వామికి పవళింపు సేవ చేయుదురు.

ఈ ఆలయ వర్ణన, ఉత్సవములు ప్రస్తుతం ఉన్న, అనుసరించ బడుతున్న విధానంలో వర్ణించడమైనది.

"మంగళం కోశలేంద్రయా మహనీయ గుణాబ్దయే,
చక్రవర్తి తనూజాయ సార్వభౌమాయ మంగళం ॥
శ్రియః కాంతాయ కళ్యాణ నిధయే నిధయేర్థినామ్
శ్రీ వేంకటనివాసాయ శ్రీనివాసాయమంగళమ్ ॥"

ఓమ్ తత్సత్

హరిః ఓమ్!



# శాసనాధారములు - ఇతర వివరములు

## No. 1.

(No. 318—G. T.)

[On the right door-jamb wall (inner side) of the first gōpuram known as paḍikāvali gōpuram of the Temple of Śrī Rāmasvāmi in Tirupati.]

### Text

1 ஸ்வஸ்திஸ்ரீ விரோதிவருஷத்து
2 தை(ம்)மாஸம் ௰௮ உ ரகு-
3 நாதனுக்கு ஸ்வஸ்தி [1]ஸ்ரீமஹா[ர*]ரா-
4 ஜாதிராஜ ராஜபரமேஸ்வர
5 ஸ்ரீவீரப்ரதாப ஸ்ரீவீர [2]அச்யு-
6 தமஹாராயர்க்கு [3]புண்ய-
7 மாக குமார ராமாநுஜஅய்யங்-
8 கார் கட்டுவித்த
9 திருத்தேர் உ

### Translation

1–9. Hail, Prosperity! On the 18th day[4] of the month of Tai in the cyclic year Virōdhi, Kumāra Rāmānujayyangār constructed a wooden car for Śrī Raghunāthan (Śrī Rāma) for the merit of Śrīman Mahārājādhirāja Rājaparamēśvara Śrī Vīrapratāpa Śrī Vīra [5]Achyutarāya Mahārāyar.

1. Read ஸ்ரீமந்மஹாராஜாதிராஜ.
2. Read அச்யுதமஹாராயர்க்கு.
3. Read புண்யமாக.

NOTE 4 :—This day corresponds to 14th January 1530 A.D.

NOTE 5 :—Achyutarāya Mahārāya, the half-brother and successor of Kṛishṇarāya began to rule the kingdom when his 'coronation was first celebrated at Tirupati (Tirumalai) where he bathed in the water poured out of the conch in the hand of the Śrī Vēṅkaṭēśa' as described by the famous poet Śrī Rājanātha in his Achyutarāya. Abhyudayam canto 3, verse 23—

" प्रणामशीलः फणिशैलशासितुः कदाचिदस्मै करशंखवारिणा ।
पयोधिकान्चीपरिणेतृतास्पदे पदेऽभिषिक्तः स परम्परागते ॥"

and again for a second time at his capital Vidyānagara (=Vijayanagara). For further reference vide Tirupati Dēvasthānam Epigraphical Report page 220.

## No. 2.

### (No. 319—G. T.)

[On the face of a stone pot situated in the verandah of the kitchen in the Temple of Śrī Rāmasvāmi in Tirupati.]

### Text

1 ௳ ஸுபமஸ்து ஸ்வஸ்திஸ்ரீ ஸகாப்த ௲௪௱-

2 ௫௰௨ ன்மேல் செல்லாநின்ற விக்ருதிஸம-

3 வத்ஸரத்து நெரட்டூர் பெரிய பெருமாள்

4 புத்ரன்........நாராயணன்

5 வெ(யி)த்தத் தொட்டி ௳

### Translation

1–5. Hail, May it be prosperous ! In the cyclic year of [1]Vikṛiti, orresponding to the illustrious Śaka year 1452,........Nārāyaṇan, son of ʼeriyaperumāḷ residing in Neraṭṭūr village placed this stone pot.

## No. 73.

(No. 310—G. T.)

[On the north wall (inner side) of the front maṇṭapam of Kūrattāḻvān's shrine in the Temple of Śrī Gōvindarājasvāmi in Tirupati.]

### Text

1 ஸாஹஸ்ர ஸ்வஸ்திஸ்ரீ ஸகாப்த ஆயிரத்து ஞூற்றிரண்டின் மேற்
செல்லாநின்ற— ஸாரஸ்ரீமந்நாராயணுடையற்கு யஞமாக திருப்ப[ணி]-
—பணம் இட்டு கொயிலும் கட்டுவித்து குளாக்கை வரசி.

---

NOTE 1 :—"Pāpavināśa" is the name of a waterfall (*tīrtha*) on Tirumala (hill), which is mentioned in the "Vēṅkaṭāchala-Māhātmyam" to possess the power, as the term itself means, of destroying the sins of those that bathe in its water. It is about 3 miles to the north of Śrī Vēṅkaṭēśvara's temple, and is daily resorted to for a bath by numerous pilgrims.

2. The beginning of the inscription is lost.

3. This may be read ஆயிரத்து முன்னூற்று.

4. Read தொண்ணூற்று.

5. Read அஂஜூரிதுகு—

6. Some stones are missing at these places.

2 ஜெயும் பண்ணுவிக்கையில் இந்த ஸ்ரீவேங்கடநாதனுக்கு அமுதுசெய்தரு[1]
—[2]ட்டுக்கொண்டு இந்த நிலத்துக்கு நீர் பாயும்படிக்கு—[3]று
பணம் இட்டு வெட்டுவித்து இதுக்கு தானத்தார்
3 கோயில் வாங்கின திரியோகமும் இந்த விலம் கொண்ட சாதனங்—
[4]டு இந்த ஸ்ரீவேங்கடநாதனுக்கு அமுதுசெய்தருளும்படிக்கு [5]நா—
[6]ணன்காலால் அமுதுபடி ஆறு மரக்காலும் நெய்யமு-
4 து முழுழக்கும் பயற்றமுது முழுழக்கும் மிளகமுது இரண்டரை செவிடும்
உ—இரண்டு மரக்காலும் நெய்யமுது உழக்கும் கறியமுது—
ழியும் உப்பமுது மிளகமுது கறியமுது தயிரமுது சக்கரை-
5 யமுது பலம் பத்தும் அடைக்காயமுது பத்து இலையமுது இருபதும்
திருவிளக்[கு]—து தயிரமுது அடைக்காயமுது இருபதும் இலை-
யமுது [7]நா—அமுதுபடி இரண்டு மரக்காலும் நெய்யமுது உழ-
6 க்கும் பயற்றமுது உழக்கும் உப்பமுது மிளகமுது கறியமுது தயிரமு-
தும்—அமுது உழக்கும் சிரகம் ஆழாக்கும் நெய்யமுது உழக்கு—
7 முது உழக்கு உப்பமுது மிளகமுது கறியமுது தயிரமுது திருக்கார்த்-
திகை—பு[னி]யிதுக்கு அமுதுபடி ஆறு மரக்காலும் சக்கரை-
யமுது—[8]

**Translation**

1. May prosperity abide! (In the year Śarvari) corresponding to the aka year[9] 1402,

1-2. for the merit of Narasimharāya-Uḍaiyar, in Tirupati............... while, having invested money and constructed a temple, (the donor) installed (an image of) Raghunāthan, for the propitiation of this Raghunāthan ...........

2. having received, in order that water may flow to this land.........

2-3. having expended money and excavated (a channel), for this purpose) (having transferred) the *niyōgam* (authority or order) obtained at the hands of the *Sthānattār* and the instrument of sale of this land................

3-4. so as to propitiate this Raghunāthan daily...........6 *marakkāl* of rice (measured) with the *Chāḷukya-Nārāyaṇan-kāl*,

3 *uḻakku* of ghee,
3 *uḻakku* of green gram,
2½ *ṡeviḍu* of pepper,

4-5. 2 *marakkāl* of...........
1 *uḻakku* of ghee,
vegetables............
1 *nāḻi* of............

---

1. Read – செய்தருளும்படிக்கு.
2. This may be read இட்டுக்கொண்டு.
3. This may be read காணூறு.
4. Read கொண்டு.
5. This may be read நாள் ஒன்றுக்கு.
6. Read சாளுக்கிநாராயணன் —
7. Read காற்பதும்.
8. The inscription is incomplete.

NOTE 9 :—Śaka 1402 corresponds to 1480—81 A.C.



salt, pepper, vegetables, curds,
10 *palam* of jaggery,
10 areca-nuts,
20 betel-leaves, lamp . .........

5. curds,
20 areca-nuts,
40 betel-leaves........ ...

5-6. 2 *marakkāl* of rice,
1 *uḻakku* of ghee,
1 *uḻakku* of green gram,
salt, pepper, vegetables and curds...........

6. 1 *uḻakku*............
1 *āḻākku* of cumin seed,
1 *uḻakku* of ghee............
1 *uḻakku* ..........
salt, pepper, vegetables and curds,

(for the) Tirukkārtikai (i.e. on the day of the Kṛittika star)............
for the *tiruppudiyidu* (new harvest festival, like the May day games)
6 *marakkāl* of rice,
........... jaggery............

## No. 74.

(No. 184—G. T.)

[From a slab now preserved on a platform in front of Śrī Gōvindarājasvāmi Temple in Tirupati.]

### Text

1—ஸப்தமியும் ஸோமவாரமும் பெற்ற திருவோணத்துநா[ள்]—

2—[1]ஸிம்ஹராயமுதலியார் கோவிற் கட்டுவித்து ப்ரதிஷ்டை [2]ப—

3—[ஆ]யிரத்து முன்னூறும் திருவிடையாட்ட ஊர்களில் ஏரி—

4—[3]கொராயணன்காலால் அமுதுபடி ஒரு மரக்காலும் நெ[ய்]—

5—[4]தருளின ப்ரஸாதத்தில் விட்டவர் விழுக்காடு ப்ரஸாதம்—

6—[5]யத்தில் சந்திஅடைப்பிலெ பெற்றுவாக்கடவோம்—[6]

### Translation.

1.—on the day of Śravaṇam (star) combined with Monday, being the seventh lunar day—

2.—Narasiṁharāya Mudaliyār having constructed a temple and installed—

1. Read நரஸிம்ஹ—
2. Read பண்ணி.
3. Read சளுக்கி—
4. Read அமுதுசெய்தருளின.
5. Read பூர்வத்தில்.
6. The rest of the inscription is lost.

3.—1300 (*paṇam*) (being invested for the benefit of) tank-fed (channels) in the villages granted to the temple—

4.—one *marakkāl* of rice with the *Chāḷukya-Nārāyaṇan-kāl*, ghee—

5.—the *prasādam* forming the donor's share out of the (entire) *prasādam* offered—

6.—we shall set apart (for distribution) during the forenoon *sandhi-aḍaippu*—

## No 75.

(No. 296—G. T.)

[On the north wall (inner side) of the front Maṇṭapam of Kūrattāḻvān's shrine in Śrī Gōvindarājasvāmi Temple in Tirupati.]

### Text

1[1]—பெற்ற [2]புணர்பூசத்துநாள் திருமலையில் [3]ஸ்தாநத்தாரோம்—

2—கார் திருநாமத்தாலே இரகுநாதன் நாள்வழி அமுதுசெய்தருளி [4][உ]—

3—[5]கம் முப்பதும் இரகுநாதனுக்கு நாள்வழி திருவிளக்கெண்ணைக்கு—

4—நூறும் திருவிடையாட்ட ஊர்களில் ஏரிகால்வாய்களிலே—

5—உப்பமுது பயற்றமுது உழக்கு கறியமுது மிளகமுது தயிர்—

6—பாக்கு அடைக்காயமுது நூறு இலையமுது நூறும்—

7—[அ]முதும் முன்னாள் ரகுநாதனுக்கு கட்டளை பண்ணின—

### Translation

1.—on the day of the Punarvasu (star) combined with,......we, the *Sthānattār* of Tirumala—

2—in the name of.. ........., after Raghunāthan is (first) propitiated with offerings daily—

3.—*(tiruppōna)kam*, for the oil for the lamps (to be put up in the presence) of Raghunāthan daily—

4.—100*(paṇam* being invested for the improvement) of the tank-fed channels in the villages granted to the temple—

5.—salt, one *uḻakku* of green gram, vegetables, pepper, curds—

6.—400 areca-nuts and 400 betel-leaves—

7.—the offering, and that stipulated on a previous occasion for Raghunāthan—

1. The beginning and end of the inscription are lost.
2. Read புனர்பூச—
3. Read ஸ்தானத்தாரோம்.
4. This may be read உடையவர்.
5. Read திருப்போனகம்.

T.T.D. Religious Publications Series No. : 663
Price : Rs. 15/-

ప్రసిద్ధ పుణ్యక్షేత్రమైన తిరుపతిలో "తిరుమల తిరుపతి దేవస్థానము"ల పరిపాలనలో ఉన్న దేవాలయములలో "శ్రీ కోదండరామస్వామి" వారి ఆలయం కూడా ప్రముఖమైనది.

"తిరుపతి శ్రీ వేంకటాద్రిరాముడు" అన్న ఈ గ్రంథములో ఈ కోదండరామాలయ చరిత్రనీ, స్థల పురాణాన్ని, నిర్మాణ విశేషాలను, ఆలయంలో జరిగే సేవా, పూజ, ఉత్సవ, ఇతర విశేష విషయాలనే గాక శ్రీరాముని కళ్యాణ గుణములను, శ్రీ వేంకటేశ్వర వైభవాన్ని, ఆంజనేయస్వామి భక్తితత్త్వాన్ని, ఆలయ పరిసరములు - ఇతర విశేష విషయాలను స్వామి సన్నిధిలోనే నివసిస్తున్న ఈ రచయిత కూలంకషంగా వివరించారు.

తిరుమల శ్రీవారి ఆలయ నిర్మాణాన్ని, పూజాది ఉత్సవ (వైఖానసాగమ పద్ధతిలో జరిగే) కార్యక్రమాలని ఈ శ్రీకోదండరామాలయ నిర్మాణంతో, పూజాది కార్యక్రమాలతో పోల్చి తులనాత్మకంగా వర్ణించబడిన కారణంగానే ఈ గ్రంథమునకు " తిరుపతి శ్రీవేంకటాద్రి రాముడు" అనే పేరు సార్థకమైనది.

తిరుమలలో ఉత్సవమూర్తిని "మలైక్కునియనిన్ర పెరుమాళ్" అని అంటారు. పెరుమాళ్ అంటే శ్రీరామచంద్రులకు రూఢి. త్రేతాయుగంలోని శ్రీరామ చంద్రుడే ఇప్పటి వేంకటేశుడని పురాణాలు స్పష్టం చేస్తున్నాయి. పైగా అన్నమయ్య ఆర్తితో తన రామకీర్తనల్లో "శ్రీ వేంకటాద్రిరామా!" అని ఆలపించటం అందరూ ఎఱిగినదే !

సుప్రభాత సేవలో "కౌసల్య సుప్రజారామా!" ...... అని శ్రీ వేంకటేశ్వరుని మేలుకొలపటం ఆయన్ని శ్రీరామునిగా భావించుటయే !...... అదే విధమైన సుప్రభాత సేవతో మేలుకొలిపే తిరుపతిలోని శ్రీ కోదండరామున్ని ...... శ్రీ వేంకటేశునిగా అభివర్ణించుటయే...... "తిరుపతి శ్రీ వేంకటాద్రిరాముడు" అనే ఈ గ్రంథము.



**Printed and Published by Sri Ajeya Kallam, I.A.S., Executive Officer, T.T. Devasthanams & Printed at T.T.D. Press, Tirupati.**